శ్రీమైలవరం బాలభారతి నాటకసమాజమువారిచే
ప్రదర్శింపఁబడుచున్న

# ద్రౌపదీవస్త్రాపహరణము

ఐదంకముల నాటకము.

ఇయ్యది
బెజవాడ శ్రీకన్యకాపరమేశ్వరీ హిందూహైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులును, విచిత్రాష్టావధాని, విద్వత్కవి, నాటకచక్రవర్తి బిరుదాంకితులు నగు

బ్రహ్మశ్రీ

## మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే

రచింపఁబడినది.



ప్రకటనకర్త:
కురుకూరి సుబ్బారావు.
సరస్వతీబుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

రెండవకూర్పు 1000 ప్రతులు

కాకినాడ.
కాకినాడముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.
1930

# విజ్ఞప్తి.

ఆర్యులారా,

భారతమును, సంపూర్ణముగా నొక్క నాటకముగను, భిన్న రూపకములుగను, పలువురు రచియించియుండినప్పటికి కథాలుబ్ధమైన స్కంధమైన బెజవాడ హిందూ థియేట్రికలు కంపెనీవారికిగాను వస్త్రాపహరణభాగమును 1915 సం॥న వ్రాయమొదలిడితిని. ఆ కంపెనీవారు నానాటకములు కొన్ని ప్రదర్శించి నాటకములకు వన్నె దెచ్చిరి. ఈనాటకము ప్రదర్శించుటకగాను వారి సమాజము క్రమక్రమముగా క్షీణదశనొందుటచే సమర్థులు కాకపోయిరి. తదనంతర మీరూపకము హిందూ థియేట్రికల్ కంపెనీ కార్యదర్శిగారగు కొమ్మూరి పట్టాభిరామయ్యగారిద్వారా ఆంధ్రనాటకరంగోపాసకులు, సగుణఖనియు, దాతయు నగు శ్రీ శ్రీ శ్రీ రాజా సూరానేని వేంకట పాపారావు బహద్దరు జమీందారుగారిచే స్థాపింపఁబడి పాలింపఁబడుచున్న బాలభారతి నాటకసమాజము (వైలవరం) వారు ప్రదర్శనార్హము సైనట్టి సమర్థులగు భూమికాధారులచేఁ జక్కఁగాఁ బ్రదర్శింపఁజేసి నాటకమునకు నాకును గీర్తి సంపాదించిరి. వారు ప్రదర్శించు నాటకములలో నగ్రస్థానము వహించినవానిలో నొక్కటియై ప్రకాశింపఁజేసిరి. తరువాత పెక్కుగ్రామములయం దీనాటకమును గాంచినవారు, చదువుకొనుటకు ప్రకటింపుఁడని కోరఁగా నేఁటికి దైవయోగమువలన కురుకూరి సుబ్బారావుగారివల్ల రు 500 లు ప్రతిఫలమును పొంది వారికి సర్వస్వామ్యము లొసంగి వారిద్వారా ప్రకటింపఁగలిగితిని. మరియు నీ నాటకములో నచ్చటచ్చట నందముగాను, కథాభాగమున కనుకూలముగా నున్నస్థలముల, భారతభాగవతంబులలోని

పద్యములే వ్రాసిన బాగుగానుండునని తోచి యట్లు చేసితి. ఆయభిప్రాయమును గొందఱు పండితు లంగీకరించిరి. మఱియు నీ నాటక ప్రదర్శనము దుర్యోధనుని స్వగతభాగమును, ద్రౌపదీ దుశ్శాసనుల సంభాషణయు, షష్ఠాంకమున భీష్మ ద్రోణాదుల యుపదేశములు సమయానుకూలముగా విడువవచ్చును.

భారతమున నీభాగము కనుపించకపోయినను ద్రౌపదిని కొంచెము ప్రథమమున వీరరసోద్రేకురాలినిగా వ్రాసితిని. దాని గుణాగుణములు చదువరులు శ్రోతలు స్థిరపఱుతురుగాక.

ఈనాటకము నటుల యభీష్టానుసారముగా వ్రాసినది కావున, నాధునికప్రదర్శనానుకూలముగా నటీసూత్రధారుల సంభాషణానియమము వదలినాడ.

ఇందలి గుణదోషములు చదువరులు గ్రహింతురుగాత. మఱియు నీ నాటకము ప్రదర్శనమున మిక్కిలి ఖ్యాతికిఁదెచ్చి నాకు కీర్తి ఘటింపఁజేసిన శ్రీ సూరానేని వేంకట పాపయ్యారావు బహద్దరు జమీందారుగారు (మైలవరం) వారి బాలభారతీ నాటకసమాజము దినదినాభివృద్ధిమై చిరకాలస్థాయియై యుండునట్లును, నాకు మఱియు నిట్టిసహాయము పలుమాఱు నొసర్చుచు మిక్కిలి ప్రసిద్ధి వహించుగాత మని పరమేశ్వరుని ప్రార్థించుచు విరమించుచున్నాను.

ఇట్లు భవత్కృపాభిలాషి,

విద్వత్కవి, మల్లాది అచ్యుతరామశాస్త్రి,

బెజవాడ.



# నాటకమునందు వచ్చు పాత్రిలు.



**పురుషులు.**

1 కృష్ణుండు.
2 నారదుండు.
3 ధర్మరాజు.
4 భీముండు.
5 అర్జునుండు.
6 నకులుండు.
7 సహదేవుండు.
8 ధృతరాష్ట్రుండు.
9 విదురుండు.
10 భీష్ముండు.
11 ద్రోణాచార్యుండు.
12 దుర్యోధనుండు.
13 కర్ణుండు.
14 వికర్ణుండు.
15 దుశ్శాసనుండు.
16 శిశుపాలుండు.
17 శకుని.
18 ప్రాతిగామి.
19 కృపాశ్వత్థామాదులు మొదలగువారు.

**స్త్రీలు.**

1 ద్రౌపది.
2 గాంధారి.
3 చెలికత్తెలిరువురు.





# ద్రౌపదీవస్త్రాపహరణము.



## ప్రథమాంకము.

రాజసూయయాగసభ, యాగశాల.

[ధర్మరాజు, పట్టుబట్టలు, కృష్ణాజినము ధరించి, చేతికి లేడికొమ్ము గ్రహించి సోమిదమ్మవేషముతో కుడిప్రక్కను కూర్చుండవల యును. ధౌమ్యుఁడు ప్రక్కనుండ వలయును.]

[భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు, శ్రీకృష్ణుఁడు, భీష్ముఁడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శిశుపాలుఁడు, ఇతర రాజులు, నారదుఁడు, మఱికొందఱు ఋషులు కూర్చుండవలయును]

నార—(స్వగతము) ఇది ధర్మజ రాజసూయ సమాప్తి దివసము. మఱియు నిది నానాదేశాగతరాజలోకమహోల్లాస విలసితంబును, పాండునరనాథ స్వర్గారోహణసుముహూర్తంబును, సమస్తదీనజనదారిద్ర్యనిర్వాపణసత్సస్యకేదారంబును, కపటమాత్సర్యాద్యవగుణ మదాగతచ్ఛాగవిచ్ఛేదనసూనాపణం బయి యొప్పుచున్నది. ఇప్పు డొకదురాత్ముఁడు చావనున్నాఁడు. నాకుంచె విప్పి యీ కాలంబునఁ దాండవమాడు సమయము వచ్చినది. శూరంమన్యుల మనంబులు వేగలునటుల రెండు మాటలు చెప్పి, పరిపంథిమనోదవానలంబుల రగుల్చెద. (ప్రక

టముగా) ధర్మనందనా! యేమి నీపుణ్యము. ఇట్టి జన్మము-
నే నీయుగమునందే గాదు యేయుగమందు చూచియుండలేదు.
సవనాలోకన కుతూహలసమాగత జనోపచారంబులకు నీవు
నియోగించినవారిలో,

సీ. అర్థిజాలము గోరి । నట్టి వస్తువు లెల్లఁ
దగఁ బంచి యిచ్చె రా । ధాసుతుండు
సరసాన్నపానాది । సకలపదార్థముల్
పాకముల్ చేయించె । పవనసుతుండు
పంకజోదరునొద్దఁ । బాయక పరిచర్య
దవిలి కావించె వా । సవసుతుండు
క్రియ నిమిత్తంబయిన । ద్రవ్యంబు లెల్లను
దెప్పించె వేగ మా । ద్రీసుతుండు
దేవగురు వృద్ధధాత్రీసు । రావలులను
దివిరి పూజించెగా సహ । దేవుఁ డిపుడు
దివ్యమృష్టాన్నములను సం । తృప్తిఁ జేసె
నఖిలజనులను ద్రౌపది । యమతనూజ!.

వేయిమాట లెందులకు, యజ్ఞఫలప్రదాతయయి, బ్రహ్మాదిసురగణ
ప్రార్థితుఁడయి, భూభారావతరణార్థముగ మనుష్యసామాన్యుఁ
డయి, యదువంశంబున నవతరించిన నారాయణుండు శ్రీకృ
ష్ణుండు నీ కేడుగడయై బంధుఁడై ప్రాపైయుండ గొఱంతయేమి?
భయమేమి? మఱియు నీజన్మము కలహాభోజనుండ నగు
నాకు సంతసదాయకమయి జగజ్జనజేగీయమానమైనది. ఇంక
సభాపూజ గావించి పరిపూర్ణమనోరథుండవై యానంద
మొందుము.

ధర్మ—మహాత్మా! యమరగ్రవర్యు లగుదేవరవాక్యము లమోఘములు. విశేషించి యివి నాకు వరప్రదానములు. సాధువులు దయామయులు గావునఁ బరుసవేది యినుమును సువర్ణముఁ జేయునట్లు మావంటివారిని యొనరించు స్వల్పసేవలను బెద్దంగఁ బరిగణించి మమ్ము ధన్యులఁ జేయుదురు. మీయానతి యాజకఋత్విక్సభాసదుద్విజపూజ నొనరించెద. దానిక్రమంబు, దాము పరికించి, యగ్రపూజార్హుని నిర్ణయించి, నన్నుఁ గృతార్థునిఁ జేయవేఁడెద.

నార—ధర్మనందనా! కులవృద్ధుఁడును మహాజ్ఞానియు నగు భీష్ముండును, అసమాన శేముషీమనీషియగు సహదేవుండును, అగ్రపూజార్హపరీక్షకులు వారియనుమతి, భువనైకస్తుత్యము. సర్వజనసమ్మతము. అమిత ఫలదాయకము. దీని కీయోజయేల? యజ్ఞఫలదాతకన్న పూజార్హుఁ డెవఁడు.

శిశు—ఆహా! బ్రహ్మమానసపుత్రునివాక్చతురత! యజ్ఞఫలదాతకన్న పూజార్హుఁ డెవఁడనియు, నారాయణుండే శ్రీకృష్ణుఁడనియు, రవ్వపోసులవలె రెండుమాటలుచెప్పి, భీష్మసహదేవులచే దాని బలపరుప నెంచుచున్నాఁడు. (ప్రకటముగా) సభాసదులారా! ధర్మనందనా! నీతిశాస్త్రమందు పూజార్హుల నియమింపఁబడినవారినిఁ బరిగణించుఁడు. స్నాతకుండు ఋత్విజుఁడు ఇష్టుఁడు గురుండు వీరు పూజనీయులు. వారిలో గుణగరిష్ఠులు పూజార్హులు. ఓ కౌరవాన్వయ వంశవర్ధనా! త్రిభువన జేగీయమానప్రతాపవంతుఁడై నిఖిలరాజచక్రనియామకుండవు వంద్యుఁడవు పూజ్యుఁడవు గావున, మూర్తీభవించిన వేదశాస్త్రప్రపంచములనదగు శ్రీకృష్ణుం డర్చ్యుం డని నా నిశ్చయము. మరియు,

ఉ. కాలము దేశముం గ్రతువు ♦ గర్మముఁ గర్తయు భోక్తయుం జగ
జ్జాలము దైవము న్గురువు ♦ సాంఖ్యము మంత్రము నగ్ని యాహుతు
ల్వేళలు విప్రులుం జనన ♦ వృద్ధి లయంబుల హేతుభూతముల్
లీలలు దానయై తగ వె♦లింగెడు నెక్కటి తేజ మీశుఁడుం.

కావున నట్టి పరమాత్మయే యగ్రపూజార్హుఁడు......

సహ—సభాస్థలి నారదాదేశము నేనుగూడ నెఱవేర్చవలసినదే. సభాసదు లీచిరుతవాని పలుకు లాలించెదరు గాక. యదుకులసంభవుండైన శ్రీకృష్ణుం డర్చితుండైన బ్రహ్మాండోదరమధ్యస్థములగు సకలజీవరాసులు పరితృప్తిఁ జెందుటకు సందియంబు లేదు. అన్నయ్యా! యొక్కటి యోజనసేయుఁడు. జన్మజన్మాంతరములయందు మనమును యీపరిషద్గణంబును చేసిన పుణ్యవిశేష మేమనవచ్చును. ఇదుగో పూజార్హుఁడు,

చ. ఇతఁడె యితండు, గన్ను లొక ♦ యించుక మోడ్చిన నీచరాచర
స్థితభువనంబులన్నియు న♦శించు నితం డవి విచ్చిచూచినన్
హితతములై జనించు, ప్రభ♦విష్ణుఁడు విష్ణుఁడు నైనయట్టి యీ
క్రతుఫలదుండు గా నొరుఁ డొ♦కండె యుల ర్హుఁడు శిష్టపూజకున్

ఉ. ఈపురుషోత్తముం జగద♦ధీశు ననంతుని సర్వశక్తుఁ జి
ద్రూపకు నగ్రపూజ పరి♦తోషితుఁ జేయ సమస్తలోకముల్
వేపరి తుష్టి నొందు పృథి♦వీవర! కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడ♦సేయక మాటలు వేయు నేటికిన్.

యోగిజనధ్యానగమ్యుండు, భక్తార్తిపరిహారకుండు, సకలోపాధ్యంతరనిబిడీకృతదివ్యతేజుండు, జగదుత్పత్తిస్థితిలయకారణభూతుండగు పరమేశ్వరుం డర్చ్యుండు గావున నీపూజాద్రవ్యంబులవానిక ర్ఘ్యంబిమ్మఁడని యీకొండిక ప్రార్థించుచున్నాఁడు. (అని పూజాద్రవ్యముల ధర్మరాజున కందిచ్చుచున్నాఁడు.)

ధౌమ్యుఁడు—యుక్తాయుక్త పరిజ్ఞానదక్షుండు సహదేవుఁడు చక్కఁగఁ బరిశీలించినాఁడు. బ్రహ్మాదు లనేకవిధములఁ బ్రయత్నము లొనరించి సేవింపనెంచిన దురాపమగు పరబ్రహ్మము నీయింట బంధువై, చెలికాఁడై, మఱందియై, గురువై, యిష్టుఁడై నీ కరుద్యేండగుటకంటె, నీజనికి సార్థకకార్య మేమికలదు. పూజింపుము.

ధర్మరాజు—(కృష్ణునకు వినయముతోఁ దాంబూల మొసంగి) మహాత్మా!

మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ । బ్రత్యక్షంబునంగాన నె
వ్వారికిం బోలదు, శాస్త్రగోచరుఁడవై । వర్తింతు వీసృష్టిముం
దర, సద్మాప్తుఁడవైన నీవలననే । ధాతాద్యమర్త్యుల్ జనిం
చిరి నాపుణ్యము ఫలించిదై యిటుల నిన్ । సేవించఁగాఁ గల్గితిన్.

దేవా! కర్మమూలంబులైన పాణిపాదంబులు లేనివాఁడవయ్యు, స్వతంత్రుఁడవు గావున బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుందురు. మఱియు నోమహాత్మా! స్థిరచరరూపంబులయిన చేతనకోటికి నీవు సర్వనియంతవు గావున, నీకృపావలోకనంబు గలవారికి మోక్షంబు కరసిద్ధం బయియుండు. భవత్కృపాకటాక్షంబు ప్రసరింపఁజాలని కష్టాత్ములు దుర్గతిం గూలుదురు. కాష్ఠాంతర హవ్యవహునిచందంబున సర్వవ్యాపకుఁడవై, యతీంద్రియుఁడవైన నీవు కర్మచక్షువులకుఁ బ్రత్యక్షమై, యీయర్చఁ బరిగ్రహించుట క్షీరాబ్ధివాసివగు నీ వాయశోదా స్తన్య మాశించు విధంబుగాన నన్ను ధన్యాత్ముం జేయుము. కృష్ణా! నీకన్న నా కాప్తబంధువు త్రికరణశుద్ధిగా లేఁడని నీయెదుట వచియించుచున్నాను. నాజన్మము పరిపూర్ణమయిన దనుటకు సంతసించుచున్నాను.

ఉ. ఎవ్వరు నీపదాంబుజము । లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠులై
ఎవ్వరు నిన్నుఁ బ్రేమ నుతి।యింతురు భూరివివేకశాలులై
యవ్విమలాత్ములందుదు రు।దంచితశోభననిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగఁ గృష్ణ! నిను । నేర్చి భజించఁగఁ జేయు మెప్పుడున్.

దరిద్రుఁడు జీర్ణతంతువున సంతసించునటుల నీ వేసవనుస్మృతిఁ గైకొని సవనఫలదాత వగుము.

ద్రో।।—మహాజనసాంసర్గ్య మెట్టివారికి గౌరవ మొసఁగక తప్పదు. తామరాకుపైఁ బడ్డ యుదకబిందువులు, ముత్యపుకోవలట్లు ప్రకాశించుట లేదా? భక్తజనపరతంత్రుఁడగు శ్రీకృష్ణునిఁ బూజించుటఁ గనులారఁ గాంచి కృతార్థుండనై యానందాబ్ధి మునుంగఁగల్గిన భాగ్యము నీ గురుత్వమున ఘటిల్లిన వైభవము సుమా! ధర్మనందనా! యుష్మదనుగ్రహంబునఁ గనులు గలిగినఫలం బనుభవించితి.

శిశు—బాపురే! యేమికాలమహిమ! దురవగాహముగదా! నిన్న మొన్న గన్నుదెఱచిన చిన్నికుఱ్ఱలందఱు పరమధర్మోపన్యాసవేత్తలయి సాగివచ్చినటులఁ బ్రపంచమున మాకెదురు లేదని మిట్టిపడుచున్నారు. నీతి నట్టేటఁ గలిపి పాత్రాపాత్రవివేచన లేక విజ్ఞాననిపుణులు, యున్నతసత్త్వగరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమశీలురు, అనల్పతేజులు, మహదైశ్వర్యశక్తిధరులు, అఖిలలోకపాలపూజితులు, పరమయోగీంద్రులు, విగతపాపులగుశూరులు, పండితులు, పెద్దలు, వేనవేలు నిండియున్న నిండుపేరోలగంబున వివేకరహితులై, గోపాలబాలుని బూజసేయుటకు నీపాండవులు సమ్మతించుట వేదమంత్రపూతం బయిన పురోడాశము పెంపుడుకుక్క కొసంగినట్లు. కర్మభ్రష్టులగుటయేగాక ఆహూయమానులయిన రాజులను, యోగి

బృందంబులను, హానిగణంబులను, మితిలేని యవమాన మొ
నరించినవార లయిరి. ధర్మరాజా! నీ నామము నేటికి నేతిబీర
వలె వ్యర్థమై, యర్థశూన్యమయి, లోకవంచక మయినది. స్నే
హపక్షపాత మెంతలనీచునైన నుత్కృష్టునిం జేయకపోవదుగదా?
ఏసద్గుణము పరికించి పశువులకాపరికి నగ్రపూజనొనరించితివి?

మ. కులమా? గోత్రమ? పేర? యూర? సభలోఁ గూర్చుండఁగా నర్హుఁడా?
కలదా విద్యయు పౌరుషంబ? గుణవిఖ్యాతుండ ధర్మాత్ముఁడా?
తలయుం గడ్డము పండునట్టివయసా? తార్ప్రెందు గోపాలు నే
ఫల మాసించితొ పూజసేయుటకు సంపద్గర్వమా ధర్మజా?

సీ. గురుదేవ శూన్యుండు కులగోత్రరహితుడు
తలిదండ్రు లెవ్వరో తెలియరారు
అప్పులఁ బోరలెడు నాదిమధ్యావసా
నంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కు భంగుల వర్తించు
వావివర్తనములు వరుస లేవు
పరికింప విగతసంబంధుండు దలపోయ
మానిమిత్తంబున మాననమ్యొ

గీ. బరగ మున్ను యయాతి శాపమునఁ జేసి
వాసిదక్కిన యీయదువంశమెల్ల
బ్రహ్మతేజంబు నెల్ల గోల్పడిన యితఁడు
బ్రహ్మఋషిసేవ్యుఁ డగునె గోపాలకుండు?

మున్నెప్పుడో రానున్న కలియుగంబున శ్వపచులు రాజులై కులంటలు
సతీధర్మబోధకురాండ్రయి, తాగుబోతులు ధర్మోపన్యాసకు
లగుదురని వ్యాసుండు భవిష్యత్పురాణంబున రచియించె

నది యీయుగంబుననే ప్రత్యక్షమయ్యెను. ఇట్టి యపూజ్య పూజ్యాసదనంబునఁ బ్రాజ్ఞులు నిల్వఁగూడదు. పాపభూయిష్ఠం బయినపరిషన్మధ్యంబున నివసించినవారికిం గూడ దుర్వారపాప కళంకం బబ్బుఁ గావున బుద్ధిమంతు లట్టిసభాస్థలినుండి లేచిపో వుటమంచిది. (అని శిశుపాలుఁడు, దుర్యోధనకర్ణాదులను లేవం డి, లేవండి యని ప్రోత్సాహపరుపవలయును.)

ధౌమ్యు—శివశివ! నేఁ డెంతదుర్దినమో! భగవద్దూషణ విననలసి వచ్చినది. ఈదోషమునకు నిష్కృతి గలదా? సమస్త దోషముల నశింపఁజేయు పరమాత్మ శ్రీకృష్ణుని నిందించిన పాపాత్ముని పాపంబునకు మేరకలదా? వీనిముఖము సూచిన నఘ మమోఘము గావచ్చును. ఇట్టివానిని బహిష్కృతునిఁ జేయవలయు.

ధర్మ—(శిశుపాలుని గూర్చుండఁబెట్టి) అకటా! శిశుపాల! యెట్టి యజ్ఞానివైతివి. సమస్తజగదాధారభూతుండగు పరమేశ్వరుని నిందించి లోకంబున మననెంచితివా? భీష్ముండు వెఱ్ఱివాఁడా? ధర్మపరిశీలనాదక్షుండు కాఁడా? సద్గుణవంతు లయి ధీరులగు ధరణీవల్లభులకు యుక్తాయుక్తవిచారదూరమగు వాక్పారుష్య ము చెల్లునా? అయ్యది శేషదంష్ట్రాగ్రోగ్రక్రూరక్ష్వేళవహ్నికం బును సంవర్తసమయావిర్భూత బడబానలముకంబును భయం కరము నాశంకరముగాదా? ఇప్పుడు జరిగినది యకార్యమా?

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాదిసమస్తవాఙ్మయము లందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁడని యాత్మఁ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పె పూజ్యుఁడని యుక్తముకాకిది యేమిదోసమే.

ఓయి సాత్వతేయా! సమస్తలోక గురుఁడని, విశ్వసృష్టికలనా ప్రధానబీజాంకురమని, పరమార్థ ప్రతిభాజ్ఞానతమోహరుం డని, నీకంటె వృద్ధతములైన నరేశ్వరులు, ఋషీశ్వరులు, యదువంశపావను నచ్యుతుం డుగా నంగీకరింప, నీవేల యింతరద్ది సేసెదవు. పెద్దలచరితంబులు దుర్గ్రాహ్యంబులు. సోదరా! ముఖ్యబంధువగు నీవే నిష్కారణకలహమునకుం గాలుద్రవ్వ నీకార్యము నిర్విఘ్నముగా నెఱవేర్ప నెవరుచూచెదరు. ఆపరాత్పరుండగు యాదవునిమహిమ సామాన్యులు గుర్తెఱుంగుదురా? (అని బ్రతిమాలును.)

భీష్మ—ధర్మనందనా! దురాత్ములు రంధ్రాన్వేషణ తత్పరులు సాను నయవాక్యముల శాంతులగుదురా? ఈదమఘోషసుతుండు నీకు మాతృష్వసేయుండైనను, దుష్టకాలవాలుండు.

ఉ. పాలితదుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీనినేల భూ
పాలక! నీవు మన్నింపవలెను పక్షము లేరి ధర్మ మెఱుంగ వీనికిం
బోలు నె, రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్.

జగత్ప్రకాశకరుండగు సహస్రకిరణుండు గూబలకు పరిపంథి యగునట్లు, దుష్టదానవ మదఖండన పండితుం డగు పుండరీకాక్షుం డు, నిగమసీమంతినీసీమంతవీధీవిహారస్మృదుపదయుగళుండు పరమయోగిజనహృదంబుజహంసి శ్రీకృష్ణపరమాత్ముని మహామహిమ వీఁ డీజన్మ కెఱుంగఁగలఁడా? కారుదున్న తామరకొలనులో బ్రవేశించి పండుకొన్నను తత్సరోవరపంకంబు గాంచుగాని, పద్మసౌగంధ్య మెఱుఁగునా? జన్మాంతర తపఃపరిపాకవశంబున, పరమేశ్వరునియందు రక్తియు, భక్తియు ప్రాప్తించవలయును గాని సద్బోధనల చేకూరునా? వీనినేల

ప్రతిమాలెదవు, ఓయి శిశుపాల! పరమేశ్వరనిందకుండవు నీతో
ముచ్చటించకూడదు. కాని, భూతదయాసౌహార్ద్రప్రేరణచే
నిట్లు పలుకఁజొచ్చితి వినుము.

చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి నీవు మూ
ర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్ సభలోన నున్నయీ
యవనిపులెల్ల నాతని దయం బరిముక్తులు, వానిచేత నా
హవజితులుం దదీయ శరణార్థులు గా కొరు లయ్య చెప్పుమా.

వ. యవిదితబలపరాక్రమపౌరుష! ఉత్తమజ్ఞానార్థవేత్త యగువాఁడు
బాలుండయ్యును, వయోవృద్ధులగు బ్రాహ్మణులలో నగ్ర
పూజ్యుండు. అమితవిక్రమపరాక్రముం డైన క్షత్రియజాతి
పురుషుండు పసివాఁడైనను, క్షత్రియజాతి కగ్రపూజ్యుండు.
ఈ రెండు కారణంబుల మురారాతి, యగ్రపూజార్ఘ్య
పాద్యాదులకు యోగ్యుండు. అంతియే కాక, యీతఁడు
జగదాధారుఁడు, శృతిసీమంతినీసీమంతశృంగాటకన్యస్తపాద
సరోజుఁడు. మాకును నీకుమాత్రమె కాదు. చరాచర
బ్రహ్మాండానీకంబులకెల్ల వంద్యుండు, ఆలవాలంబునఁ బోయు
జలంబు సమస్తవృక్షవ్యాపకమయి పుష్టినిచ్చునట్లు యీదేవ
దేవునిఁ బూజించి, తృప్తిజేసిన లోకంబులెల్లఁ బరితుష్టినొందు.
ఓయి పిచ్చివాఁడా! ఏండ్లు చెల్లినవా రొకలక్షయున్నను,
బుద్ధి, విద్య, పౌరుషము, జ్ఞానము, ఎవనికి విశేషముగాఁ గల
వో వాఁడు పూజ్యుఁడు గాని, వయోవృద్ధు లగుదురా? ఆకా
రము వయస్సు పరాక్రమహేతువు లగునా? ఏనుఁగు సిం
హంబుచేఁ జంపఁబడుట లేదా? పౌరుషపరాక్రమములు లాజన్మ
సిద్ధములై, స్వయంవ్యక్తములు కాని, యహంకారముచేత
నెఱువు తెచ్చుకొనఁదగినవి కావు. ఈసభాసదులోనే కాదు లోక

త్రియమం దగ్రపూజ్యుఁడు కృష్ణుఁడే గాని యితరు లెవ్వరు
లేరు. ఇది నానిశ్చయము.

సభ్యులు—సత్యము. సత్యము. సత్యము. (అనవలయును)

సహదే—ఓయీపితామహా! మీరేల వ్యర్థముగా మూర్ఖుండగు శిశు
పాలునితో వాగ్వివాదము సల్పెదరు? సంకల్పమాత్రమునఁ
జరాచరముల నిర్మించుభగవంతుండు శ్రీకృష్ణుండు, పూజ్యుం
డని పూజించినారము. ఇంకను పూజించెదము. దుర్మార్గం
బగు నిది కాదనిపల్కువీరవరుల నెత్తిపై నా యెడమపాదం
బిడుచున్నాను. పౌరుషవంతులగు క్షత్రియవీరులు డీకొనుఁడు.
తిరుగ మఱియొకమాఱు సహదేవునిమాటలను వీనులొగ్గుఁడు.

చ. సలిపితి మగ్రపూజ మురశాసనుఁ డుత్తముఁ డటంచు, వానిపై
చలమున నింద లాడెడు నృశంసుల నెత్తిని వామపాదముఁ
నిలిపెదఁ బౌరుషంబున నవిన్ మసు గల్విఁను, చేతఁగానిచోఁ
దల నిలమోపి కృష్ణునకు దాసను నెవ్వఁడు చేతు లొగ్గుచున్.

ఎంతు; డీకొనువారలు రండు.

అర్జు—సోదరా! వీరపురుషోచితమైన వాక్యము పల్కినావు. నీమా
టకు దేవతలు కుసుమవర్షము గురియించుచున్నారు. వీరవరు
లారా! ఋషిపుంగవులారా! అశేషబ్రహ్మాండభాండోదరుఁ
డెయిన పుండరీకాక్షుండు గర్హ్యుండని నిందించినదురాత్ముని
వాక్యంబు లాకర్ణించి, యదు, వృష్ణి, భోజ, కుకుర, అంధక
వాహినులన్నియుఁ గలఁగి ఘోరుచున్నవి. నామస్మరణమాత్ర
భస్మీకృతపాపసంచయుఁ డగు నారాయణావతార మయిన
శ్రీకృష్ణుని నిందించిన వానికిం బ్రత్యుత్తరం బొసంగి, మీ
మనంబునకు శాంతిఁ గల్పించుచున్నాను. వినుండు.

ఉ. చేసిన దేమొ చేసితిమి । సిద్ధము కృష్ణుఁడు లోకపూజ్యుఁడే
రోసము గల్గి తిట్టెడు న।రుంతుదు సభ్యులు సూచుచుండఁగాఁ
గోసెద గాండివంబునను । గొంతు కరక్కున రక్తవాహినుల్
దోసిట నగ్గిఁ జల్లుజయ।దుర్దముఁ డీవిజయుండు గాంచుఁడీ.

యుక్తాయుక్తతారతమ్య మారయక, వక్రాలాపంబు లాడు వారి కెయ్యది సంప్రాప్తమగునో చూపించెద.

శ్రీకృ—(సోదరుని కౌఁగిలించుకొని) పార్థా! పవిత్రింబగు గాండీవ మరణ మీదురాత్మునకుఁ బనికిరాదుః వానిఁ దుదముట్టించుట యిట్లు—

ఉ. పాదముక్రింద వీనినొక । ప్రక్క పరుండఁగఁ బెట్టి తొక్కిపై
పాదము తాటిమట్టవలెఁ । బైకెగలాగుచుఁ జీల్చి చీల్చి యా
పాదశిరంబుఁ గారమిడి । పాపునిఁ, గృష్ణుని నిందఁ జేయుమా
క్రోధముదీరెనాయనుచుఁ।గ్రుచ్చుచుఁదన్నుచుఁ గ్రాణమూడ్చెదన్.

అపరాధమునకుం దగిన శిక్షవిధించకున్న ధర్మవేత్తలకుఁ బాపమబ్బ గలదు. సభాసదులారా! కుడిచి కూర్చుండి, యకారణకలహంబుఁ బెంచువానికి, నానిర్ణయించినశిక్ష చాలునో చాలదో యనిశంకించుచున్నాను. ఇటు వినుండు.

సీ. అరచేత నున్నట్టి । ధరణీతలంబు వ
ర్జించి సత్కీర్తి నా।ర్జించినాఁడు
గార్హస్థ్యధర్మంబుఁ । గడఁద్రోచివర్ణియై
గురుభక్తి ననురక్తి । గురిసినాఁడు
గురువరుం డైనట్టి । పరశురామునిఁ గొట్టి
జట్టియై నీతి చే । పట్టినాఁడు
కాశీశుకన్యల।కై రాజచక్రంబు,
బెగడొంద నని సేసి । నెగడినాఁడు

పరమపావని గంగాభవానికడుపు
పంట యాచును ధన్యుఁగాఁ బరపినాఁడు
శాంతగుణరూప మైనట్టి సత్యవాది
భీష్ముఁ డెఱుఁగని ధర్మంబు పృథివిగలదె?

ఇట్టి పరమపావనుని, యాజగత్కారణుని, యాధర్మమూర్తిని నిష్కారణముగా నిందించిన వీనిరక్తంబు మైపూఁతఁ బూసికొనకున్న కోపాగ్నిరూపితదావానలంబు చల్లారదు. ఇది యాగశాల, కావున దూరంబుగాఁ గొనిపోయి సంహరించెద.

(అని దుముకుచున్నాఁడు.)

భీష్మ—(పట్టుకొని) ఓయి ప్రభంజనతనూజ!. తొందర నొందకు. వీనిచరితం బొకండు వినఁదగు. ఈదురాత్ముండు చేదివంశంబున దమఘోషుం డను వానికి సాత్వతికి చతుర్భుజ లలాట నేత్రంబులతో నుదయించి, రాసభస్వరంబున నేడ్చుచున్నఁ దలిదండ్రులు వీక్షించి, భయవిస్మయాధీనమనస్కులయి తొట్రుపడుచుండ నశరీరవాణి, ఓభీతులారా! వీని నెవ్వరు చంపఁగలరు. వీని నెవ్వరెత్తుకొనిన, మిగిలియున్న బాహుయుగళంబును, మెక్కుడుకన్నును, నడంగునో వానిచే వీనికి మరణంబనివాకుచ్చె. వార లాయశరీరవాణిపలుకు లాలించి, యాబాలునిఁ జూడవచ్చిన వారికెల్ల నెత్తుకొన నిచ్చుచుండె. ఇట్లుండ,

చ. అతివికృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోడ సా
త్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁగోరి యద్భుత
ప్రతిములు రామకేశవులు పన్నుగ నేగిరి చేదిధారుణీ
పతిపురి కొక్కనాఁ డఖిలబాంధవమంత్రిసుహృత్సమేతులై.

వచ్చినవారిం గాంచి, యతిథిసత్కారం బొనరించి, యబ్బాలు శ్రీకృ

ష్ణుని చేతి కిచ్చిన నాశిశుపాలుని యొక్కడు బాహువులు, మిక్కిలి నేత్రము, పలువురు సూచుచుండఁగ నడంగె. అప్పు డాసాత్వతి మురవైరివలన వీనికి మరణం బెఱింగి, జగద్వల్లభుం డైన జనార్దనుని, దుర్మార్గప్రవర్తనుం డయినను కుమారుని శతాపరాధంబులు సైరింపు మని బద్ధాంజలియై ప్రార్థించె. కావున శతాపరాధంబులు నిండుదనుక, వీఁ డన్యులచేఁ జచ్చువాఁడు కాఁడు. వీఁ డిప్పుడే కృష్ణుని చేత నిహతుం డగు. అట్లు కానిచో,

సీ. కనువిచ్చిచూచిన । క్షణములో జగములు
కల్పించి బ్రోచించు । శిల్పివరుఁడు
శ్రుతిసతీసీమంత । శృంగాటకంబున
నాట్యమాడెడు పాద । నలినతలిదు
కల్పాంతజలధి లో।కములు మునిగిన వెన్క
మఱ్ఱియాకునఁ దేలు । కఱ్ఱివేల్పు
బ్రతుకు ప్రాణులు జీవి । ఫలంబులను వ్రాయు
బ్రహ్మదేవుని గన్న । వన్నెకాఁడు
సాధుసంరక్షణార్థ మీ । జగతియందు
దుష్టశిక్షణఁ జేయఁగ । దొడరువాఁడు
భక్తవత్సలుఁ డార్తార్తి । పరిశమనుండు
పరమపురుషుని దూషించి । బాగుపడునె?

మరణకాలాసన్నచిత్తుఁడు కావున, వాని వాక్యంబుల కేను లక్ష్య పెట్టను గాని,

చ. ఇతనికి నిట్లు నన్నురక । యొగ్గలు వల్కఁగఁబోలెఁ గాక యు
ద్ధతమతి నన్య లీతని వి।ధంబునఁ బల్కి మదీయచాపని

ర్గతచటులోగ్రమార్గణని। కాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితులయి పోవ నేర్తురె గభీరపరాక్రమ మారుతాత్మజా !.

మఱియు నీతని ననుసరించినవా రందఱు నీతనితోడివా రగుదురు.

శిశు—ఓయి గర్వపోతా ! వెఱ్ఱితాతయ్యా ! నీబుద్ధి పెడతలఁ బట్టినది. నీవేమో ధర్మవేత్తవని యీధర్మనందనుండు ని న్నాశ్రయించి యోడతోఁ గట్టిన యోడవోలె; విగతమర్యాదుం డయ్యె. కృష్ణుని బుజమున వేసికొని, యేమో బిభీషిక లాడుచున్నావు ? ఈరాజవరేణ్యు లందఱు ధైర్యహీనులా ? నీవంటి దురాత్ములు గలరా ? ఈగొల్లవానియం దేసుగుణము కనిపెట్టితివి ? ఈదుర్మార్గుఁ డొనరించిన మహాపాపములకు మేర కలదా ? ఇంక విను.

సీ. స్నానంబు సలుపు లే। జవరాండ్ర చీరలు
కాఁజేసినందుకా। పూజ యిపుడు
పుట్టినప్పటినుండి। పొరుగిండ్ల వెన్నలు
హరియించినందుకా। యర్ఘ్య మిడుట
యాంబోతులను బట్టి। యార్వంగ నార్వంగ
వధయించినందుకా। పాద్య మిడుట
గొల్లపూఁబోండ్లతోఁ। జల్లులాడెడు నేర్పు
కలిగియున్నందుకా। కట్న మిడుట
అంగ చాలును కట్టు పం। చాంగ మింక
పొగడుకొనఁబోకు చాలించు। మూయు నోరు
చాల దోకనాల్క శ్రీకృష్ణు। సన్నుతింప
నూరుచీల్కలు చేతు నో। గోరి భీష్మ!

ఓయి వదరుపోత ! యీసభవారు వీనులు, కన్నులు, లేనివారనియా నీయభిప్రాయము ? ఈపసులకాపరి స్త్రీవధ, గోవధ

మాతులవధ నొనరించుటయే కాక, జారుఁడు, చోరుఁడు కులహీనుఁడు, మానహీనుఁడు, అపస్మారి గదా, యేమొగము పెట్టుకొని పూజార్హుఁడని బారలు చాపుచుఁ జక్కట్లు దిద్ద వచ్చితివి? "తా నొకమనిషి, తవుఁడొక రొట్టె" అనునట్లు, పరుని వలచినకాంతను బలాత్కారముగా హరించి తెచ్చిన నీవు ధర్మంబు చెప్పువాఁడవా? నీవట్టి పాపకార్య మొన రించినను నీతమ్ముఁడు విచిత్రవీర్యుఁడు ధర్మాత్ముఁడు, దానిని విడిచిపుచ్చె. నీజీవమున కుసూరుమని యేడ్చియేడ్చి, యంబ బలవంతముగాఁ జచ్చినది. తగవు చెప్పవచ్చిన గురువుతో దెబ్బలాడిన గురుద్రోహివి. జననిందితమయిన యనపత్య దోష మొకటి గలిగి యెన్నఁడోచచ్చిన ప్రేమూలనో పడియుం డక, పెద్దమనిషివలె ధర్మోపన్యాసములు పలుక వచ్చి నాలు గు బిభీషికలు పలికినంతమాత్రముననే తాటియాకుల చప్పు ళ్ళకుఁ గుందేళ్లు జడియునని యెంచకుము. నీవంటి కపటధర్మ వేత్తల నెందఱినో నే నెఱుంగుదును. నీతో ప్రసంగ మెందుకు? నీ వేమిలెక్క?

భీష్మ—ఓయి శూరంమన్య! వ్యర్థప్రలాపంబు లాడి, నీయవివేకంబు వెల్లడిసేసికొంటివి. పరుల క్షేమమును, విఖ్యాతినిఁ గాంచి యోర్వలేనివారు నీవలె వృథాకలహము పెంచి నిర్విఘ్నముగా నెఱవేఱుశుభకార్యములఁ బాడుసేయ నెంచి,కీలోత్పాటనంబు న, బీజంబులు నలిగి చచ్చినక్రోఁతివలెఁ బ్రాణముల నెడఁ బాయుదురు. దేవదేవుఁడగు శ్రీకృష్ణపరమాత్ముని యచిం త్యవైభవంబు నీకుఁ దెలియునా? అది మహాయోగిజన వేద్యంబు.

గీ. పతితపావనుఁ డార్తార్తిభారహరుఁడు
యజ్ఞఫలదుండు పరమాత్మ యదుకులుండు
వాని మహిమంబుఁ దెలియఁగా నౌనెనీకు,
గ్రుడ్డివానికి రూపంబు గురుతుపడునె ?

లోకంబున వస్తుజ్ఞానంబు దెలియనివారు, తెలియనట్లుండినఁ బ్రమాదంబు సంభవించదు. నీవంటి మూర్ఖులు, తెలియనివిషయంబును లోకవంచకులై వస్తుతత్వంబును పరిశోధించినట్లు ప్రజ్ఞావిశేషంబులు చెప్పుకొనుచు, ధర్మవేత్తల నాక్షేపింతురు. కుకవులు మహాకావ్యంబులం జూచి, సారమేయంబులు గజసందర్శనవిహ్వాలీకృతమానసంబులై యఱచినట్లు వాపోయినను, యాదివ్యశక్తి హుతాశనకీలలు మహారణ్యంబులఁ గాల్చినట్లు, దుర్మార్గారణ్యంబులఁ గాల్చకమానదు. న్యాయమైన కార్యంబునఁ గేవలవాగ్వ్యయము. ఇది యెవరు పరిశీలింతురు.

శిశు—ఓబ్రహ్మచారి! వాగుమెత్తకు. ఎవరు పరిశీలింతురా? లోకము గొడ్డుపోయినదో! శూరులు లేరేమి ? మీ రాడినది యాట, పాడినది పాట; ఎన్నిదినములు సాగివచ్చు ననుకొంటిరి. వైరివీరభూపాలహృద్గోళాంతరప్రజ్వలితరోషదవానలంబు మిమ్ములఁ గాల్చకమానదు. న్యాయంబునకు విరుద్ధంబుగ నపుంసకునకు రంభను గూర్చినటుల గొల్లవానికి నగ్రపూజ, సభాతాంబూల మొసంగిన తెలివితక్కువ చాలక, ధర్మోపన్యాసములు వెలుఁగబెట్టవచ్చితివె. మనము చేయు పని లోకమునకు హితము లేకపోయినను, మన మనసునకైనను సరిగా నుండవలదా ?

సీ. బలవంతుఁడని కోనఁ । దలఁచి పూజించితే
కర్ణాదులను మించు । ఘనుఁడె యితఁడు
పండితుండని బుద్ధి । భావించి పూజించి
తే వ్యాసుకన్నను । తెలివిగలదె
పెద్దవాఁడని యెంచి । గద్దె పెట్టించితే
వసుదేవుకన్నను । వయసుగలదె
ఆచార్యుఁడని పూజ । లాచరింపఁ దలంచ
ద్రోణాదులను మించు । దొడ్డవాఁడె
పూజనీయులైన । పురుషులలోపల
నెవ్వఁడయ్య కృష్ణుఁ । డిట్టులేల
పూజ్యులయినవారిఁ । బూజింపనొల్లక
తగవు జెప్పఁ గడఁగ । ధర్మమయ్య ?

బుద్ధిపొరపాటునఁ దప్పుచేసిన, బుద్ధిమంతుఁడు దిద్దకొనును. నీవంటి గర్వపోతు లాదోసమున కింకొకదోసము తోడుజేసి పళ్లు లాడుదురు. అయ్యవారినిఁ జేయఁబోయి కోతినిఁ జేసినట్లు, పూజ్యుఁడని వీనినిఁ జెప్పుటకు గొల్లవానిని దేవుఁడని పొగడ వలసె. వినువారు నవ్వుదురను సిగ్గైనవలదా? ఈదేవయ్య గారి గుణము లాతాతయ్యగారికే తెలియునఁట! భంగు పీల్చు వానిగుణములు గంజాయి త్రాగువాని కెఱుకపడినట్లు మీ రిరువురు పరులువలచిన యాఁడపిల్లల నపహరించినవారు లగుటచే, మీగుణములు మీకే తెలియవలయు. పెద్దలకుఁ దెలియనక్కఱలేదు. ఈనల్లమొగమువైభవము అచింత్య మఁట; యీతెల్లమొగ మెఱుఁగునఁట!

సీ. పరమేశ్వరుండైనఁ । బరులపంచను జేరు
పార్థమేల సం। ప్రాప్తమయ్యె

నమితవైభవమైన । నయ్యగారికి వెన్నం
గాం జేసి మెక్కెడి । కర్మమేమి
పరమాత్మ యితం డైనం । బత్తెల మందలం
బాలించి బ్రతుంకగ । పాపమేమి
పరమశూరుం డయిన । బాణ్గ్వదిధికి జాకి
పలుమాటు పాఱెడి । వ్రాతయేమి ?
కుక్కగోవని కుమతులు । గూయుచున్న
కుక్కకుక్కయె మూంటంగా । గోవుగాదు
మధ్య నన్నృతంబునకెక్కెడు । మానవోను
బ్రివ్వం దిట్టరె పలువురు ।మూర్ఖుం డనుచు.

నోరుమూయ మూకుడుకలనుగాని లోకము మూయ మూకుడేది ?
ఈదొంగమాటలకు మావంటిదొర లూరకుందురా ? పాప
కార్యము చూచి యూరకుండుట యెట్లు ? ఓయి గోపాల !
ముద్దరాలినలె మాటలాడకి యున్నమాత్రమున నీగౌరవము
దక్కదు. నామాట కుత్తరం బిమ్ము. లేనిచో నీచంద్రహాస
ము నీతలపైం బడనున్నదని తలంచుము. ఇటువినుము. నాకు
గదా నలుగురిలోం బూజ సంప్రాప్తమయినది. నే నిప్పటికి
గదా గౌరవ మందంగలిగితి నని సంతోషించకు. శ్లో॥ ఆబద్ధ
కృత్రిమసటాజటిలాంసభిత్తిరారోపితో మృగపతేః పదవీం యది
శ్వా । మత్తేభకుంభదళ పాటనలంపటస్య నాదం కరిష్యతికథం
హరిణాధిపస్య॥ అనంగ నొక్కండు తనుపెంచు జాగిలంబునకుం
జక్కంగా జడలు గడ్డము కట్టి మృగపతిగాం జేసి సింహాసను
నివసింపంజేయు బోనున నుంచినప్పుడు కులుకుచుం దోక నా
డించునుగాని, మదమాతంగకుంభనిర్భేదన మగు బొబ్బలిడ
వేయిజన్మలకుం జేతగాక, మొఱుంగుచు, మత్తేభమును చూచి

నతోడనే తోఁక ముడుచుకొని పరుగిడునఁట. అట్లనే శాలువ
లు కప్పుకొనుటకాదు. పరిపంథిధనుర్విముక్తబాణపరంపరలు
సహింపవలయు. నీబలసంపత్తులు మేమెఱుఁగనివా? బ్రాహ్మ
ద్రిథికి జంకి యెన్నిమారులు వెన్నిచ్చి పారిపోయితివి. తుద
కాజరాసంధుని బ్రాహ్మణవేషధారివై, అట్టి భూమికలనే
ధరించిన భీమార్జునులఁ దోడుచేసికొని తెరవాటుకాండ్రవలె
మువ్వురు గలిసి చంపితిరి. అంతమాత్రపుపౌరుషమునకే మన
వెఱ్ఱితాతయ్య పొగడుట, నీవు కులుకుట, శూరులకు లజ్జా
కరము. ఓయి శూరంమన్యా! శాంతనవా! నీకు ప్రాణ
ము పోవకయున్నఁ బౌరుషవంతులయిన శల్యకర్ణాదులఁ బొగడ
రాదా? వినువారికి ముచ్చటగా నుండును.

సీ. నీటిచిల్వను బట్టె । నెట్టినమాత్రాన
విఖ్యాతి గాంచితో । వెఱ్ఱిగొల్ల
వల్మీకమాత్రప । ర్వతము నెత్తినయంత
బాహుబలంబ గో । పాల నీకు
పాతబండిని దన్ని । పడఁగొట్టినంతనే
శూరుండ వైతివా । భీరతనయ
పాలీయవచ్చిన । పడఁతిచంపుట యొక్క-
పౌరుషం బాయెనా । పాపచరిత

గీ. మేనమామను చంపిన । మేలుకతన
పూజ కర్హుండ వైతిగాఁ । బోలు నీవు
చేయుదుశ్చేష్ట లెల్లను । సిగ్గులేక
లీలలందురు మాను లే । వేళ ఖలుఁడ!

ఆమాటల కుబ్బి తబ్బిబ్బయి నేనయ్యాయని నేఁటికి లోకవ్యవహారము
తెలియఁగని మునిముచ్చుముండకొడుకుల పదినుందిని బోగుచేసి

కొని వారిచేతఁ బొగడించుకొనినంతమాత్రముననే వీరుండగుదువా? రమ్ము యెదుటఁబడి మడమఁ ద్రిప్పక పోరాడుము. పౌరుషము చూపుము. మమ్ము జయించి పూజ గయికొమ్ము.

కృష్ణు—ధర్మవేత్తలారా! యీతండు నాకు మేనత్తకుమారుఁడు. ఇప్పుడు దైవాధిష్ఠితంబైన సభాంతరాళమున ధర్మదేవతయనందగు యుధిష్ఠిరుని, పరమధర్మవేత్తయై క్షత్రియకులకాళరాత్రియగు పరశురామ గర్వనిర్వాపణచణుండయి విశేషించి నాకు భక్తుండగుభీష్ముని, నిష్కారణంబుగ నిందించుట మీరు పలుమఱు వినియుంటిరి. మమ్ము నిందించిన నంతగా ఖేదముందము గాని, మాభక్తుల నిందించిన మేము పడు సంతాపమునకు మేరయుండదు. భక్తనిందకుని శిక్షించకమానము. అదియునుంగాక; యీతండు మాకు బలవద్విరోధి. ఈతండు మాకొనరించిన యపకారంబులు వినుండు.

సీ. ఆబాలవృద్ధులు । నటమటఁ జెందంగ
ద్వారకాపురి గాల్చి । వచ్చినాఁడు
భోజరాజన్యులు । పొలఁతులు క్రీడించ
వంచించి వారి వ । ధించినాఁడు
వసుదేవుయజ్ఞంబు । పాడుసేయఁ దలంచి
యాగాశ్వ మెత్తుక । డాఁగినాఁడు
బభ్రుిందువరియించు । బాలికామణిఁ దెచ్చి
చెఱఁబెట్టి భార్యగాఁ । జేసినాఁడు

గీ. చేతనయినట్టి యపకృతు । లేచేసినాఁడు
నన్ను వంచింప నెన్నియో । పన్నినాఁడు
శత్రువులఁగూడి సమరంబు । సలిపినాఁడు
కోపగింపను మాయత్త । కోరియుంట.

పితామహుండు వార్చుచ్చిన ట్రీతని శతాపరాధంబులు సహింప మున్ను ప్రార్థింపఁబడి యొప్పుకొనిన చెల్లించుకొంటిని. మఱియు నన్ను నిందించినది నిందగాఁ దలఁపను. నాభక్తులను, నాదేహముకంటెను, జీవముకంటెను, ప్రియురాలైన లక్ష్మికంటెను మిన్నగాఁ జూతును. వారినిఁ దూలనాడిన నేను సహింపఁజాలను. కావున వీనిపై బంధుభావము వీడి శత్రుభావము పూని జగత్సంతాపనివారణార్థము, ధర్మసంస్థాపనార్థము తుదముట్టించెద.

శిశు—(నవ్వుచు) ఓయి గొల్లబోయఁడా ! భళా భళి యన్నాఁడు. నీ కోపమునకే జగములు తలక్రిందగుచున్నవి. నీదయ యెంత; నీకోప మెంత; నీశక్తి యెంత. నా కిచ్చిన యారుక్మిణిని దొంగతనాన యెత్తుకొనిపోయి పెండ్లాడిన పరాక్రమశాలివి. సిగ్గులేక కారు లరచుచుంటివే.

ఉ. శారదరాత్రులన్ హృదయజాతగుణక్వణనానుకారియై
భీరసరోజనేత్రమద వృష్టిగ వేణువఁ బూని యంగుళుల్
సారిగమాదిసత్స్వరవి సారము సారముగా ధ్వనింపఁగా
బూరణ సేయుటో హరినిఁబోలిన నీశిశుపాలు గెల్చుటల్ ?

ఓ అబ్బాయి ! యిది యంతఃపురంబున సత్యభామపాదతాడనము కాదు. ఇంద్రియవాసనాశూన్యులయి వైరాగ్యము వైరాగ్యము అని సంసారములు రోసి నీవుచేయు చిలిపిచేష్టలు మహామహిమలుగా వర్ణించిన నేను దేవయ్య ననుకొని యాఁడువారిపై యెగిరి వస్త్రాపహరణము గాదు. ఇది రాజసూయమహాసభ. ఇదుగో యిటు చూడు. వీఁడు శిశుపాలుఁడు. బావమఱఁది ననిగదా యత్తయ్య మాట విని దయఁదలఁచితి నంటివి, బావమఱఁదివలచిన రుక్మిణి నీ కేమగును ? సోదరీగమనకుతూహల ! అప్పుడీమేనయత్తయందలి గౌరవ మేమయినది. పద, మీపెద్ద

న్నయ్యాకొంచెము తియ్యకల్లు త్రాగుటకుఁ బిలుచుచున్నాఁడు.
ఓకృష్ణయ్యగారు !

సీ. గోపికావక్షోజ । కోటికూటము గాదు
గోటిపోటులతోడ । నీటణంప
ఆభీరమదవతీ । యధరయుగ్మము కాదు
రదనఘాతంబుల । మదమడంప
మదవల్లవాంగనా । మణితవారము కాదు
శ్రోత్రపేయము గాఁగ । సొక్కివినఁగ
కీలారిపడఁతుల । కేశిలు గా వివి
బాహుయుగ్మంబునఁ । బట్టినొక్క
బాణఘాతము తీక్ష్ణకృ। పాణఘాత
మకట వీరనాదము సింద। హాసలతలు
గోట నోటను బాహులఁ । బట్టి నొక్క
నిలుపఁ జాలవు బాబయ్య । తొలఁగు తొలఁగు.

రా ! ఇటురా ! బ్రతుకు భాగ్యమునచో నాచేతఁ బడుము. (అని మీఁదికి దుముకుచున్నాఁడు.)

కృష్ణు—సభాసదులారా ! అన్యాయముగా కలహము పెంచి నా భక్తులను నిందించి, వారికి నపకార మొనర్చి లోకకంటకుఁడై శిశుపాలుఁడు గర్వోన్మత్తుఁడై, నాదేహముకంటెను ప్రాణము కంటెను మిన్నయగు పాండవులఁ దిరస్కరించి బంధుభావము వీడి యకారణవిరోధము పెంచి సాధుబాధ నొనర్చుచున్నాఁడు. కావున నాకొసంగిన యగ్ర్యభోజనము, వీనికే యొసంగెద. శతాపరాధి యేమియగునో గనుఁగొనుండు.

గీ. ధర్మసంస్థాపనార్థ మీ । ధరణియందు
నవతరించిన నాకు స౹హాయ మగుచు
నీదుశక్తినిఁ జూపించి । మోదమంద
రమ్మ చక్రమ్మ వీనిపా౹ణమ్ముఁ గొమ్మ.

(అని పూజాపళ్ళెమును విసరివేయఁగా నది చక్రముగా మారి వచ్చి, శిశుపాలుని శిరంబు నఱికివేయును. శిశుపాలుని శిరంబు పైకి యెగిరిపోవును.)

(యవనికజాఱవలయును.)

ఇది ప్రథమాంకము.





# ద్రౌపదీవస్త్రాపహరణము.

## ద్వితీయాంకము.

### మయసభ.

[పాండవులు, ద్రౌపది యుండవలయు.]

ధర్మ—సోదరులారా! ఇప్పటికిఁ గార్యభారము దాదాపుగా మన మీఁదనుండి తొలఁగెను. కృతార్థుల మైతిమి. కాని,

ఉ. బంధువు లెల్లరుం దిరిగి వారిగృహంబుల కేఁగ యజ్ఞసం
బంధమునందె చచ్చె శిశుపాలుఁడుమాత్రమె చక్రిచేత గ
ర్వాంధులు భూపులాతని మహాహవదోహలులయ్యె, నాభయో
ద్గంధుని గృష్ణుఁ గాంచి దిగద్రావిరి కోపము లోనఁ గుందుచున్.

రాజసూయంబున మన జనకుండు నరలోకా ప్రాప్తుఁడైన యింద్రాదులు స్వయముగాఁ గురిపించినలతాంతాసారమే ప్రబలమగు దృష్టాంతము. ఇయ్యది మనకు సంతసమైనను, మన పినతల్లికిఁ బుత్రశోకదాయకమయినది. సర్వజనరామణీయక మగు కార్యము లోకమున దుర్లభమే సుమా!

భీము—అన్నయ్యా! మీరు, యుధిష్ఠిరశబ్దవాచ్యులరయి, ధైర్యవీర్య సాహసాదిగుణంబుల కాలయులై, అర్థితదానదీక్షాపరతంత్రులయి, లోకంబునఁ బ్రఖ్యాతి వహించిన తమకు నానాఁటికి దయారసము మాత్రమే వృద్ధియయి; ఖడ్గముచే నడుపింప వలసినకార్యముల యందుఁ గూడ దేవరవారి సర్వావయవముల నుండి సుధాకరకిరణముల నుండి యమృతమే కురిసిన ట్లా

కృపారసమే వెల్లివిరియుచుండుట యొకప్పు డది మన కపకారమగునో యని శంకించుచున్నాఁడ; అగ్రజా ! శిశుపాలుఁడు దయ తలఁచఁ దగినవాఁడా ? వాని మరణమునకు మనమును దుఃఖించవలయునా? బంధువుఁ డయినను దురాత్ముని వధియించుట రాజధర్మము కాదా ? శిశుపాలుం డొనరించిన పాపంబునకు నిష్కృతి గలదా ?

మ. జగదారాధ్యుఁడు, దీనబంధుఁడు, కృపా। స్వాంతుండు, దైవంబహో
నిగమార్థప్రతిపాద్యసన్మహిముఁడున్ । నిత్యుండు కృష్ణుండు పూ
జ్యగఁ జేయన్ దగదన్న దుష్టుని ఖలున్ । జూడంగ దోసంబుగాఁ
దగువాని న్వధియింప రా దనుటయే । తప్పౌను ధర్మాత్మజా !

నిష్కారణంబుగఁ జెట్టుకొట్టి పైన వేసికొనినవాని కిదియె విధివిధానంబగు శిక్ష. అన్నయ్యా ! మీరు వెఱ్ఱిమహారాజులు. కుచ్ఛితుల స్వభావము మీ కేమియుఁ దెలియదు. మన మాతృష్వస్రీయుండు దుష్టకులాలంకారుండు. కురుకులపాంసనుండు సుయోధనుని దురాలోచనాలానబద్ధుండయి మన యజ్ఞవ్రతోత్సాహము పాడుసేయఁ దలపెట్టినదురాలోచన కోటరాంతరంబున నున్న హవ్యవాహనుండు వృక్షంబును గాల్చిన ట్లవ్వని దురాలోచన వానిని నశింపఁజేయక తప్పదు.

శా. అన్నా జన్మము కారణం బగునట। య్యా వాఁడు నా యోడ కీ
పన్నాగంబున దేవకీతనయు దు। ర్భాషాశుగవ్యాప్తుఁగా
సన్నాహం బొనరింప వాని యఘమే । శాసింప నాదుష్టునిన్
గన్నారం గనినాము కృష్ణమహిమా। న్నత్యంబు ధర్మాత్మజా.

మఱియు వాఁడు దురాత్ముం డైనను చక్రిస్పర్శచే వాని శరీరమునుండి వెలువడిన దివ్య తేజ మాజగద్వ్యాపకుని మేన నైక్యం బైనది. అయ్యది మహాజనదురాపంబు గదా ?

సహ—అన్నగారి క్రోధానలజ్వాలలు, యేవైపున గాలివిసరినను శుష్కవృక్షములమీఁదికిఁ బరువిడుదవాగ్నివలె, దుర్యోధన దుశ్శాసన హంతకులమీఁదనే వ్యాపించును.

భీము—నిజమె; ఎందుకు వ్యాపింపవు. మీకట్టి కష్టములు వారి వలన లభింపను లేదు. మీచిత్తము లట్లు పరిణమింపవు. ఈ వృకోదరునిమేనఁ బ్రాణము లుండునంతవఱకును వార లొనర్చిన యపకారములు గుండెలలో మెదలక మానవు. ఇటు వినుము.

చ. జలములఁ గట్టి త్రోచిరి విషం । బిడి రక్కటు కూఁటిలోన బాములఁ గఱపించి రాగరడి । మొత్తిరి దన్నిరి మోసబుద్ధి పెక్కులుగ నొనర్చి రాపదలు । కూరిమిఁ గల్గునె ధార్తరాష్ట్రులన్ దలఁచిన మేను భగ్గు మనదా సహదేవుఁడ యోజసల్పుమా.

సహజశత్రువులపై పేర్మి శశవిషాణము కాదా?

సహ—అన్నయ్యా! వార లొకప్పుడు తమ కపకార మొనర్పనే చూడు. అది మీకు మాత్రమే జ్ఞాపక ముండునా? సహజ కోమల స్వభావు లగు ధర్మనందనుని మనంబు నెఱియుట లేదా? నిజముగా తమ మనంబునఁ గలిగిన కష్టంబు కతంబున నమ్ము వేఱుగాఁ దలఁచితిరి కాని, లాక్షాగృహదహనంబు వారొనరించుట పాండవపంచకసంహారణంబు కొఱకు కాదా? మాయందఱలో ధైర్యబలసాహసధౌరంధరులు మీరలగుటచే మీకపాయం బొనరించిన మమ్ము సులభంబుగాఁ దుదముట్టఁ జేయవచ్చునని యే వారి యోచన. కావున వారు మీకొనరించిన యపకారములు మా మనంబుల శల్యప్రాయములై పచున్నవి.

అర్జు—దావపావకకీలల మ్రింగఁజూచు శలభంబులు, అగ్గిని మ్రగ్గకుండునా? దహియింప సమర్థములు గావా?

గీ. చెట్టు చెడియెడి వేళకు । బుట్టు కుక్క
మూతిపిందియ లను మాట । పుడమి వినియు
ధార్తరాష్ట్రుల చేతలు । దడవనేల
బుద్ధివిపరీత మై చెడి । పోవువేళ.

పరాక్రమైకజీవనుండగు పురుషసింహుఁడు సింహంబువడువున శత్రు మస్తకచ్ఛేదనం బొనర్చుటయె ప్రతిక్రియగాని, వాగ్వ్యాపార ప్రయోజనమాత్రము గాదు.

చ. పరుసిరిగాంచి యెచ్చు జన। పాలుఁడు పౌరుషవంతుఁడైనఁ దా
దురం బొనరించి శత్రువులఁ । ద్రుంచి రణస్థలి వైరిలక్ష్మిఁ జే
కుర మది సంతసించు తన। కుం గల శక్తియు తక్కువైనచో
మరణమునొందు గాని జన। మండలిలోఁ దల నెత్త నేర్చునే.

కపటోపాయంబుల వైరుల నోడించ నెంచువాఁడు పురుషుం డనఁబడునా? అట్టివాని పలుకులు, కార్యములు మనము పరిగణించఁదగునా? మబ్బులు సూర్యమండలము నరికట్టఁజూచిన నెంత కాలము వానియాటలు సాగివచ్చును. తిన్నఁగఁ గరములు విప్పిన, వాని నాశనమున కెంతకాలము పట్టునో కనుఁగొనుఁడు. గాంభీర్యము గలవాని నెప్పుడు నీచవాక్యములు మది గలంపఁజాలవు.

నకు—అదియు నొకప్పుడు ముప్పుఁ గప్పు.

గీ. తనకరంబులఁ గల్పించు । ఘనఘనంబు
తనదుకాంతికి భంగంబు । తగనొనర్చు
నటుల మనయుపేక్షకు దాయ । లనువు నరసి
మనల నణఁకట్ట నెంతురు । ఘనమనీష.

దుష్టస్వభావము కలవారియెడఁ బ్రథమమున నుపేక్షయొనర్చి, యెప్పు
డో ప్రతాపము చూడనెంచి కోటితోఁ దునుమఁదగుకార్యము
నకు గొడ్డలి యుపయోగించి నట్లౌను.

సేన—మహారాజా దుర్యోధనుండు సభాభవనవిశేషములఁజూడ లోన
కరుగుచున్నాఁడు.

ధర్మ—అట్లయినఁ జిత్రిపరిదర్శకుల ననుకరించ మనుఁడు.

సహ—అన్నయ్యా! అక్కఱలేదు. అదుగో మహారాజానైపున కరిగి
నాఁడు; వివృతద్వారముచు సంవృతద్వారంబుగా నెంచి వెను
కకు మరలినాఁడు.

ధర్మ—ప్రేమాతిశయమునఁ జూడవచ్చినసోదరునకుఁ జిత్రములు
చూపవలదా?

భీము—ఆప్రేమయనువస్తువు లోకమున నింకొకరినిఁ జేరుటకు
తమరు విడుచుట కలిగినపుడు కదా? దుర్యోధనునకు మన
యందు ప్రేమాంకురము కలిగిన లోకములు వ్యత్యస్తములు
కావా?

సహ—అన్నయ్యా! ఆనైపున దృష్టిఁ బ్రసరింపఁజేయుఁడు.

(పాండవులు దుర్యోధనునివైపు చూచుచుందురు,)

[దుర్యోధనుఁడు ప్రవేశించి]

దుర్యో—(స్వగతము) ఇప్పుడు నామనంబునం గల పరితాపము
లోన నిముడ్చుకొని సంతోషము నభినయింపవలయు. కావున
నభినయవేషధారినయి సభారంగము ప్రవేశించినాను. కాని
మయసభావిలోకనము నాకుఁ గాని పాండవులకుఁ గాని
తప్పక ముప్పుఁగప్పును. పలుమరు దీనినిఁ గాంచినను విచిత్ర
ములు మెండుగ నుండుటచేతను మనంబున కపూర్వామోద
మొనరించుచున్నది. నాపరిచారకుల నందఱిని విడిచి యొం

టరిగా వచ్చితి. దీనిలో నెట్లు ప్రవేశించితినో? వచ్చినత్రోవ మరచితినే! వెలువడుటకు మార్గము కానరాకున్నది. పాండవ సేవకుల నొక్కరినైనను తీసికొని రాకుండ వచ్చితినే. ఏమి నా వెఱ్ఱి. ఎవరికిఁ దెలియకుండ దీనిరహస్యములు కనుఁగొనవలయునని యు, వీలయినఁ గొన్ని చిత్రములఁ బాడుచేయవలయునని యు కదా నారాక. దీనినిఁ జూడఁగనే బుద్ధి మరలి ధర్మవేత్తనయితి. (నాలుగుమూలలు పరికించి) అరె! గ్రుడ్డివాఁడనయితినే! ఒడిలోఁ బిల్ల నిడుకొని దేశములు దేవులాడినట్లు త్రోవ లేదనుకొంటినే. (ముందునడిచి) ఇదుగో త్రోవ. ఇప్పటి కీపరాభవము తప్పినట్లే. (అని వెళ్ళఁబోయి తలకు దెబ్బ తగలగా నుదురు పట్టుకొని) దైవమా! యీ మొండి దుర్యోధనున కెన్నిదినము లాయుర్దాయము పోసితివి. (నాలుగుమూలలు పరికించి) ఇక్కడ నెవ్వరు లేరుగదా! (చేతితోఁ దడుముకొని) రక్తము రాలేదు. బుడిపె కట్టినది. దీనికిఁ గిరీటము మాటుచేసెదను. (అని కిరీటమును సర్దుకొనుచున్నాఁడు.)

భీము—అదియే త్రోవ. (అని నవ్వుచున్నాఁడు.)

ధర్మ—తమ్ముఁడా! కోపోద్రేకము నడంచుకొనలేవుకదా.

ద్రౌప—దుర్మార్గులవిషయ మణంచుకొనుట క్షత్రియధర్మము కాదు.

దుర్యో—(లేచి నాలుగడుగులు నడచి) మన మింకొకచోటికి వచ్చితిమా యేమి? లేక పాండవులు మయునిచేత మాయలు చేయించుచుండిరా యేమి? ఇచ్చట నీళ్లు యున్నవే? దీనిని దాఁటు మార్గమేది? అవలకుఁ బోవలయునన్న నిదియేత్రోవ కాఁబోలు. (అని బట్టలు పైకియెత్తుకొని నడుచుచున్నాఁడు)

ద్రౌప—మీతమ్మునికిం గల శిల్పకళాప్రావీణ్యము తేటపడినదా?

ధర్మ—సాధ్వీమణీ! అభినవవస్తువు యెవ్వనికి భ్రమ కల్పింపదు? హాశ్చర్య మేమి?

ద్రౌప—(స్వగతము) సాధ్వీమణీ యనుట పతివ్రతా మాటిమాటికి హాస్యంబు మనంబునకు రానియ్యకూడ దని మహారాజు వ్యంగ్యముగా నాకు జ్ఞాపకముఁ జేయుట.

దుర్యో—ఎంతబుద్ధిమాంద్యము. స్ఫాటికకుడ్యోపరిభాగంబున దూరంబున నిర్మింపఁబడిన యింద్రనీలవలభికాసుషమయు, నెలతాల నేల ప్రక్కలనుగల పచ్చల రాతిగోడలనీడలను బ్రతిఫలించుటఁ జేసి, ధరాతలంబు జలమయముగను, కవాటప్రాంతోపరిభాగనిర్మిత పద్మరాగ వైడూర్య, మరకత రత్నపుత్రికలు, జలచరభ్రాంతి కల్పించి నన్ను వెఱ్ఱివానినిఁ జేసినవి. దూరముగా వెలుతురు గానవచ్చుచున్నది. అది బహిరంగ ప్రదేశము గాఁబోలు. ఆవలికే గద. (అని నడుచుచున్నాఁడు.)

ద్రౌప—రాజరాజు స్నానము సేయఁబోవుచున్నాఁడు. దాసీ! నూతనదుకూలములఁ గొనిరమ్ము.

ధర్మ—సోదరా! సహదేవా! మన సహోదరుని పరాభవము మనము చూచి సహింపఁగూడదు. నవ్యదుకూలంబులతోఁ గూడ శీఘ్రముగాఁ బోయి మహారాజును లోనికిఁ గొనిరమ్ము.

భీము—వద్దు. వద్దు. దుర్మార్గునివిషయమై దయఁ దలంపరాదు.

సహ—(పరిచారకులతో వస్త్రముల మోయించుకొనుచు నడుచుచున్నాఁడు.

దురో—ఇది నీరమనుకొని బట్టలను, పైకెగఁబట్టుకొనినపుడు దాసీతొత్తు లెవరు చూడలేదు గదా! (అని నడుచుచు నీటిలో దిగబడుచున్నాఁడు.)

సేవ—(దుర్యోధనుని లేవఁదీయుచున్నాఁడు.)

దాసీ—అయ్యగారు మడుగులో దిగఁబడినారు. బట్టలు తడిసినవి. దెబ్బ తగిలినదేమొ? (అని చప్పటులు కొట్టును.)

ద్రౌప—మఱఁదిగారు ధృతరాష్ట్రకుమారులు కారఁటే.

దుర్యో—(వినుట నభినయించి నాలుకఁ గొరుకుకొనుచున్నాఁడు.)

సేవ—పీతాంబరములు ధరియింపుడు. (అని తడిబట్టలను దీసి క్రొత్త బట్టల నిచ్చుచున్నాడు.)

సహ—అన్నయ్యా! ఇటు, ఇటు. మార్గ మిది. ఇయ్యది దేవతామందిరము. ఇది యంతఃపురమార్గము. ఇదియే రాజసభ. పాండవాగ్రజుండు కొలువుదీరియున్నాఁడు. (అని ముందు నడుచుచున్నాఁడు.)

దుర్యో—(సభలోఁ బ్రవేశించి, విచారముగాఁ గూర్చుండును.)

ధర్మ—గాంధారిదేవిగారి ప్రేమాంకూరసూచకంబు లగు, బహుమానంబులు త్రిదివేంద్రప్రసాదమువలె నీపూట మహోత్సవయుక్తముగా శుభముహూర్తమున ధరించినారము. మా వందనశతంబులు దల్లిగారికి విన్నవింపఁదగినవి.

దుర్యో—ధర్మనందనా! శిశుపాలవధ జరుగునపుడు నామనంబు సెదరినది. అప్పటినుండియు నేఁటికి నెయ్యది కనుంగొన్నను నామనంబున కసహ్యంబుగఁ గనుపట్టె. హస్తిపురి కిపుడే ప్రయాణము సేయుచున్నాను.

ప్రాతి—(ప్రవేశించి) మహారాజా! సారధి తే రాయితము సేసికొని దేవరవారిరాక కెదురుచూచుచున్నాఁడు.

దుర్యో—అట్లయిన నిప్పుడే వచ్చుచున్నాము. (నిష్క్రమించును.)

ధర్మ—దుర్యోధనునిమోము మిక్కిలి యీర్ష్యాసూయామయగ్రస్తమయినట్లు కనుపడుచున్నది.

భీము—దానికి మనరాజసూయమే కారణము.

సహ——ఈసమయంబున పాంచాలి, యసహ్యామయవృక్షమునకుఁ బరిహాసామృతదోహద మొనరించినది.

ద్రౌప——పరుల పరాభవముచూచి, పరిహాస మొనర్చుట క్షత్రియుల కలంకారమేగాని స్త్రీజాతి కంతగా రణవ్యాపారేతరవిష యంబులఁ దగదు. కాని దైవయోగము, దారుమయస్త్రీనా ట్యంబునకు కుహకాధీన మయినట్లు జీవుల సుఖదుఃఖముల స్వాధీనము చేసికొనుచుండును. జీవులు పరతంత్రులేగదా?

ధర్మ——సంతోష విచారములు ప్రత్యక్షముగా సభాస్థలుల ప్రకటిం చుట ప్రగల్భస్వభావము కాదు.

ద్రౌప——గర్వామయయుక్తులకు పరాభవము తటస్థించుట దైవ యోగము హఠాత్సిద్ధ మగుటచే నప్రయత్నముగా మనుజ స్వభావ మగుభ్రమాదులు వెలువడక మానవు. మఱియునవి, యబలలకడ సులభములుగా స్పష్టము లగుచుండును.

ధర్మ——సోదరులారా! సార్వభౌముని సాగనంపవలసియున్నది పోవు దము లెండు.

(నిష్క్రమించెదరు.)





# ద్రౌపదీవస్త్రాపహారణము.



## తృతీయాంకము.



రాజమందిరము.

[దుర్యోధనుఁడు విచారముతోఁ బరుండఁబడియుండును.]

**శకుని**—(ప్రవేశించి దుర్యోధనునిశరీరము పట్టిచూచి అచ్చెరువు నభినయించి) వీనిశరీర మెంత కాఁగుచున్నది! జొన్నగింజవేసి నఁ బేలగింజ యగుచున్నది. (సమీపించి) అకటా! వీని నాసికాకుహరములనుండి వినిర్గతంబులగు నిశ్వాసవాయువులు లయానలజ్వాలలంగూడి పరతెంచినట్లుల నింతదూరముగా నుండిన నాదేహము సోఁకినంతనే బొబ్బలు పొక్కుచున్నవే యీమహారా జెట్లు జీవించును! (పరికించిచూచి) స్మృతియు లేనట్లున్నదే! కాని, పిలిచి చూచెదఁగాక. నాయనా! దుర్యోధనా! కురుకులసార్వభౌమ! కన్నులువిప్పి యొకమా రిటు చూడుము.

**దుర్యో**—(ఇటు పొర్లుచున్నాఁడు.)

**శకుని**—అయ్యో! వీనిశరీరము శరత్కాలచంద్రికవలెఁ దెల్లఁగాఁ బాలిపోయినది. త్రెంచివేసిన తామరకాడలు వాడి వ్రేలగిలఁబడినటులఁ గాళ్లుచేతులు గదల్చుటకే శక్తిలేకయున్నవి. అకస్మాత్తుగా వీనికిట్లు జాడ్య ముత్పత్తియగుట కేమికారణము.

చెప్పుమా? (చెయ్యిచూచి) నాడు లెంతతీవ్రముగాఁ బరు
గిడుచున్నవి! అబ్బాయి! గాంధారేయ! కన్నులు దెఱువుము.

(అని కన్నులు విప్పవలయును.)

దుర్యో—(తనలో) ఆహా! జాళువా పసిండి చిరుగజ్జెలు గల్గు మన్న,
రత్నఖచితంబులగు కవాటంబులు తలుపులుదీరి, చాంతభిత్తి
కాజాలంబుల నింద్రచాపంబుల నీనుచున్నవికదా.

శకుని—ఓహో! యిప్పటికి వీని మనస్తాపకారణము తెలిసినది. మనో
వ్యాధికన్న మనుజున కామయ మొండుకలదా?

గీ. లంఘణంబులు చేసిన ♦ లావు చెడదు
కాయమును మాపు వైద్యుల ♦ కన్నుగప్పు
తుదకు ప్రాణంబు నిలుపునఁ ♦ దోలు నడిగ
నట్టి చింతాజ్వరము వీని ♦ నలుముకొనియె.

కలుషలులితంబగు కాంచనం బగ్గిని కాచినఁ గందిపోయినట్లు మన
స్తాపహవ్యవాహదాహంబునఁ గౌరవాగ్రజుని కాయంబు
కందికడుంగడు వందురుచుండె. వీనికి మానసోత్సాహంబుఁ
గలిగించు వచనంబులు పచరించి చూచెద. (ప్రకటముగా)
మహారాజా! దుర్యోధనసార్వభౌమా! రాజకిరీటరత్నప్రభా
భాసితపాదసరోజ!

దుర్యో—నేను కాదు. నేను కాదు. నా కాయోగ్యతలేదు. నన్ను
పలుకరింపకుడు. మీదుర్యోధనుఁడు కడతేర నున్నాఁడని
నాతండ్రికి నెఱింగింపుఁడు.

శకుని—అబ్బాయి! గాంధారేయ! ప్రతాపాదిత్యాస్తంగతవైరివీర
గర్వాంధ! లెమ్ము. ఒక్కసారి కన్నులు విప్పుము. నీమేనమా
మయగు శకునినిఁ గన్నెత్తిచూడుము. దాహము పుచ్చు
కొమ్ము.

దుర్యో—విషము కలిపినావా? ప్రాతిగామీ! ఏది నాఖడ్గము. ఈ మొండిదుర్యోధనుండు స్వయముగాఁ జావలేఁడు గాని నీవే యాకరవాలముఁగొని యొక్కవ్రేటున నాతల నఱికివేయుము.

శకుని—(అనునయించుచు) నాయనా! ఏలతిట్టుకొనెదవోయి! వీరశూరశిరోమణివగు నీవిట్లు తిట్టుకొనుచుండ, నేను విని యెట్లు జీవింతునోయి? అబ్బాయీ! సుయోధనా! నాతోడ ముచ్చటగా మాటలాడి యెన్నిదినములాయెనోయి! నీముఖంబు దర్పణంబునఁ జూచుకొమ్ము. దీర్ఘనిశ్వాసధూమశిఖాసంహతులఁ గంది నల్లపడిపోయినది. ఏలకో యింతదిగులుపడి ధైర్యంబు గోలుపోయి పిరికిమానిసి వైతివేల? నీమనోగతంబు నాకెఱిఁగింపుము. ఎంతకార్యమైనను గోట మీటివైచెదను. మాయలకుఁ బుట్టినట్టిల్లగు యీశకుని నీచెంతనుండఁగా వెఱ్ఱితండ్రీ! నీ కీవంత యెందులకోయి? నీకోరిక బయల్పరుపుము. ధైర్యమున మేరుమహీధరంబవని నిన్నుఁ గొనియాడు లోకు లీవృత్తాంతంబువినినఁ బరిహాసింపరోయి?

దుర్యో—మామయ్యా! ఏనాఁడు పాండవరాజసూయంబున కేను తగుదునయ్యా యని, నలుగురితోఁ బోయితినో? ఏదినంబునఁ బాండవాగ్రజునకు నానాదేశాగతులగురాజపుత్రులు కానుకలవారిగా సమర్పించుచుండఁగాఁ జూచితినో? ఏపూట సోదరచతుష్టయసహితుం డయిన ధర్మజుండు దిగ్విజయంబు చేసినాఁడని విని, యూరకుంటినో? ఏక్షణంబున సభాంతరాళంబున యాదవునిచేతి చక్రంబు శిశుపాలకంఠనాళంబు ఛేదింపఁగా ననదలై చిత్రప్రతిమలవలెఁ జూచుచున్న రాజబృందంబుతోఁ గలిసి, చేయునదిలేక, గ్రుక్కమిటకరించుకొని చూచియుంటినో? ఏప్రొద్దున నచ్యుతున కర్ఘ్య మీయ

సమకట్టి రాజచక్రంబు ముందర ననిరోధంబుగ విరోధివర్గ మస్తకంబున, నాకడకాలు పెట్టెదనని సహదేవుండు నిర్భయంబుగ వామచరణం బెత్తఁ బిరికిపందనై యెవ్వఁడో చచ్చిన వానివలెఁ గూరుచుంటినో యానాఁడే లోకులకుఁ బరిహాసాస్పదుండనైతి. అప్పుడే నాధైర్యము దగ్ధమైపోయినది. నావీరరసంబు వట్టిపోయినది. నాబిగువిము మంటఁగలిసినది. నా శౌర్యంబు సన్నగిలిపోయినది. నారాజధర్మము రాళ్ళపాలయినది. నాశూరత్వము సుడిసిపోయినది. నాపౌరుషముపాడువడిపోయినది. మామయ్యా! అభిమానంబువీడి చావలేక, నేనొక మొండిబ్రతుకు బ్రతుకుచుంటిని గాని,

శా. మామా! నేనొక రాచబిడ్డనుగదా। మామా! మహాసత్త్వులై
భీమాదుల్వరిపంథిమస్తకతతి। న్వ్రేథించి భేదించి సు
శ్రీమావిష్కరణంబునన్ నృపులు జేజే ల్వేట్ట లోకంబులన్
ధీమంతస్థితినుండ నైతుఁ జెపుమా। ధీవర్య సౌఖ్యంబునన్.

సాబలేయా! నాశరీరంబు గృశించుటకును, నామేను వివర్ణంబగుటకును, నాకు చిత్తచాంచల్య మగుటకును వేరొకకారణము కావలయునా?

శకు—(స్వగతము) కుఱ్ఱవాఁడు పాండవలక్ష్మినిఁ జూచి సహింపఁ జాలక యసూయామయగ్రస్తుండై పరితపించుచున్నవాఁడు. వీనికిఁ దగిన పలుకులు పలికి మనోవ్యాధిఁ బోఁగొట్టవలయు. (ప్రకటముగా) అబ్బాయీ సుయోధనా! ఇంతమాత్రము నకే యేకాగ్రతఁ బొందవలయునా? పాండవులలక్ష్మినిఁ జూచినకొలఁది కన్నెఱ్ఱగానివాఁ డెవ్వఁడు. దానికై దిగులొందిన లాభమేమి? రాచపుట్టువు పుట్టినమగవాఁ డెన్నఁడును పరులసిరిఁ జూచి సహింపఁడు. దేశకాలవిభాగముల నూహిం

చి పరులసిరు లాడిచికొన వేచియుండని క్షత్రియుఁడుండఁడు. నీవు ధైర్య మవలంబింపుము. నీ తండ్రి నిచ్చటికిఁ బిలుపించు ము. పగతురలచ్చి నీసిగలోఁ బూవు వాడకుండ నీచేతఁబడు నుపాయంబు పన్ని నిన్ను మహాదైశ్వర్యవంతునిగాఁ జేసెద. అరే ప్రాతిగామీ! నీవు వృద్ధరాజుకడకేగి రారాజు శరీర స్వస్థత లేకుండ మందిరంబుననుండి మిమ్ములఁ జూడఁగోరు చుండెనని చెప్పుము. కురుకులకమలినీరమణ! యొక్క సారి లేచి కూర్చొని నీ మనోగతంబు పరిపూర్ణంబుగ నెఱిం గింపుము. నాకన్న నీదుఃఖ మపనయింపఁగల పరమాప్తుఁడె వఁడు? నీతోడిదియ లోకంబని నిన్నే మేరువగాఁ జూచుకొని నీసుఖంబు మాసుఖంబుగా నీక్షేమమే మాక్షేమముగా నీ విజయంబు మా విజయంబుగా నీపగతురు మాపగతురు గా నెంచి నిన్నుఁ జిన్నప్పటినుండియుఁ బెంచి పెద్దవానిగ నొనర్చిన మామయ్యనుగాను? నీయభిప్రాయము నాకెఱిఁగింప రాదు? నీమనోవ్యాధికారణము సెప్పుము.

దుర్యో—(లేచి కూర్చుండి) మామయ్యా! నీవు నాకుం బరితాతవు. నీ మాట నాకు రాజశాసనము. నీమాటలు వెలలేని రత్న ముల మూటలు. నీచెవిలోఁజెప్పినమాట పెట్టెలోఁబెట్టిన మూట యని నమ్మితిని. నీకన్న నాకు నీదుఃఖసాగరము నీ దఁజేయు కర్ణధారుఁడు ముల్లోకములయందును లేఁడు. మా మయ్యా! రాచపుట్టువ పుట్టి పిరికితనము గలిగి చావలేక యిట్టిమాటలు నీతోఁ జెప్పవలసివచ్చినది. సకలజననయనా హ్లాదకరంబయి సర్వబృందారకవందితంబయి సకల సంప చ్ఛోభాయమానంబై మధ్యమలోకంబునకు నవీనాభరణంబై అధునాతనసార్వభౌమ సందర్శనమాత్ర మందాకాకరంబై

పాండవకరాక్రాంతంబగు మయసభావైభవము అశేషజన నయనానందకరంబయినను నామనోనయనంబుల కగ్నిజ్వాలలయి నాయొడలును గాల్చి నాగుండెలు బ్రద్దలుసేయుచున్నది. నా దేహమందలి రక్తమును పీల్చుచున్నది. ఆపాండవరాజ్యలక్ష్మి సంవర్త సమయ సముద్భవ దివాకరమరీచికలవలె నన్ను మహోదాహంబు సేయుచున్నది. నిదాఘంబున వేఁడివెలుంగు వెలుంగులు స్వల్పజలాశయమునందలి జలంబుల నింకించినట్లు నా మనోధైర్యంబుల నింకించుచున్నది. మాతులా! నేను చెప్పనది యేమి?

ఉ, ఈవును జూచి తత్సభ । యొందు వినంబడ దేయుగంబులన్
భూవలయంబులో నది య।పూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో
గావహ మేక్రియంబడసె । నయ్య మహాత్ముఁడు దాన నెమ్మి
భావితభాగ్యుఁ డయ్యెను ప్ర।భాకరతేజుఁడు ధర్మజుం డిలన్.

శ. బలేయా! నాగ్రహచారమేమియోకాని పాండవులకు నాఁ జేయుయపకారములు యపాత్రులకుఁ జేయు దానములవలె వ్యర్థంబులై బురదలోఁబుట్టిన తామరపద్మములవడువునఁ బ్రతిక్షణసంజాతశోభాయమానులై వశీకృతాఖిలధరాధినాథులయి పెచ్చుపెరుగుచున్నారు. వారి సిరిఁజూచి లోకంబులఁగల రాజసందలందఱు వారియడుగులకు మడుగులొత్తుచు, వారి దోసంబులు గడనసేయక, వారలగుణములు గోరంతలు కొండంతలుసేయుచు, మాటిమాటికి జోహారులొనర్చుచు, దోసిళ్లు లొగ్గుచు, పరిచారకులవలె నూడిగంబులు సల్పుచున్నారు. వారిపరాక్రమంబుఁ జూచి,

చ. కడుభయ మంది వారికిఁ ద।గ న్మఱి వైశ్యులఁబోలె వశ్యులై
పుడమి నతిప్రసిద్ధులగు । భూపతులెల్ల మహాధనావళుల్

దడయక తెచ్చియిచ్చి రవి । దానము సేయుట పార్థివత్వ మే
ర్పడిమెఁ బృథాతనూజులకుఁ । బాండవ తేజము బర్వె నెల్లచోన్.

లోకంబుల నతులపరాక్రమోపార్జితకీర్తివంతులయి ధనంబు ఘనం బుగ నార్జించి యున్నతు లగుచు యశోవల్లికల దిశావలయం బుల వ్యాపింపఁజేయు పాండవలక్ష్మి నా కసమ్మతమై నాన యనంబుల మాడ్చివేయుచున్నది. మాతులా! మానధనుం డయిన మానవపతికి సపత్నుల సమృద్ధియు, ఆత్మగౌరవంబు ను సహింపశక్యములు గావు. నా ప్రాణత్యాగంబున కుపాయ మాలోచించికొనియెద.

శకుని—నాయనా! రాజరాజ! ఎన్నిమారు లీపరివేదనము. రాచ బిడ్డఁడి ట్లధైర్యపడువాఁడుండునా? పౌరుషముండవలె. శత్రువు ల రణరంగంబున జయింపవలయు. సిరు లపహరింపవలయు. సోదరశతపరివృతుండవయి గదాదండమాత్రసహాయుండవై సమిదగ్రంబున దమికి నీవా నేనా యని శత్రువులప్రాణ ము దీయుకొండె. చచ్చుకొండె. ఇంతియేకాని దిగులువడి లేనిపోని మనోవ్యాధులతో కృశించియున్నచో నీదాయకుఁ బరిహాసాస్పదుండవు కావా ? గంపెడుబలగముండియు దిక్కు లేనివానివలె చింతాబుడాక్రాంతుఁడవై యేకాంతంబున విచా రించఁ బౌరుషమా? చెప్పుము.

దుర్యో—గాంధారేయా! యా పౌరుషమే నా కడనుండిన మీాయుం దఱిచేతను దెబ్బలు పడవలసిన కర్మమేమిపట్టినది. దాయల నుక్షణము తామరతంపరయి విజయలక్ష్మికరుణాతరంగితావ లోకనులయి యుండఁజూచి సహించు టెట్లు గలుగును. నాసో దరశతంబును నేనును గలసి పాండవేయులకడ నుండు పరా

క్రిమైక జీవనుండగు నొక్కసేవకునికిఁ జాలము. నేనేకాదు. ఆరాజసూయాధ్వరసమయంబున,

ఉ. యాదవుచేతి చక్రము భ।యంకరమై శిశుపాలమస్తక
చ్ఛేదము చేసినన్ గడు ప్రసిద్ధులు । శూరులునైన రాజుల
య్యాదవుముందటన్ జయజయ । ధ్వను లిచ్చిరి గాని వాని శౌ
ర్యోదయవృత్తి గట్టెదుర । నోపరు యెవ్వరు విక్రమింపఁగన్.

మాతులా! వీరపరాక్రమౌదార్య గాంభీర్య ధుర్యులగు రాజశిఖామణులందఱు చూచుచుండ శ్రీకృష్ణుఁడు, శిశుపాలుండు దనను తిరస్కరించెనని మేనత్తకొమరుం డనుబంధుత్వమైనను విచారింపక, పినతల్లికొమరుండను ప్రేమ నొకమూలకుఁ ద్రోచి ధర్మరాజుచూచుచుండ సభాసదనంబు వధ్యస్థానంబు గావించుచు శిశుపాలకంఠ విలుంఠన మాచరింప సభాసదులందఱు నోరు మెదలింపక కుక్కినపేలవలె నొదిగియొదిగి తెల్లమొగములు వైచుకొని చిత్తము చిత్తమనుచు భట్రాజులవలె నాయాదవునిఁ బొగడిరి. కాని ఇదితగదని చెప్పగలిగినమగవాఁడు గలిగెనా? చూడనచ్చిన రాజులందఱు రొయ్యచేపలకు గల నిరర్థకపు మీసములవలె బారెడు బారెడు మీసములు పెంచుకొని కొయ్యబొమ్మ లలంకరించుకొనినటు లలంకారములు చేసికొని, తాడిచెట్టు నెక్కువాఁడు నడుమునకు బిగియించుకొనిన కల్లులొట్లవలె ముప్పదిరెం డాయుధములు దగిలించుకొని, కదలక, మెదలక చిత్రప్రతిమలవలె రాతిబొమ్మలాయనున్న మోములు వ్రేలవేసికొని, కూర్చొనిన నీరాజులు ఎలికరాజులు, బురదరాజులు, క్లీబరాజులు, తరాజులు, వాజులు, దేబెలుగాని రాజులా? పౌరుషము లేక గాజులు

దొడిగించుకొని, యంతఃపురంబుననుండు క్షత్రియజాతిసంగత భర్తృకలవలె, సిగ్గు లేక, కృష్ణుని, ధర్మరాజును, స్తోత్రముఁ జేయసాగిరి. అప్పుడు నామనంబునంగల పరితాపము అంత యింత యని చెప్పఁజాలను. ఆసమయమందున నేను సముద్రిమయియుండిన హతాస్త్రుగాఁ బొంగి పాండవయాదవచక్రంబులఁ బుడంగిన ముంచివైచెద. నేను సింహంబనైనచో, పృథాతనూజాతమదకుంభికుంభంబులపై రివ్వన నెగిరి పక్కునఁ బెలఁగొట్టెదను. పౌరుషలేశంబు నాహృదయంబున గంధంబునకైన నిలిచియున్న నాయుధము చేఁబూని యశోవా, మృత్యుర్వా యని సభాభవనము రణరంగముసేసి, రక్తప్రవాహములు ప్రవహింపఁజేసెద. ఇం దేప్రజ్ఞయు నా చెంత లేక, చేత గాక, గాజులు తొడిగించుకొని, యంతఃపురవాసులగు యాఁడువాండ్రవలె సిగ్గుపడి, తలవంచుకొని యూరకుండవలసివచ్చినది. (నాలుగుమూలలుచూచి) ఇక్కడ నాఁడువాం డ్రెవరు లేరుగద, ఈమాట వారు విన్న నీవు మాజాతికిం గొరగావని తిరస్కరింతురేమొ? ఎన్నివిధముల మయసభావృత్తాంతము జ్ఞాపకము చేసికొనకుండవలయునని ప్రయత్నించెదమనుకొన్నను మయసభాపరిభావము తలంపునకు వచ్చినపుడెల్ల దానితళతళలు నాకనులముందఱఁ గట్టినట్లుండు, సూర్యకిరణంబులు ఆదిత్యోపలోపరిభాగంబునఁ బడిన మాత్రనే జ్వాలలు ప్రజ్వరిల్లునట్లు, నామానసం బస్వాధీనంబయి భగ్గుభగ్గున మండుచుండును. మామయ్యా! వెయ్యి మాటలెందుకు?

ఉ. ఏనును క్షత్రియుండనని యెల్లవచించెదనయ్య వైరిభూ
జానులు పాండవేయులకు సల్పితి నెగ్గులు నేను పెక్కు ల

ర్లైనను వారువృద్ధియయి ఖ్యాతిని గాంచిరి దైవయత్నమే
దానికిఁ గారణంబగు వృథా గద నాదుప్రయత్న మంతయున్.

అరణ్యంబునఁ బుట్టి, యచ్చటనే పెరిగి, యచ్చటనే జీర్ణించినసుమ
ములచందమున, నాకోర్కెలు నామానసమునందే జీర్ణము
గావలసివచ్చె. నాదుఃఖము మీకుఁ జెప్పి మీకును దుఃఖము
కల్పించుటయెగాని, నాదుఃఖాగ్నిని నార్పువారును, తీర్పువా
రును లేరుగదా? మాతులా! పౌరుషహీనుండనయినను, నీకు
మేనల్లునికదా. కడసారిగా నన్నొక్కపరి గాఢముగా కౌఁగిలిం
చుకొనుము. (అని శకునిని కౌఁగిలించుకొనుచున్నాఁడు.)

శకుని—ఎంతలో నీకింత బుద్ధిమాంద్యము, అధైర్యము కలిగెనోయి!
గోటితోఁ దుంచఁదగు కార్యమునకు గొడ్డండ్రి నుపయోగ
పరుప యత్నించుచుంటివి గాని వేఱొండుగాదు. శత్రురాజ్య
సంపద లపహరించుట లీశకునికిఁ గనుగిలిపినంతకాలము పట్ట
దు. నాప్రజ్ఞ నేనే చెప్పుకొనరాదు. అయినను నాకును నీ
కునుగల యభేదము, నీయందు నాకు గలవాత్సల్యము, నీవి
ప్పుడు పడుచుండు పరితాపము చూడఁజూడ నామానసంబు
నఁ గుతూహల ముత్పన్నమయి నాప్రజ్ఞాతిశయమును వెల్ల
డించఁ బ్రేరేపుచున్నది. ఈశకుని నిశ్చయముగాఁ దలఁచినఁ
జూచుచుండఁగనే యెదిరికిఁ దెలియనీయక, కను కదలనీయక,
కనుపాప లూడఁదీయఁగల శక్తిగలవాఁడు సన్నఁగఁ దాల్చిన
మన్నుఁ గన్నులలోఁ జల్లఁగఁ జల్లి, రాజాధిరాజునైనను, బుట్ట
తుడిచి పంపించఁగలఁడు. వేయికన్నులతోఁ జూచువానినైన
ను మోమున మసిబూసి నేరేడుగాయఁ జేయఁగలఁడు. పదు
నెనిమిది శాస్త్రములు పారఁజదివిన పండితునైనను, నాలుగు
మాటలు సెప్పి, పలిటీలుగొట్టించి అథోలోకమున కణఁగఁ

దొరికెఁగలఁడు. వెయ్యిమాట లెందుకు? తిమ్మిని బ్రహ్మిఁ జేయఁగలఁడు. బ్రహ్మినిఁ దిమ్మిఁజేయఁగలఁడు. కావున ధైర్య మవలంబించి, నీతండ్రియొద్ద లేనిదుఃఖము తెచ్చిపెట్టికొని ప్రాణత్యాగము చేసికొనియెదనని సాహసముసేయ నుంకించుము. నే నొకయుపాయముసెప్పి, పగతురసిరులు నీచేతిలోఁ బెట్టెద. నేను సమయమువచ్చినపుడు మాయమాటలుచెప్పి, యరచేత వైకుంఠముచూపి, ముక్కాలుమూఁడుగడియలలో, మొగమున బూదిపూయుటలో మనము పెట్టినది పేరు. అట్లు సేయకున్న నాపేరు శకునికాదు. నాయనా! నే నబద్ధ మాడను. నిన్ను చంపుకొనినట్లు. కొలఁదికాలములోఁ బాండవరాజ్యలక్ష్మి స్వయముగా నిన్నుఁ గౌఁగిలింపఁగలదు. నమ్ముము.

ప్రాతి—అయ్యా! మహారాజుగారిని వీక్షించుటకై వృద్ధప్రభు వరుదెంచుచున్నాఁడు.

శకుని—ఒంటరిగ వచ్చుచుండెనా? వెంట నెవరయిన నుండిరా?

ప్రాతి—ఎవ్వరును లేరు పరిచారకులుమాత్రమే.

శకుని—అట్లయిన నీవు పోయి పరిచారకుల నట నిలిపి, నీవే మహారాజును లోనికిఁ దీసికొనిరమ్ము. పొమ్ము.

ప్రాతి—చిత్తము. (అని నిష్క్రమించును.)

శకుని—అబ్బాయి! యొకమాట వినుము.

దుర్యో—మామయ్యా! విన్నమాటలు చాలు. నీకుఁ బరుల మానసమునఁ గలుగు దుఃఖము బులిపిల్లలకుఁ బప్పులుపెట్టి యాడించినట్లు మాయమాటచేఁ బోఁగొట్టగల నేర్పుగలిగినను యీ దుర్యోధనహృదయాంతర్గతాసూయాగ్ని దిశావలయంబుల పెళేలున పేల్పనున్నది. ఈ దుర్యోధనుఁడు నీమాయలకు

లోఁబడి, మయసభాపరాభవము మరచిపోవువాఁడు మాత్రి
ముగాఁడు. పాండవలక్ష్మీపరిభ్రాంధీభూతుఁడు గానఁ బ్రకృత
ము యితికర్తవ్యతామూఢుఁ డయినాఁడు. ప్రకృత మాలో
చింపుము.

శకుని—ఇప్పుడు తండ్రితోఁ జెప్పవలసిన మాటలు చెప్పుము. నేను
చెప్పఁబోవు నుపాయమున కొడంబడునట్లు చేయుము.

దుర్యో—ఉపాయమో యుపాయమో యనియెదవు గాని అది యె
య్యదియో నాకుఁదోఁచదు. నీవుచెప్పవు. నీమాటలచే నాకు
దుఃఖము మరింతఁ బెద్దసేయుచుంటివి.

శకుని—చెప్పుట కేమున్నది. భాగినేయా! యిటువినుము. నేను జూద
మాడుటయందు దెవేసిన చేయినని నీకు వేఱుగఁ జెప్పనక్కఱ
లేదుగదా. ఆయాటయందు నన్ను జయింప మగటిమిగలమగ
వాఁడు యీలోకములో గాదు మఱియేలోకములోనయినను
పుట్టరావలయు. ఎంతయాటగానివైనను, మూఁడునిముసముల
లోపలఁ, గన్నుల దుమ్ముగొట్టి చేతిపావ్యల్ల గుంజుకొని బు
క్కాఫకీరునుజేసి, చిప్పచేతికి నిచ్చి పంపించుటలో మనము
పెట్టినదిపేరు. సారెలు పలికించుట, చవ్వ దువ్వా, దువ్వా
చవ్వా సేయుట, మొట్టుట, కుంచుట, నెత్తముత్రిప్పుట, మొ
దలయిన యాటబూటకములలోఁ జూచుచుండగనే, యెదిరిని
పట్టీలుగొట్టించుటలో నన్నుమించిన చేయియుండదని త్రికరణ
శుద్ధిగా నమ్ముము. జూదమాడుటయందు ధర్మజునకు మిగుల
ప్రేమయేగాని, యాటయందలి నైపుణ్యము తక్కువ. నీతం
డ్రి నొప్పించి, పాండవులఁ బిలుపింపుము. జూదంపుకొలువు
లోనికిం దింపుము. పాచికలు చేతఁ బట్టింపుము. కదలక, మెద
లక, కన్నులలోఁ గారముఁ గొట్టి పాండవలక్ష్మి యంతయు,

ముక్కాలమూడుగడియలలో నీచేఁ జిక్కఁజేయకున్న నన్నీ పేరునఁ బిలునవస్తు.

దుర్యో—(లేచి శకునినిఁ గౌఁగిలించుకొని) మామయ్యా! మాతండ్రి నెట్లో యొప్పించెదఁగాని, నాకింతమాత్రిపు యుపకారముఁ జేయుము. నీమేలు మఱవను. పాండవరాజ్యలక్ష్మి పేరు నా యదికాని, సర్వము నీవనుభవింపుము. ఈయుపాయము కర్ణున కుం దెలియఁజేయుదమా!

ప్రాతి—రాజరాజుగారి సందర్శమునకు వృద్ధరాజుగారు వచ్చుచు న్నారు.

దుర్యో—(పరుండి) మామయ్యా! కొన్నిమాటలు నీవు చెప్పుము.

ప్రాతి—(ధృతరాష్ట్రుని చేయిపట్టుకొని నడిపించుకొని రావలయును.)

ధృత—(చెయ్యిచాఁచి) ఏడీ? అబ్బాయీ! నాయనా! మహారాజా! పలుకవేమి? (అని చేతితో వెతుకుచుండవలయు.)

శకుని—బావగారికి శకుని నమస్కరించుచున్నాఁడు.

ధృత—నాయనా! నీ విచ్చటనే యున్నావు, నీ మేనల్లుఁ డేఁడోయి! (స్వగతము) వీఁడు చేరినాఁడు. కొంప నాశనముచేయఁగల యోచనలు చెప్పుటలో మొనగాఁడు. (ప్రకటముగా) బావ! ని పెద్దమేనల్లుఁ డేడీ? ఏమి వానికి జబ్బు విచారించినావా?

శకుని—నేను గడియసేపటినుండి బ్రతిమాలి బ్రతిమాలి నోరు కాయగాచినది. పలుకఁడు. కదలఁడు. మీఁద చెయ్యి వేసినఁ గాలి పోవుచున్నది.

ధృత—జ్వరమా?

శకుని—జ్వర మేమిటి వస్లగింజ వేసినఁ బేలగింజ, కణ కణలాడునిప్పు, మండిపోవున్నది. శరీర మంతయుఁ దెల్లఁగాఁ బాలిపోయి పిండి బొమ్మవలెనున్నాఁడు. రక్తము బొత్తుగా విఱిగిపోయినది. వాని

రూపే చెడిపోయినది. కనులవెంబడి నీరుమాత్రము కాలువలు గట్టుచున్నవి. ఆహారమంటే ఱోకు. బాధ యేమో చెప్పడు.

ధృత—మనవైద్యుని విశారదుని పిలుపించలేదా ? ఏడీ కుఱ్ఱవాఁడు? (అని చేయి చాఁచవలయు)

శకుని—పిలుపించ కేమి? విశారదుఁడు వచ్చి యిప్పుడే వెడలినాఁడు. శరీరమునం దెంతమాత్రము రుగ్ణత గానుపించదు. ప్రభువున కేదియో మనోవ్యాధి యని చెప్పినాఁడు. ఇటురండి. (అని ధృతరాష్ట్రునిచేయి దుర్యోధనునిమీఁదఁ బెట్టి) రామ, రామ, బొత్తుగాఁ జిక్కి శల్యమయినాఁడు. బొమికలబొమ్మ. రెండు దినములలో నేరు తీసినట్లు శరీరము తీసిపోయినది. కారణము తెలియదు.

ధృత—(దుర్యోధనుని శరీరము పట్టిచూచి) వీని శరీర మెంతక్రాగు చున్నది. ఎంతచిక్కిపోయినది. అబ్బా ! వీని నిశ్వాసవాయువుల వెచ్చదనము దగ్గిరమనిషిని గాల్చివేయుచున్నది. (ప్రకటముగా) అబ్బాయి ! దుర్యోధన ! నీ కీమనోవ్యాధి యెందు కయ్యా ! నీ కేమికొఱఁత నాయనా ! కౌరవకులగౌరవఁబును కౌరవైశ్వర్యఁబును నీకుఁ జేణ్ణిచే సమర్పింపఁబడినదిగదా. నీ సోదరులు, నీ యనుచరులు, నీ మిత్రులు, నీ బంధువులు నీయందనురాగముకలవారయి నీమాట జవదాటకయున్న వారు. సమస్తభూతలాధ నాథులు నీ యడుగులకు మడుగు లొత్తుచు సర్వదా నిన్ను భజించుచున్నారు. దేవేంద్రునకుఁ బోలె సకలైశ్వర్యములు నీకు గలవు. సకలభోగములు చక్కఁగా ననుభవించుచున్న నీ కేమితక్కువ చెప్పు నాయనా!

మ. కరులా గుఱ్ఱములా రథప్రకరమా ! కాల్బంటులా మేడలా
సరులా రత్నములా ధనవ్రజము దాసస్తోమమా తక్కు వే

మిర తండ్రీ! యిటు గుందికుంది యొడ లీ? మేరం గృశించంగ నీ
దురవస్థ దురపిల్లనేల తనయా! దుర్యోధనా! సెప్పవమ్మా?
నీ వేమియుఁ జెప్పక లో లోపలఁ గుందుచుండ నా కిఁక ది క్కెవ
రోయి! నీతోడిదే లోకముగా నమ్మియున్న మ మ్మేల దుఃఖ
సాగరమునందు ముంచెదవోయి తండ్రీ! నీవు పలుకకయున్న
నేను బలవంతముగాఁ బ్రాణము విడిచెద.

శకుని—అబ్బాయి! భాగినేయ! మీతండ్రి యెన్నివిధముల బ్రతి
మాలినను పలుక కుండుట న్యాయమఁటయ్యా? నీ మనోగతం
బెఱింగించినఁ దప్పక తీర్పఁగలిగిన మీ నాయనగారితోఁ
జెప్పక యింక నెవరితోఁ జెప్పెదవు.

దుర్యో—(తనలో కలవరించినట్లు) ఆ! దుష్టాత్ములారా! నూతన
సభాభవనంబున మనోవిభ్రాంతి చేఁ దిరుగుచుండ స్ఫటికశిలా
తలంబు నా ఫాలతలంబునకుం గొట్టుకొననే చూడు- దాసీ
జనంబులతోఁగూడ నవ్వెదవా? దీనికిం దగిన యవమానము
సేయకయున్న నాపేరు సుయోధనుఁడే కాఁడు.

ధృత—కుఱ్ఱవానికిఁ బిచ్చి యెక్కువ యైనది. అసందర్భపుమాట
లాడుచున్నాఁడు. ఉన్మాదము కాదుగద!

శకుని—కాదు. కాదు. ఉన్మాదముకాదు. పాండవగృహంబున నీ
కుమారునకు జరిగిన మర్యాద. బలవంతులు ఒక్కరుగారు
అయిదుగురు మగలు గలిగిరి గదా యని విఱ్ఱవీఁగి ద్రౌపది
రాజరాజను లక్ష్యంబు లేక నీ కుమారునిఁ జూచి నవ్వి చప్ప
టులు గొట్టినదఁట.

ధృత—మహాసాధ్వి పరిహాసమునకు నైనను పరుల మనంబు నొప్పిం
పదు. అట్టి యపాంసులాశిరోమణులుండుటం బట్టియే లోకము
నిలిచియున్నది. అట్లు చేయునా?

దుర్యో—ఆ, చేయను చేయను. అవును నిజమే. కావున నీ దుర్యో ధనుఁడు బలవంతముగాఁ బ్రాణము లెడఁబాయునుగాని యీ యిల్లాలయిన కోడలిని, యీపె మగలయిన కొడుకులను పెట్టి లోకము మునుగకుండ నిలువఁబెట్టుము. (అని నెత్తి కొట్టుకొనుచున్నాఁడు.)

శకుని—(చేతులు పట్టుకొని) అబ్బాయి! నీకేమైనఁ జాదస్తమా యేమి? కాలమహిమ! యిప్పుడు అయిదుగురు మగలుకల వారె మహాపతివ్రతలు. కలియుగములోఁ బదిమంది నూరు మంది వెయ్యిమంది భర్తలుగల వీరపతివ్రతలు బయలుదేరి లోకములు మునుగకుండ నానిపట్టెదరు.

ధృత—బావా! మధ్యమధ్య తెలియని పుల్లవిరుపుమాటలు మాట్లా డకు. అకారణముగాఁ బేడ బెల్లము యేకము చేయఁగూడ దు. ధర్మసూక్ష్మము లనేకములు గలవు.

శకుని—నా కేమి పట్టినదయ్యా పుల్లవిరుపుమాటలకు? నీకొమరుని పై నీకుఁ బ్రేమ లేకపోయినను అక్కగారు కబురంపుటచే నేను వచ్చినాను గాని లేనిచో నా కేమి? మీరును మీరును గంగలో దుముకుఁడు. ద్రౌపది మహాసాధ్వి యయితే నా కేమి? నీకొమరుని కమర్యాద యయితే నా కేమి? నేను పోయెదను. (అని వెళ్ళఁబోవుచుండఁగా)

దుర్యో—(లేచి శకునినిఁ బట్టుకొని) మామయ్యా! యీ దిక్కులేని పీనుగ నేమిచేసి పోయెదవు. తండ్రికిఁ బనికిమాలిన గరాసుని నీ చేతిమీఁదుగాఁ గడతేర్చి పొమ్ము.

శకుని—నాయనా! అట్లు తిట్టుకొనకురా! మే మందఱము నీతోడి వారముకాదా నాయనా? నీమనోవ్యాధియే చెప్పవైతివి. మీతండ్రిగారు నీసంగతి విచారించక ద్రౌపది మహాసాధ్వి

యఁట, వారు లోకముల నానిపట్టెదరఁట. నిజమాడిన నిష్ఠూ
ర్యము. మావి పుల్లవిరుపుమాటలు. గంటనుంచి బ్రతిమాలిన
నీవు మాటచెప్పవు.

ధృత—(స్వగతము) కాలము తప్పివచ్చినది. కుఱ్ఱవాఁడు బొత్తిగాఁ
జిక్కిపోయినాఁడు. వీని కనుకూలముగ నటించకపోయిన వీఁ
డు బలవంతముగాఁ బ్రాణము దీసికొనును. (ప్రకటముగా)
బావా! మనస్వస్థతలేక పలికినపలుకుల కింత కోపమా!
జాత్యంధుఁడ నగు నే నీపిల్లలఁ బోషింపఁగలనా? నీవే యలి
గిన నే నేమిచేయఁగలను. నా బహిఃప్రాణమయిన దుర్యోధ
నునికన్న నాకు లోన మెక్కుడా? అబ్బాయి! యిటురమ్ము.
కూర్చుండుము. ఇటు వినుము. తండ్రీ! యిటురా.

చ. అనుజులు సేవకావళియు । నాప్తులు మిత్రులు మంత్రివర్గముల్
వినయముమీర నిన్గొలిచి । ప్రేముడి నీయెడ సానురాగులై
ఘనతర భక్తియుక్తులయి । కాన్క లొసంగుడు రాజకోటి నీ
తను విటుఁ జిక్కనేల మదిఁ । దద్దయుఁ గుందగనేల చెప్పుమా?
రాజరాజ! రాజ్యభోగపరాఙ్ముఖుఁడ వగుటకు నీకేమిలోపము తండ్రీ!

దుర్యో—(విచారముతో) తండ్రీ! యేమిలోపమా యంతయులోప
మే. నే నీవిషయ మంతగా నీతో ముచ్చటించఁదలఁచలేదు.
ఏలనన, నీమనంబు పాండవపక్షపాతము గావున, కొలఁదికాల
ములో జ్యేష్ఠపుత్రశోక మనుభవించవలసినవాఁడవు గావున
సావధానుండ వయి వినుము.

సీ. సర్వగిరివనసాగరా । శ్రియము నైన
పుడమి పాండవకరములఁ । బడినదయ్యె
క్షత్రియుఁడ నైన నే నెట్లు । శాంతిజెంది
చూడనోపుదు పాభవ । శూన్యునట్లు.

తండ్రి! ధర్మజరాజసూయసందర్శనమే నాకొంపఁదీసినది. ఆయజ్ఞము చూచుటకయి, నానాదేశములనుండి రాజన్యశిఖామణులు అనేక పట్టణములనుండి, కుబేరుని ధిక్కరించు వైశ్యులును, కృషీవలాధ్యక్షులగు శూద్రులును, ఆత్మీయబంధుసుహృద్వర్గసహితులయి వచ్చి సాంగముగాఁ గాంచి వ్యాసాదిముని బృందములతోఁ గలసి నిండు పేరోలగంబున నిదివఱ కెవ్వరు యెన్నఁడు యిట్టి యజ్ఞము చూడలేదనియు, ఎవ్వరు సేయనే లేదనియు, ఎన్నఁడో హరిశ్చంద్రుండు సేసినాఁడనియు, నాజన్మముగూడ దీనికి సమానము కాదనియు వేనోళ్ళం బొగడిరి. జనకా! నీవెఱుంగవు కాని—

ఉ. పాండవలక్ష్మిఁ జూడఁ దరమా కనకుండలపాండపుత్రకుల
హర్మ్యాండము నిండిపోయెను మహాత్ములు పార్థులకీరలక్ష్మి, భీ
ముండు జరాతనూజ ననిఁ బోకడ బెట్టుటఁ గాంచి భీతిచే
గుండెలు వ్రీలి పాండవులకుం బలివెట్టఁగ వైరిభూపతుల్.

ఇప్పుడు పాండవులకుం గలప్రాభవము చూచినచోఁ గొలఁదికాలములో నాచేతఁగూడ సుంకము పుచ్చుకొనిమెద రనియును, యీావత్సరమునుండి యొకతేఁడయిన మనకుఁ బన్నీయఁడు; పాండవు లియ్యనీయరు. బాగుగా నుండదని యూరకుందురేమో గాని, నీకును జెవులకుఁ దాటియాకులుగట్టి బొమ్మకట్టెదరని యును నాకుఁ దోఁచుచున్నది. మామయ్యా! క్షత్రియులకు రాజ్యము వీరభోజ్యమనుమాట పాండవులకుఁ జెల్లినది గాని, నాబోటియనాథకుఁ జెల్లునా? పెక్కుమాటలేల?

ఉ. భావి పురాతనాద్యతనపార్థివలక్ష్ములు పాండవేయల
క్ష్మీమవిభవంబుతోడ నుపమింప సమంబులుగావశేషరా

జావళిలోన సత్యధికు । లైన సపత్నుల పేర్మిఁ జూచియే
జూవె సహింపనోపక కృ। శుండ వివర్ణుఁడ నైతి నెంతయున్.

మామయ్యా! యొక్కొక సంగతి జ్ఞాపకము వచ్చినపుడెల్ల గుండె గుభేలు మనుచున్నది. తండ్రీ! నీవుకూడ సాకల్యముగా వినుము.

చ. మయసభ చూచితీరవలె । మాయురె రత్నమరీచిమాలికా
మయమయి కన్నుదోయికి ప్ర। మాదము సేసెను దాని కాంతి ది
క్చయములఁ బాండవేయ ఘన। శౌర్యయశోలత లల్లఁజేసె తం
డ్రీ యది లభించునే మనకు । నేనును నీవునుఁ తల్లక్రిందుగా
నయి తపమాచరించిన న। హా పదివేలసమంబు లీభువిన్.

గుణోత్తమా! పాండవేయుల సంపత్తు లమేయములు. దిగ్విజయ సమార్జిత చిరత్న రత్నసముదాయములు వారి కొట్టులంబడి చూచువారు లేక, కుప్ప కుప్పలుగా గోడమూలలకుఁ దోయఁబడినవి. అవి చూచి నాకనులు కుట్టి యింటికిఁదెచ్చుకొనినఁ బలువురు విని పరిహాసింతురని యెంచి, పగతురసిరి యెట్లులయినను పాడుచేయ నెంచి, చూచి, చూడక యనేకమంది యపాత్రులకు నా రత్నములు గంపలకొలఁది యిచ్చివేసితిని. అప్పటికి నా కసుపుమంట తీరక, సంచులకొలఁది రత్నములు నాపరిచారకులచేత గంగలోఁ బారఁబోయించితి. తిరుగలేక వారి కాళ్ళు బలపములు కట్టిపోయినవి గాని యాసంపదకు తరుగా విరుగా! మహానదిలో నీరంబులు పుడిసిళ్ళతోఁ బారఁజల్లనెంచు నాదురాలోచనయే బయిటఁబడినది. మాతులా! యింకొకసంగతి జ్ఞాపకము వచ్చినది. ఆధర్మరాజు యజ్ఞసమయమునఁ గొందఱు రాజులు కానుక లొసంగిరి. ఆవిభవము నాకుఁ జూపి నన్నుడికిలించవలయునని యానల్లగొల్లని మా

యాలోచనయో, నా కాజన్మవిరోధియై గర్వపోతు, తిండిపో తునగు భీముని కుచ్ఛితపుటాలోచనయో గాని నాకు గొప్ప మర్యాదఁ జేసినట్లు పదిమంది యనుకొనునట్లును నేను సంత సించునట్లును విదేశీయులగు రాజులు గొనివచ్చు కానుక పళ్ళె రంబులు సోమయాజికి బదులు, నేను గ్రహించి, కొట్టులం బడవేయ నాప్రక్కను క్రిక్కిరిసియుండు సేవకావళి కంది యిచ్చుటయే నాపని. నేనును, చిన్నప్పటినుండియు సాము గరిడీలు, కొద్దియో గొప్పయో, గదాయుద్ధసాధనము చేసి యారితేరినవాఁడనే. నాబాహువు లుక్కుతునకలు గాని చ చ్చుచేతులు గావు గదా! అట్టి నాబాహువులు, యజనస మాగతరాజలోకసమర్పిత పారిబర్హిక పళ్ళెరంబు లందుమా త్రిపుపనికే నాచేతులు కంది, కాయలు కాచి పచ్చిపుండ్లయి నవి. నాభుజములు తీపులు పుట్టుచున్నవి. అట్టి సంపద కను లారఁ జూచి, క్షత్రియజాతి పురుషుఁ డూరకుండునా చెప్పు. బాబాయి! యొక్కొక సంగతి జ్ఞాపకము వచ్చినపుడెల్ల గుండె బ్రద్దలయి భీతివాడము మన్నది.

శకుని—ఇదియా నీవిచారకారణము? ఇంతమాత్రపు కర్జమునకేనా బ్రహ్మాండము మునిగిపోయినట్లేడ్చుచుంటివి. ఎన్నివిధముల బ్రతిమాలిన నావఁగిఁజంత సంగతిఁ దెలియనీయక పోయితివే. ఇట్టివిచారము నీకే కలిగిన దనుకొంటివా? క్షత్రియజాతి యందుఁ బుట్టిన ప్రతిపౌరుషవంతునకు శాత్రవలక్ష్మి యస హ్యముగా నుండక మానదు. పౌరుషముచేతనో యుపాయము చేతనో శత్రుసంపద ముక్కాలమూఁడుగడియలలోపల నప హరింపవచ్చును. ఇంక నాకుఁ జెప్పనక్కర లేదు. బావగారం గీకరించిన, పాండవలక్ష్మి నీకుఁ దక్కిన దనుకొనుము.

ధృత—(స్వగతము) వీఁడు దుర్మార్గుఁడు. కపటోపాయజీవితుండు. వీనిచే నాకులంబునకుఁ గీడుమూడును. వీనిమాటలు కుబ్జ వానిని విననీయఁగూడదు. (ప్రకటముగా) నాయనా! పెద బాబు! నీవు కూడ నొకయాగము ప్రారంభింపుము. నీయిష్ట మువచ్చినట్లు దానము లొసరింపుము. రాజాధిరాజులు నీకు మాత్రము పారితోషకము లొసఁగరా? పాదాక్రాంతులు గారా? పాండవులపాటి యైశ్వర్యము నీకు లేదా? వారు నీకు విధేయులు. నీజన్మమున కెట్టికొఱంత రాకుండఁ గాపా డఁగలరు. వెఱ్ఱితండ్రీ! నీకుఁగల సంపదతో ధర్మసూను సం పద యెన్నిక కగునా?

దుర్యో—తండ్రీ! మీచిత్తవృత్తి నాకుఁ బరిపూర్ణముగాఁ దెలియు ను. నీమనంబు పాండవపక్షపాతము. నిన్ననకూడదు గాని, జన్మాంధుఁడవగు నీవు పాండవలక్ష్మినిఁ జూడఁజాలవు. తెలి యదు. చూచినచోఁ గడుపు చెరువుగాకమానదు.

సీ. పౌరుషములేదు కాఁబట్టి । బ్రతికినాఁడ
వీరుఁ డెవఁడైన బ్రతుకునా । పృథివిమీఁద
పాండవైశ్వర్య విస్తార। వైభవంబు
కనులఁజూచిన బ్రతికెడు । ఘనుఁడుకలఁడె?

తుదిగా నొక్కనిదర్శనముమాత్రము సెప్పి యీకలాపము మాని ప్రాణత్యాగమహోత్సవ మొనరించుకొనెద. ఆరాజసూయ యాగకాలంబున యంత్రనిర్మాణ ఘటనాచణులచే నొక్క గంట భోజనశాలయందు కట్టఁబడియె. దానిచిత్ర మేమియో లక్ష బ్రాహ్మణభోజన మయినతోడనే దానికడుపుడక టంగు మని యొకమ్రోతఁ మ్రోఁగును. అట్టిది యాయాగసమారంభ కాలము మొదలు సమాప్తి నొందుదనుక రాత్రిందివములు

క్షణకాలము వ్యవధి లేక గణ గణ గణ మ్రోగుచునే యున్న
ది. ఆమ్రోఁత వినినప్పుడు నాకుంగల పరితాప మెంతయని
వర్ణింతును. బావాయిగారు! పాండవాగ్రజునికీర్తిచంద్రిక
లోకాంతరాగంబుల వెలుంగఁ జేయుచున్నది. మఱియు నాధర్మా
త్ముండు నిత్యమును యెనిమిది వేల బ్రహ్మవిదులయిన బ్రాహ్మణ
ప్రవరులఁ బ్రత్యేక ప్రత్యేక సౌధంబుల నిలిపి యొక్కొక్క
రికి ముప్పండ్రు దాసీల నొసంగి సకలవిధంబులఁ బోషింపుచు
తనపంక్తిని పదివేలభూసురశిఖామణులకు బంగరుపళ్ళెరం
బులఁ బ్రతిదినంబు గుడువంబెట్టుదురు. మామయ్యా! విధి
చమత్కారము చిత్రదీపమువంటిది.

ఉ. దైవము మొండియాయువు వృథా చిరకాలము నాకుఁ బోసె నా
నావిధసౌఖ్యసంపద లనారతముఁ భువి పాండునందనుల్
ద్రావితవైరిపులయి గ్రాలఁగ వారలఁ జూచి దేబనై
చావఁగ లేక నే బ్రతికి సౌఖ్యము నొందఁగ లోనఁ గ్రుళ్లుచున్.

యింకష్టపుం బ్రతుకు బ్రతుకఁజాల. ఆపాండవశౌర్యసంపదలు
బ్రహ్మరాక్షసునివలె నావెంటఁబడి నాకనులు మిఱుమిట్లు
గొలుపఁజేసి, నా దేహంబు దాహంబుఁ జేయుచున్నది. ఈ
యసహ్యాగ్ని నారక్తమును బీల్చిపిప్పిఁ జేయుచున్నవి. మధ్య
మధ్య నాకు విస్మృతి కలుగుచున్నది. నాప్రాణ మెగిరి
పోవుచున్నది.

శకుని—రాజరాజ! దుర్యోధనసార్వభౌమ! నే నొకయుపాయంబుఁ
జెప్పెద. ధర్మతనయుండు జూదంబునకుఁ బ్రియుండు కాని,
యందులవుక్కివం బెఱుంగఁడు. నే నక్షవిద్యయం దతిదక్షుండ.
కావున నశ్రమంబున వానినోడించి తదీయరాజ్యవిభూతి నీ
కొసంగెద. దీనిచే నీకు నణుమాత్రంబయినను శ్రమంబు లేదు.

పౌరుషహానియు లేదు. నీసేనకుగాని నీకుగాని యేవంత శ్రమయు హానియుండదు. క్షత్రియులకు శత్రువుల రణమునం దోడించి సిరు లాడిసికొనుట లెట్టిలో ద్యూతమన్న నట్టి దయె. కావునఁ బాండవుల నిచటికిం బిలుపింపుము. నాప్రజ్ఞ కనుఁగొనుము.

దుర్యో—(తండ్రిపాదములు పట్టికొని) జనకా! పాండుపుత్రులు మొదటినుండియు నాకు విరోధులె. విరోధులవిజయంబు వినియుఁ జూచియుఁ బౌరుషంబుగల రాజు మనఁజాలఁడు. ఏయుపాయము చేతనయినను పగతురఁ బాడుసేయుట మీసముగల మగవానికి మీసరము. కావున మామయ్య చెప్పినచొప్పున నొప్పుకొనుము. నీ వేవిధంబుననైనఁ బాండవుల జూదంపు కొలువులోనికిం దింపకున్న నీదిక్కులేని పీనుగ గ్రక్కున నీ పాదములపైఁబడి శిరంబు తెగవ్రేసికొనకమానఁడు. పెద్దకొడుకును జంపుకొనుటకు నీకిష్టమొ, పాండవులఁ గాపాడుకొనుట నీయభిప్రాయమో చక్కఁగ నాలోచించుకొనుము. ఇష్టాయిష్టములఁ దెలుపుము.

ధృత—నాయనా! దుర్యోధనా! యిపుడు వేవురు శిల్పాచార్యుల రావించి కలధౌతస్తంభసహస్రమండితంబును, విచిత్రద్వారదేశంబును, వివిధమణిఘృణిప్రభాభాసితంబును, రమ్యతరంబు నయిన యపూర్వసభాభవనంబు. మూఁడునాళ్ళపట్టపగలున నిర్మించ నాజ్ఞాపించెద. మఱియు నీ కింకొకరహస్యంబు సెప్పెద. మనరాజ్యంబు మొదటినుండియు నేను గ్రుడ్డినగుటచే నాతండ్రినాఁటినుండియు భీష్మబాహుబలముచేతను, నీతిశాస్త్ర రహస్యంబుల వాచస్పతి నటుండుమను విదురుని బుద్ధికుశలత చేతను రాజ్యతంత్రంబు ప్రవర్తిల్లుచున్నది. కావున విదుని

శ్రావించి నీ యభిప్రాయంబుఁ దెలిపి యాతని యనుమతంబున నెగడుటచే లగ్గగునని నా యభిప్రాయము. ఇది నీకును మంచిదియే.

దుర్యో—మామయ్యా! యీ చీకు పుత్రప్రేమ వదలినాఁడు. నా యభివృద్ధి వీని కనభిమతమే. కావున నీవర్తమానము తండ్రికిఁ దెలియకుండనే ప్రాణములు వీడెద నని నీతో మొఱఁబెట్టు కొంటిని. తండ్రీ!

గీ. కొఱవితోడను తలగోకి కొనినయటుల
విదురుతోడను యోచన కుదురునయ్య
పాండుపుత్రుల కెప్పుడు పక్షపాతి
శకుని కైతవ మతనికి సమ్మతంబె.

తండ్రీ! పెక్కుమాటలేల,

చ. తనయులు నూర్వురుండి రిలఁ దక్కువె నేనొకఁడగ్గ నశించినన్
మన మలరంగఁ బాండుసుతమండలితోడను మాటనల్వురే
తనయులటంచు నీమది ముదంబును బొందుచు భూమి హాయిగాఁ
మనగదవయ్య తండ్రి గతిమాలినపుత్రుఁడు చచ్చు నిప్పుడే.

ఓ, సర్వభక్షకా! యొక్కసారిగా నీవు నన్నుఁ దగులఁబెట్ట లేవా? ఓ భూదేవి! నీ వయిన నీకష్టుని లోనికిం గొనిపోవరాద. (అని తల నేలఁ గొట్టుకొనవలయు.)

ధృత—(చెయ్యిచాచి పట్టుకొని) నీకన్న నాకు లోకములు, పాండవులును యెక్కుడా? నాయనా! యేకార్యమయినను విమర్శింపక వైళంబ సేయకూడదు. అట్టివాఁ డిక్కట్టులకు మూలమగును. పాండవసభకన్న వేయిరెట్లు సిరిసంపత్తులుగల సభాభవనము నీకుఁ గట్టించెద. వేఱొకయాగము చేయించెద. పాండవులఁ బిలుపించెద. కాలానుకూలము ననుసరించి కార్య

నిర్వాహక మగుమార్గము యోచించెదము. బలవంతముగాఁ బ్రాణముఁ దీసికొని యేమిచేసెదవు.

దుర్యో—తండ్రీ ! యేమిచేసెదనా ? బలవన్మరణము నొందుటచేఁ బిశాచజన్మ వచ్చునని మనశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. కావునఁ బిశాచమునై ద్రౌపదిం బట్టి పీల్చి పిప్పిచేసి పాండవుల బిచ్చగాండ్రఁ జేసి యొకరిమాట లొకరికిఁ గానీయకుండఁ జేసెద. నా కీసభ యక్కరపట్టదు. నాన్నగారు! మయసభలో నాకు జరిగిన పరాభవములు లెక్కలేవు. తొందరనొందకుము మని చెప్పు మీ యుపదేశములు పాండవులకు నేను జేయు యపకారములవలె వ్యర్థము లగుచున్నవి. మయసభ నాకనులముందట నిలిచియున్నది. అచ్చటి శబ్దములు నా చెవులలో నిండియున్నవి. ప్రపంచమంతయు నాకనులకు మయసభవలెఁ, ధ్వనులన్నియు నచటి ధ్వనులవలెఁ బాంచాలీపరిహాసస్మేరరవంబువలె వినఁబడుచున్నది. ఇటు వినుము. యజ్ఞమయిన పిమ్మట నొక్కనాఁడు సభావైభవములఁ జూచినను తనివితీరక యొక్కనాఁడే నొంటిగాఁ బ్రవేశించి పరిశీలింప సమకట్టి సేవకుల నందఱి నొకమూల విడిచి నే నాసభాభవనము ప్రవేశించితి. ఇంక నే పడినపాటు లాదైవమున కెఱుక. ఒక గృహంబున నలుమూలలను వివృతద్వారంబుల కెదురుగా నంతియపొడవును వెడల్పును గల దర్పణంబు లమర్పఁబడియున్నవి. కావున నిచ్చట దర్పణప్రతిబింబితద్వారంబులు గని మనద్వారంబులుగాఁ దలంచి యనంతర గృహనిర్మితచిత్రదర్శనార్థము వైళంబుగాఁ జనంబోయితి. అప్పు డాస్ఫటికపుకట్టడమునఁ దఖుక్కులు గులుకు పలకలుదీరిన యద్దపుకమ్మి నా నుదుటికి టంగునఁ గొట్టుకొని! బాబుగారు! చెయ్యియేది! యిటుచూచుడి

(అని చేతినిఁ బట్టుకొని) పెద్దయుసిరికాయవలె బొబ్బకట్టినది.
ఆదెబ్బ తినినతోడనే తల గిఱ్ఱునఁదిరిగి కనులవెంట బొట
బొట నీళ్ళుపడినవి. అప్పుడు నాలుగుమూలలనుండి యేదా
సీతొత్తులు చూడలేదుగదా యని తిరిగి తిరిగి వెనుకచూచు
కొనుచు మొగమునఁగల బొప్పి పరులుచూడకుండఁ గిరీటము
ముందటికి మాటుచేసికొని బ్రతుకుజీవుఁడా యనుకొని అవ
తలబడితిని. అంతటితో వెనుకకు రారాదు. నాబుద్ధి పూర్తి
మేసి యింకొకస్థలమునకుఁ జూడఁబోయితి. మహారాజా! య
క్కడి పరాభవము చెప్పఁజాలను. తలఁచిన నిప్పుడు యేడ్పువ
చ్చుచున్నది. ఏమన నచ్చటి విశాలప్రదేశము శాణనికషణ
మ్మున మెఱుఁగులుదీరు చలువఱేరాపలకలు పరచి వానిపయి
స్వచ్ఛమ్ముగు నీరమ్మువిడచి కృత్రిమసరోవరమ్ము నిర్మించిరి.
దానికి నలువైపుల తరవణిపట్టి పలకలుదీర్చిన స్ఫటికపురాగో
డలు కట్టి ప్రాతశిలాతలమ్ముల గారుత్మత, పద్మరాగ, వైడూ
ర్య గోమేధికాదుల జలచరంబుల శిల్పికారులు, జీవప్రతిమల
వలె నిర్మించి కుహనాపద్మినీలత లవారిగాచిత్రించిరి. ఆగోడల
ధాళధళ్య మానీటిమీఁదఁ బ్రతిఫలించి మెట్లప్రదేశమువలె
నుండుటఁజేసి నీటియందుఁ బ్రతిబింబితమయిన కృత్రిమా
రవిందము స్థలారవిందముగాఁ దలఁచి దాని నిర్మాణచమ
త్కారము గాంచఁబోయి కట్టుబట్టలతో నీట దిగఁబడితిని.
అప్పుడు నా మనం బెంత దుఃఖించియుండునో విచారించుము.
అప్పటికే సగముచచ్చి సిగ్గుపడుచున్న నన్ను మీపెద్దకోడలు
మహాసాధ్వియని మీయందఱిచేతను బొగడఁబడు ద్రౌపది,
యేమూలనుండియో దాసురాండ్రతోఁగూడి వచ్చి సింహాస
నంబుపైఁ గూర్చుండి, అయ్యగారు పడినారని యొకరు, కాలు

జారినదని యొకర్తు, యయ్యోయని యొకరిత, బాబు, బాబు యని మఱియొకర్తుక, ధృతరాష్ట్రమహారాజుగారికుమారులు గారఁటే యని యొకరిత, పక పక నవ్వి, చప్పటులు గొట్టిరి. ఇంతలో నన్నోదార్చి మర్యాదఁజేయవచ్చినట్లు సహదేవుఁడు పరిచారకులచే దుకూలంబుల మోయించుకొని నేను నీటి నుంచి లేచునప్పటికే యేమూలనుండియో వచ్చి సిద్ధముగా నుండెను. పరిచారకులు తడిబట్టలు విప్పి పట్టుబట్టలు కట్టుకొనుండు. అయ్యో! త్రోవ యిది, త్రోవ యిది. ఇటు యిటు. అని ముందు త్రోవఁజూపుచు సహదేవుఁ డొకచెంపను, పరిచారకుఁ డొకచెంపను గేలిచేయుచు సభాభవనముఁ జేర్చిరి. ఇంక నాగతి చెప్పఁదరమా?

ఉ. ఇట్టిపరాభవం బెటుస। హించి మనంగలవాఁడ రాజనై
పుట్టి పరాక్రమస్ఫురణ। మోమునఁ దెల్పెడు మీసముండి చేఁ
బట్టితి నాయుధంబు మగ। వాడను కాదొకొ, పౌరుషంబనా
చట్టయిపోవ నీగతిని। చావకయుందునఁ దండ్రి చెప్పుమా.

ఎంతపతివ్రతయైనను ఆయిదుగురు మగల వరించినను నిర్భయ మింత పనికిరాదు. అంతఃపురస్త్రీలచేఁ బరాభవింపఁబడు రారాజు బ్రతికి ప్రతిక్రియఁ జేయకుండునా! యోచింపుము.

శకు—అబ్బాయి! నీకు దుఃఖముకలుగవచ్చునుగాని ఇంతదిగులుపడి వెలిపుచ్చరాదు. మనస్తాపము, వంచనయు, పరాభవము, గృహదుశ్చరితము, పరులకుఁ దెలియఁ జేయరా దందురు. పాండవులఁ బిలుపించెద నని మీతండ్రి చెప్పినాఁడు. వచ్చినప్పుడు జూదప్రక్రియచే నాతని తప్పక యోడించవచ్చును. నీతండ్రి నిన్ను వృద్ధిఁజేయకుండునా? విదురుఁడు పాండవపక్షపాతి యయినను మీజనకుని యాజ్ఞఁ దిరస్కరింపఁడు. పదే

పడే పరిదేవనము పనికిరాదు. నీజనకునికన్న నీయోగక్షేమ
ములు విచారించువాఁడొకఁడుండునా? కావున నూతనసభా
భవనవిలోకనకుతూహలంబునఁ బాండవు లరుదెంచెదరు.
ధైర్య మవలంబించుము. నీమనోగతంబుఁ గనిపెట్టవలయు నని
పలుకుపలుకుల కీవు యులుకుచుంటివిగాని వీరవరు లలయ
కుండ నాయుధము చేతఁబట్టక, కదనరంగము తొంగియైనఁ
జూడనవసరము లేక, పాచికలు చేపట్టి యీశకుని యశ్రమం
బునఁ బరమహీపతుల సంపదలు జయించి నీకిచ్చుచుండ బావ
గారు వద్దనునా? ఇంటికిఁబోయి భుజించుము, పొమ్ము.

ధృత—నాయనా! యిప్పటికిఁ బోయి భుజించిరమ్ము. నేను వేవుర
శిల్పుల రావించి చిత్రసభాభవననిర్మాణం బానరించెద. ప్రా
తిగామీ! విదురుని పిలిచికొనిరమ్ము.

(దుర్యోధనుఁడు, శకుని నిష్క్రమించుచున్నారు.)

విదు—(ప్రవేశించి) ధృతరాష్ట్రనరప్రభువునకు విదురుఁడు దాసుఁ
డు దండము లిడుచున్నాఁడు. (అని నమస్కరించవలయును.)

ధృత—శుభం బగుగాత, నాయనా! యిటు గూర్చుండుము. మొదటి
నుండి నేను గ్రుడ్డినయినను, భీష్మపరాక్రమమును నీనీతివిద్యా
నిపుణతయును నేత్రములుగాఁ గొని, రాజనామము ధరించి
యుంటిని గాని, రాజ్యలక్ష్మియొక్క వృద్ధిక్షయములు లాభా
లాభములు కీర్త్యపకీర్తులు మీవలననే లోకంబున నిలిచి,
ఖ్యాతి గాంచియుంటిని. మీయిరువురిలో భీష్ముఁడు కేవలము
జయలక్ష్మికై న్యాయముగా ఖడ్గంబు నడుపువాఁడే గాని,
మిగిలిన యుపాయత్రయముచే వైరివీరలక్ష్మిని హరించు
మార్గంబు నీవలె యోచింపఁజాలఁడు. కావున నారాజ్యాభివృద్ధి
యు, నాసంతోషము, నాకుటుంబాభ్యుదయము సర్వదా విచా

రించు నీతోడ మంత్రంబు సలుపక యే కార్యముఁ జేయఁజాల
ను. కావున నీవొక కార్యము గమనింపవలసియున్నది. మన
కుఱ్ఱవాఁడు మొదటినుండియుఁ బాండవులపై యసూయగల
వాఁడు. రాజునకుఁ బరరాష్ట్రహరణంబు సధర్మమైనను,అమా
యికులు వీరసింహులు నగుపాండవులయం దదికూడనిపనియె.
ఏవారికిగాని నైజగుణంబు విడుచుట దుర్లభంబు. వానికిఁ
దోడు మాయలమారి శకుని వానికి జతపడినవాఁడు.
వీరిరువురిమూలమున మనవంశమున కపఖ్యాతి తప్పక
రాఁగలదు. ఇంకఁ గర్ణకీటకము వంశభూరుహముయొక్క తల్లి
వేరును క్రిమముగాఁ గొఱుకుట మానివేయఁ జాలదు.
సర్వము దైవాధీనమని యే నమ్మియున్నాను. మయసభావలో
కనము మనపెద్దవానికిఁ బిచ్చిపుట్టించినది. కావున, నట్టిసభా
భవనము నిర్మించుటకై శిల్పుల కాజ్ఞనిచ్చితిని. చిత్రకారు
లపూర్వవైభవముతో నిర్మించిరి. దాన గృహప్రవేశముసలుపు
నపుడు, పాండవులతో సహా సమస్తబంధువర్గమును రావించఁ
దలఁచితిని. ఆనిండుపేరోలగంబునఁ బాండవాగ్రజుం డక్ష
విద్యాప్రవీణుఁడు గావునఁ గొంతద్యూతకళావైశద్యము, మేన
మామతోఁ గూడి సార్వభౌముం డనుభవింపఁదలఁచినాఁడు.
కావున, నీ వా పాండునందనులపాలికిఁ జని నాయాదేశంబుగా
వారి నిటకుఁ దోడ్కొనిరావలయు. యోచించుము.

విదు—మహారాజా! ఈవిషయ మంతగాఁ దమతో నొక్కి చెప్పఁ
దగదు. ధర్మవేత్తలు పలువిధముల యోచించి భావికాలగ
తుల నిరీక్షించి కలిద్వాపరసమాగమసమయము గావునఁ బ్రి
జాక్షయం బగునని నిశ్చయించిరి. ఇట్టికార్యంబున కేను నిశ్చ
యముగా నొడంబడనని, మీకుఁ దెలియనియంశము కాదు.

నీకుమారునితోఁ బాండునందనులకు వైరంబు కల్పించుట న్యాయమగునా? నీపుత్రులెల్లరు, సోదరులతోఁగలసిమెలసి యుండువెర వాలోచింపుము. జూదంబు వాదహేతువ. వాద మా, యెట్టిశాంతవాదుల నయినను, కలహారంగములోనికి దింపి తందనాలాడించక మానదు. కావున నీబుద్ధికుశలత నుప యోగించి శకునిదుర్యోధనుల దుర్వ్యవసాయము మానుపిం చి, కురువంశరక్షణోపాయధురంధరుండ వగుము. వృక్షనాశన మునకు వేరుపురు వాధారమైన ట్లీజూదపుపురువు నీవంశవృక్ష ము నశింపజేయుటకై, ముఖ్యహేతువ కాక మానదు.

పాండవుల జూదంపుమిషచేత నోడించి, యేదయినఁ బన్నుగడఁ బన్ని ద్రౌపదికిఁ బరాభవము సేయవలయునని నీకుమా రుని ముఖ్యాభిప్రాయము. మహాసాధ్వియగు కృష్ణాదురంత దుఃఖసవనచ్ఛవి, కౌరవమదగాఢాంధకారంబు పటాపంచలు గావింపక మానదు. మీామనంబున యోచించుకొని, మీా యెత్తుగడకు లోఁబడుఁడు.

ధృత—వినయవిధురా! విదుర! నీమానసంబత్యంతమ్మృదులంబగుటను, ధర్మనందనాదులయమాయకవృత్తి బాగుగా నెఱింగినవాఁడ వగుటను, నీమనంబు పిరికివడినది. పోనిమ్ము. భీష్ముండును, నీవును, మనస్ఫూర్తిగ నంగీకరించనిది యీకార్యము నడుప వలదు. కాని, యేనాఁడు నాతమ్ముఁడు కాననంబుల శాపోప హతుఁడాయెనో యప్పటినుండియు గసిగందులఁ బెంచితిగదా? వారిలో మహాశాంతుఁడగు పెద్దబ్బిని జూచి యెన్నోదినము లాయె వానిమాటలేవేరు. మిత్రమా! నిజముగాఁ గడుపు తీపిచేత నేనే విదిలించిన, దుర్యోధనుఁడు, చిన్నపుచ్చుకొనునే మోయని వెలువరించను గాని, మాపెద్దవాఁడు నాయందుఁ

జూపులినంయంబునఁ గీసరపాలు పీఁడెన్నఁడు నూపియెఱుఁగఁ డు. అట్టిధర్మజుఁడు లేనిది, నూతనసభాప్రవేశము చేయు దునా? చెప్పుము. సుహృద్ద్యూతమైనను ద్రోసఁగుపొసఁగునని నీకుఁ దోఁచినను, సభాసదుల యభిప్రాయము వేరుగనున్నను నేనుమాత్ర మంతయజ్ఞానినా? బిడ్డలకు కలహము పెంచుదు నా? అట్లు చేసిన నలుగురిలో పరీవాదమురాదా? అట్టి యకృత్యము జరుగదు. నీ వేయభ్యంతరమును జెప్పక, యిప్పుడే యింద్రప్రస్థమునకుం బయనమగుము.

విదు—ప్రభువులకు సేవకుఁడు విన్నవించువాఁడే గాని కార్యసిద్ధాంత మొనరింప యధికారి కాఁడు. కాని, నిక్కంపుమిత్రభావము సూచించువాఁడు మనంబునఁ గలసంశయము దాచుకొనఁ జాలఁడు. అయ్యది ప్రభువులను రంజింపఁజేయుటకుఁ బ్రకృత ము సమర్థముకాకపోయినను, కార్యావసానఫలితములయందు యథార్థవాదిమాట జ్ఞాపకము రాకపోదు. ద్యూతరంగమునఁ బాండుపుత్రులఁ బ్రవేశపెట్టుటచేఁ బ్రకృతము వారిసంపదలు నీపుత్రుల సాశ్రయించినను, చిలుము ద్రింగినవానికిం గడుపున వికారము గలిగించి, తొంటిపదార్థములఁగూడ వెడలఁగ్రక్కం చినట్లు తనుమనఃప్రాణమానముల వెడలింపక మానవు. ఇది నిశ్చయము. ఈయపఖ్యాతి నీకుఁ దప్పదు.

ధృత—మిత్రరత్నమా! నీతిసుధాలిప్తంబులగు నీవాక్కులను కమ లారాతికరంబులు మామకవిచారతమఃపటలవిపాటన పాట వంబు లయినవి. దుష్టద్యూతమైన నుపద్రవనిదాన మనుటకు సందియమా? కులవృద్ధుఁడును, వీరసింహుఁడును, భీష్ముండు నగు గంగానందనుండును, బృహస్పతి నటుండమను నీతిసుధా సంకలితవచనరచనాచణుండ వగునీవును, నేనును, ద్రోణా

దులు పైనఁ జూచుచుండఁ బుత్రుల కన్యోన్యము భేదము, అహితము, అకార్యము జరుగునా? ఇదియునుంగాక మనయొడల, వేల్పులు ప్రసాదబుద్ధులు. వారు కంటికి రెప్పవలె మనలఁ దప్పక కాపాడఁగలరు. సుహృద్ద్యూతంబునఁ విపదుత్పత్తి యగునని శంకించుట నామతంబు గాదు. కావున దీనికి నొడంబడుము.

విదు——మహాప్రభూ! సుహృద్ద్యూతమని లోకంబునఁ గలదా? మాయానిలయుండగు శకునికైతవము, మనకుఁ గొత్తదియా? చిన్నప్పటనుండియు నీచేతిమీఁదుగఁ బెంచి పెద్దవానినిఁ జేసి, రాజ్యదాయమునకై పరస్పరకల్లోలము నందు నీకుమారుని దుర్వ్యవసాయము మొదటినుండియు నీకుఁ గరతలామలకమైయుండియు, వానిమాటలకు లోఁబడి, ధర్మాత్ములగు పాండవుల నిట్టి యకృత్యమునకుఁ జొనుపుటకై నీవే ప్రయత్నింపనిఁక నేతండ్రి పుత్రులకు విషము పోయుకుంటుం! మహాసేన, మహాభిష, శూరసేనుల నాఁటినుండియు నీవంశమున స్థిరముగఁ బాదుకొల్పిన కీర్తిభూరుహమును నేఁటికి నీపుత్రుని కుహనాప్రవర్తనకు లోనై, నీచేతిమీఁదుగ నశింపఁజేయకుము. కుచ్ఛితముగాఁ బాండవులసంపదలు హరింపఁజూచిన, బలవద్విరోధము ప్రాప్తించును. ఎట్టివారికి బలవద్విరోధము చేటునకు మూలము. మద్యపానము మనుజుని యకృత్యములలోనికిఁ దోయునటుల, ద్యూతమును చలమును రెట్టింపఁజేసి, యాశామాత్సర్యాదులఁ బెంచి, యెట్టిస్నేహితునైనను వైషమ్యప్రవాహమున ముంచి చేటుచూడఁజేయును. ఇంతకుఁ బాండవుల యభ్యున్నతి నీకుమారుఁ డోర్వలేనివాడని నీకు స్పష్టమే కద. ఇదియునుంగాక యింకొకరహస్యముఁ జెప్పెద. పాం

డునందనసంపదలకంటె నీపెద్దకుమారునకు మనస్తాపము గలి
గించునది ద్రౌపదియందలి వ్యామోహము; మఱియు నామె
యందు నీర్ష్యయుఁ గలదు. మయసభయందు ద్రౌపది పరా
భవించిన దనువ్యక్తకోపముచే నీయాజ్ఞ నెఱవేర్చెద, ముద
లనోపఁగలను. ఇదిగో విదురుఁడు దండము లిడుచున్నాఁడు
(అని నమస్కరించి నిష్క్రమించును.)

ధృత—విదురునకు మనస్తాపము కలిగినది. అది మన కనిష్టమే. కావున
నూతనసభను చూచుటకై రారాజును పిలుపించి ద్యూతము
తగదని మందలించెద. ప్రాతిగామీ!

ప్రాతి—చిత్తము. అయ్యా! (అని సమీపించవలయును)

ధృత—అంతఃపురమునకు మార్గము?

ప్రాతి—ముందల. (అని చెయ్యిపట్టుకొని ధృతరాష్ట్రుని తేవఁడీయుచుం
డఁగా తెర వేయవలయును.)

రాజమార్గము.

[విదురుఁడుప్రయాణవేషముతో మార్గమునఁ బ్రవేశించి తనలోఁ
గొంచెము విచారము మోమున సూచించుచు]

నాప్రయాణము బొత్తుగా బాగుగా లేదని ధృతరాష్ట్రుఁడే యెత్తుకోలు
నడుపుట సర్వానభిమతమని భీష్ముఁడు మున్నగువారు స్పష్ట
ముగా వాక్రుచ్చినారు. మఱియు దైవయోగమున నేనే
స్వయముగా వారిని విపత్పురణంబున ముంచుటకై తీసికొని
రావలసివచ్చినది. ధర్మరాజమాయికుఁడు నీతినిర్వాహకుఁడు.
పెద్దలయాజ్ఞయనియో, ద్యూతము క్షత్రధర్మమనియో, నేను
స్వయముగాఁ బిలువవచ్చితిననియో రాకతప్పదు. తమ్ములు
వీరులు, బలవంతులు, లోకవృత్తంబుల బాగుగా నెఱింగినవా
రలే కాని వారు నలువురు సోదరాజ్ఞాలానబద్ధులు. అయ్యది

లోకమునందుఁ బ్రఖ్యాతిఁ దెచ్చునుగాని ప్రకృతము వారి నిడుమలపాలు సేయును.

చ. హరి హరి యెంతపాపము మహాప్రభుపాండుకుమారు లీయెడన్
దురిత మెఱుంగ రాఘనుల ద్రోహము సేయఁగ ధార్తరాష్ట్రుఁడే
దొరకొనెఁ దండ్రి యొప్పుకొనె దోస మెదో ననుఁ జుట్టియుంట స
చ్చరితులఁ దెచ్చి దుఃఖగురుసాగరమగ్నులఁ జేయనైతి హా!

ధర్మమే జయమని శాస్త్రమే నుడువుటకాదు. ఈయుగంబునఁ గొలఁదికాలముక్రిందటనే మన కనేకనిదర్శనములఁ జూపింప నవతరించిన కృష్ణుండు పాండవపక్షపాతి. కంసుఁడు మొట్టమొదటఁ గృష్ణమూర్తిఁ జంప నుద్దేశించి పరమభక్తుండగు యక్రూరుని కృష్ణునికడకు దూతఁగాఁ బంచినట్లుగా నాగతియు భగవదనతారాంతరమని లోకములఁ బ్రఖ్యాతిగాంచిన నరుని; యాతని కుటుంబమును దీసికొనివచ్చుటకు నేనా యితనికంటె కగుపడితిని? ఏరినైనఁ బంపఁగూడదా? నా గ్రహచారము చాలక యిట్టిపని నాకు సంప్రాప్తమైనది. (యోచించి) ఒకవేళఁ గృష్ణాగమనంబు కంసవధకుఁ గారణమైనట్లు పాండవాగమనంబు విపరీతప్రయోజనముగా మాఱిపోయి కౌరవకులవినాశకారణము కాదుగద! ద్యూతమే ప్రారంభింపఁబడిన, నిప్పుడే కాకపోయినను కాలాంతరమందైన నీవిషబీజము కౌరవవంశనాశననిదానము కాకమానదు. దానికిఁ బరమేశ్వరుండు నాచేత నించుకంత దోహదము చేయించుచున్నాఁడు. కృష్ణా! సర్వము నీదివ్యకళామయము. నీయధీనము.

(అని ప్రార్థనసేయుచు నిష్క్రమించును).

---



# ద్రౌపదీవస్త్రాపహారణము.



## చతుర్థాంకము.



[ధర్మరాజు, సోదరులు, ద్రౌపది, విదురుఁడు.]

విదు—మీతండ్రిగారు మీక్షేమాభివృద్ధి విచారించి, మీవలనఁ గొండొకకార్య మపేక్షించి, మిమ్ములఁ జూడఁగోరి నన్నుఁ బుత్తెంచె. ఇందులకుం దగిన యుత్తర మొసంగుము.

ధర్మ—నేఁడు మిక్కిలిసుదినము. మీరు మాకుఁ బ్రాణదాతలు. ఖనికునిచే కుహనాబిలనిర్మాణము గావించి, మహాబలశాలియగు భీముని కెఱింగించనిచో మాజీవితము లానాఁడే సమాప్తి నొందవలసినవి గదా? కౌరవులు, మే మీపరస్థలంబుల నుండుట వారిచే నిష్కాసితుల మైనవారిగాఁ దలఁచి సంతసించుచున్నను, ప్రతిక్షణాపాయ జీవితములగు ప్రదేశములనుండి తొలఁగి వచ్చినందులకు మిగుల సంతసించుచు, మ మ్మింతవృద్ధిలోనికిఁ దెచ్చిన పెదనాన్నగారి దర్శనము, నిత్యము నాకు లేకపోవుటకుఁ జింతించుచుంటిని. ఏనాఁ డేయడవుల నాతండ్రి మృతినొందెనో బుద్ధి తెలిసినపిమ్మట నీకరములు, పితృబాహుద్వయసమాలింగితసౌఖ్య మనుభవించి యెఱుఁగవుగదా? అట్టికొఱంత మాకుఁ గలుగకుండ, మనప్రభువరుండు నిత్యము తన మృదుకోమలపల్లవసమానంబులగు కరంబుల మామేనులు స్పృశించి, మ మానందసాగరవీచికల నూగులాడించు

చుండును. అట్టి మాతండ్రి భార్యతోఁగూడ క్షేమంబుగ నున్నవాఁడు గదా ?

విదు—పాండవాగ్రజా! నీ జనకుండు, సాధ్వీతిలకం బగు గాంధారితో క్షేమంబుగ నున్నవాఁడు. నీపయి ననురాగంబు, మనంబున నంకురించుచునే యుండును. ఆయనురాగాంకూరము దుష్టస్వభావులగు కౌరవకుహనాఘూసాంతరంబులఁ జిక్కి వృద్ధి కానేరదు. భావికలిలక్షణంబు లీయుగంబుననే మొలకలెత్తినవి. అందు దుర్యోధనవిషాంకూరము శతశాఖాప్రవిస్తరమై, తలలెత్తి విశాలచ్ఛదంబుల సేకరించుచున్నది. ఇంతకన్నఁ జెప్పఁదగనవిషయము లేదు. మీపెదతండ్రి సర్వదా నీక్షేమము విచారించుచుండును. ప్రకృతము, మయసభాప్రతిబింబితమయిన సభాగృహంబు, దేశీయశిల్పికారులచేఁ గట్టించి యందు గృహప్రవేశమహోత్సవము సేయఁబోవుచు, నిన్ను సకుటుంబముగాఁ దీసికొనిరా నను మీతండ్రి పంపినాఁడు. మఱియు, పెద్దబ్బ లేనిది యేకార్యము చేయుటకు నామనం బొడంబడదని చీకురాజు వాక్రుచ్చియున్నాఁడు. వానియభిమతంబు నెఱవేర్చుట మనకందఱికి విధియని వేరుగ నీవంటి వానిముందర ప్రశంసింప నక్కఱపట్టదు. ప్రయాణంబున కాయితం బయ్యెదవో? సోదరులతో విచారించి యొండు ప్రత్యుత్తరం బొసంగెదవో? కాలాతిక్రమణంబు గాకుండఁ జెప్పుము.

ధర్మ—అయ్యా! నాయోగక్షేమము విచారించు పెద్దనాన్నగారాజ్ఞయిచ్చుట, తా మీకార్యంబున కరుదెంచుట, యీపేద శిరసావహించి చేయకపోవుటయు కలుగునా ? అతిశీఘ్రంబున నిట్టిసభాభవన మచ్చటఁ దిరుగాఁ గల్పించుట కేమికతంబో ?

భీము—అన్నగా రన్నివిషయముల. వాచస్పతిసమాన శేముషీవిశేషు లరే. కాని, అత్యంతనిర్మలమనస్కులకౌట నరినిర్మితాగాధో దంబునం గూలుట సంప్రాప్తంబగును. నిశ్చయముగా నీవిషయ ము సహదేవుండు మీరు యోజించియే తీరవలయు.

ఉ. చిన్నటనాంటనుండి మముం । బెట్టినతిప్పలు చాల కప్పి డే
పన్నుగడన్ దురాత్ము లట । వంచనసేయంగం దెల్వనంపిరో
యన్న నయప్రధాన హృద।యంబు ధరాస్థలి సర్వసౌఖ్యసం
పన్ను నిం జేయు నారిపుల । భావముం గాంచి సరింపకున్న చోన్.

విదు—ధర్మాత్మజా! మఱియు నింకొక్కవిశేషము కన్న. అనూతన సభామంటపంబున నీవును ధార్తరాష్ట్రులును కొంతతడవు ద్యూతవ్యాపారము నడుప, మీతండ్రి చూంచి, యానందింప నెంచియున్నాండు. నీసోదరులును, నీవును చక్కంగ నాలో చించుకొని నాకు త్తరం బొసంగుడు.

భీము—యోజన సేయ నేమియున్నది.

గీ. పాండుపుత్రులు భూమిపై । బ్రతుక నేల
ఖ్యాతిం గన నేల విజయంబు । గాంచ నేల
న నెడు క్రోధంబు మదిలోన । నునుచుకొనియు
మనల వంచింప రారాజు । పనిచె నధిప!

దాని క్రాగుడ్డియు పయోముఖవిషకుంభమువలె నటించుచున్నాండు.. మనప్రాణంబులపైనున్న పగవానిని జీవింపనిచ్చుట ధర్మవిరు ద్ధమని యెఱుంగనిది కాదు. కావున నీ ప్రయాణమును దుర్యో ధనాదుల ప్రాణాంతకరమని నాయభిప్రాయము.

సహ—అన్నయ్యా! ధార్తరాష్ట్రులు దురాలోచన సేయనిండు. పాండవాగ్రజుండు ధర్మము తప్పువాండు కాండు. లోకము ధర్మాధిష్ఠితం బైయున్నది. ధర్మము జయాస్పదంబు. కుహ

నాస్వభావులు క్షణకాలము మించువలె మెఱసినను స్థిరంబగు తేజంబు వారియందు నిలువంబోదు. మఱియు మనల సంరక్షించుటయందు సర్వదా కృష్ణుండు కంకణంబు గట్టుకొనియున్నాండు. కాలనిరీక్షణ మాచరించిన సర్వకార్యములు నెఱవేఱంగలవు. దాయలచేంబిలువంబడి ద్యూతంబునకుం జనకుండుట యుత్తమక్షత్రియులకు పౌరుషము కాదు. పౌరుషమే ప్రధానముగ జీవించు మగవాని మనుగడయే మనుగడ. మన లక్కం బ్రాణదాతయయిన విదురుం డీవిషయము చక్కంగ యోచింపనిది యీకార్యభారము వహింపండు. కావున శాంతవృత్తితో ప్రయాణము సేయుట యావశ్యకము.

ధర్మ—నూతనసభావైభవము చూపుటకై మాతండ్రిగారు మమ్ములం బిలిపించుట న్యాయమె. కాని మేమును నిజనందనులును జూజంపుకోలువులోనికిం జేరుట కాతండిష్టపడునా? మంచిది. అందు మాతో ద్యూతవ్యాపారము నడుపు నేర్పరు లెవరు గలరు?

విదు—ధర్మాత్మజా! వృద్ధరాజుస్వభావము, మనోదార్ఢ్యము నీవెఱుంగనివాండవుకావు. దానికింతకన్నం బ్రత్యుత్తర మొసంగరాదు. అక్షకార్యనిపుణులగువా రాసభయందు వివింశతి, చిత్రసేనుండు మొదలగువారలు పెక్కురు గలరు. వీరలేల? రారాజునకు మేనమామయగు శకుని మాయాద్యూతమునం దందెవేసిన చేయియని నీవెఱుంగనిది కాదు. కాలయాపన సేయక తండ్రిగారిని, దేశమును, సోదరుల యభిప్రాయమును చూచికొని నీ యిష్టముకలిగిన బయలుదేరుము. కాదేని వేఱొండు ప్రత్యుత్తర మొసంగుము. అవుగాములు తెలుపుండు.

అర్జు—తెలుపవలసినదేమి ? మీరు వచ్చుటయే తప్పక యన్నగారి ప్రియాణము సూచించుచున్నది. కష్టములు రానీ సుఖములే కలుగనీ, పాండవసోదరులు యుధిష్ఠిరాజ్ఞోల్లంఘనంబు సలుపరు.

ధర్మ—మహాత్మా! నాసోదరచతుష్టయమే నన్ను సార్థకనామునిఁగాఁ జేయుచున్నది. ఈవార్త నాపురోహితుండగు ధౌమ్యున కెఱింగించి మీ వెనువెంట వచ్చి తండ్రిగారి యడుగుఁదమ్ములు సేవింపఁగలము. భవదుపదేశనీతిభేషజమే సర్వవిచారామయములనుండి మమ్ము తొలంగించి మనుచుఁగాత. తాము దేవపూజకు దయచేయవలయును.

విదు—(నిష్క్రమించును.)

ధర్మ—నకుల! ఱేపకడ తండ్రిగారి దర్శనమునకై పయనమగునటుల సేనలను శుద్ధాంతము నియోగించుము. సభ్యులకు సెలవొసంగుము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





# ద్రౌపదీవస్త్రాపహరణము.

## పంచమాంకము.

### దుర్యోధనునిసౌధము.

[ధృతరాష్ట్రుఁడు, సుయోధనుఁడు, శకుని యుండవలయును.]

ధృత—నాయనా! సుయోధనా! అపూర్వసభాభవనము నిర్మింపఁబడినది. దీనం బ్రవేశింప శుభముహూర్తము నిశ్చయింపఁబడినది. మఱియు దీనం బ్రవేశించి యద్భుతంబగు జన్నం బొనరించి పలువురు మన్నీలచే సన్నుతిగాంచుము. రాజులందఱు నీకు నవారిగా కానుక లర్పింపఁగలరు. యుధిష్ఠిరుండు సహకారి కాఁగలఁడు. భీష్మద్రోణాది మహాయోధ దోర్దండపరిఘాసంరక్షితంబైనమనరాజ్యంబు సకలలోకపూజ్యంబయి ప్రాజ్యరాజ్యసామ్రాజ్యవైభవోపేతంబు గావున భేదబుద్ధి మాని యుండుట లగ్గగు. మఱియు,

ఉ. ఇమ్మహి నీవు పాండవులు నెప్పటియట్ల పరస్పరానురా
గమ్మున నేలుచున్కి యిది కార్యము పాండవలక్ష్మి నీకస
హ్యమ్మన నేల వంచనఁ బరార్థ బరిగ్రహబుద్ధిసేసి పా
పమ్మగు పాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్.

కావున జూదము మాని సుఖంబుండుము. మఱియు ధర్మాధర్మవిదుండయిన విదురున కిది సమ్మతంబుగాదు. ధర్మజుసంపదకంటె నేను మడుంగులు నీకు సంపద గలదు. వారొనర్చినజన్నంబుకంటె

నెక్కుడుదక్షిణ లిచ్చి నీకిష్టంబయిన యజ్ఞం బొనర్పుము. దీని చే నపారంబగు కీర్తి వహించియుందుము.

మర్యో—తండ్రీ! నీ వమాయకుఁడవు. పుత్త్రప్రేమ పూర్తిగ వదలిన వాఁడవు. నీవు వేయిసభలు కట్టింపుము. పదివేలజన్నములు మితిలేని దక్షిణలతోఁ జేయింపుము. ఆవైభవములో సహ స్రాంశము దీనికి రాదు. ఆకీర్తియు దీనికి రాదు. ఇటు వినుము.

ఉ. ఎక్కడిరాజ్యలక్ష్మి మన। కెక్కడి సంపదలయ్య దివ్యమిం
కెక్కడిదయ్య తండ్రి నుతి। కెక్కినవారలు పాండవేయు ల
మ్మక్కయనంగ సాటి నృప।మండలి గుండెలు తల్లడిల్ల పెం
పెక్క పరాక్రమార్జితసు। రేశ్వరవైభవు లైరి వింటివే.

వారి యైశ్వర్యమును తేజంబును వర్ణించుట నాకుగాదు గదా సహ స్రశిరంబులు గల యాదిశేషునకైనఁ దరంబుగాదు. ఒక సార్వభౌముండు శత్రుసౌభాగ్యము సహించి యోర్చి ప్రాణములతో నుండఁగలఁడా? వారియజ్ఞంబునందు జరిగిన చిత్రం బొండు చెప్పెద. అట్టి యోగ్యత నా కీజన్మకు కలుగునేమో నీబుద్ధిచే యోచింపుము. రాజసూయావభృథస్నానానంత రమున నిండుపేరోలగంబున నున్నతఱి నానాదేశాగత రాజ లోకంబునకు ధర్మరాజదర్శనం బొసంగ కాలంబు నియ మించిరి. అప్పుడాశ్రితపాలనస్థకచ్ఛేద విరాజితశౌర్యా లంకారుం డగు శౌరియు, యసమాననీతివిద్యాపరిశీలనని ర్మలీకృతశేముషీవిశేషభూషణభూషితుం డగు సహదేవుండు ను, గుమ్మముకడ నిలువఁబడి కిరీటమాంధాత లగు రాజాధి రాజుల మెడఁబట్టి ధర్మజపాదపంకజంబుల మ్రొక్కించుచు నితఁడు కేరళదేశాధీశుఁడు,ఆతఁడు బర్బరవిషయభూపాలుండు, ఈతఁ డింకొకఁడు, ఆతఁడు మఱియొకఁ డనిచిల్లరభటాగ్రజులను

నెట్టినట్లు నెట్టిరి. భీమార్జునులు లోకవంక గ్రుక్కడిరాజులను ముందరికి గుంపులు గుంపులుగాఁ ద్రోచి, నామగోత్రంబులను దెలుపకయె దివ్యక్షేత్రంబుల మహోత్సవదర్శనాగతదూర దేశీయుల వేత్రహస్తులు నెట్టినట్టు, చర్మపరిహారంబుల గొఱ్ఱెలను దుర్రించినట్లు, ధర్మరాజు దర్శనము చేయించి తోలివేసిరి. ఆసమయంబున పరస్పర సంఘర్షణ రాజన్య కిరీట స్థగిత రత్న సముదాయంబులు చూర్ణంబులయి సభాప్రాంగణ మంతయు రత్నసికతామయమయి, కనులు మిఱుమిట్లు గొల్పినది. దమయంతీ స్వయంవరాగత రాజన్య సమూహము రాజమార్గంబులఁ జనునప్పుడు గానుగనువ్వగింజవలె నలిగియుండియు భైమీపాణిగ్రహణమహోత్సవాసక్త బందీకృత ప్రాణులయినట్లుగా గ్రంథాంతరవర్ణనల నాలకించి యుపమోత్ప్రేక్షాద్యలంకార నిబిడీకృత కృత్రిమ వాచాలు లని కవుల నా మనంబున నాక్షేపించితి. ఇప్పు డావర్ణనలను చాలవని మహోదారస్వభావ వర్ణనాపాశీల్యు లగు పండితుల వాక్కులనర్ఘంబులని యిప్పుడు తలంపునకు వచ్చినది. అట్టివైభవంబు నావంటి యదృష్టహీనునకు దొరకునా? తండ్రి! ఇట్లు నలుగుడువడియు మహారాజు లందఱు,

ఉ. సాగరసారవారిరుహ । సౌ క్తిక మౌ క్తిక విద్రుమద్రుమై
లాగరుచందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణయుక్తమై బరగు । సింహళ కేరళ చోళ పాండ్యదే
శాగతరాజపుత్రులు మహాగుణశాలి కజాతవైరికిన్,

మఱియు హూణ పారసీక దేశంబులయం దలి రాజులు పర్వతనిభంబు
లయినగజంబులు, దివ్యాంబరాభరణభూషితంబయిన యోషి
త్సహస్రంబును, మరు కుకురు కులూత కేకయ కాశ్మీరకాం

భోజ రాజకుమారు లవారిగా నోసంగిరి. ఇవియన్నియుఁ గన్నులారఁ జూడ నామనం బయోమయ మయిపోయినది. మహారాజా!

గీ. ఏకచక్రపురంబున । హీనగతిని
బిచ్చ మెత్తిరి పాండవుల్ । బిడియపడక
కాలవైఖరి మంచిదై । గాంచి రిపుడు
ప్రథితయశమును రాజ్యాధిపత్యమహహా!

బాబాయి! యుత్తమక్షత్రియుండు దాయలసిరిఁ జూచి మానప్రాణంబులతో జీవింపఁజాలఁడు సుమా.

శకుని—అబ్బాయి! ఇది మీతండ్రికిఁ దెలియని విషయమా పలుమారు వచించుటకు? బావా? పుత్త్రుఁడు శత్రువిజయ మొనర్చుట రాజ్యాభివృద్ధి సేయుటకంటె నీకు కావలసిన దేమి యున్నది. మఱియు వ్యవహారమన, నడుసునఁ బాతినకంబము వంటిది. ఎటువైపునఁ ద్రిప్పినను దిగఁబడునని, పుత్త్రప్రేమ నిన్ను యుద్ధమున కియ్యకొననియ్యదు. దీనికిఁ జక్కనియుపాయంబు నీకుఁ జెప్పితినిగదా?

చ. సిగపయి పువ్వువాడదు న । శింపదు సేన యొకింత యేనియుఁ
దగలదు చేతివిత్త మొక । దమ్మిడినైనను విక్రమంబు సొం
పుగఁ గసిగందకుండ కను । మూసిన కాలములోన మాయచే
పగతుర రాచకల్మిల న । వశ్యము గుంజగవచ్చు మెల్లగాన్.

ఈయుపాయముచేతనే పాండవలక్ష్మి హరియించవచ్చుగాని వేఱొకమార్గంబున దేవేంద్రుఁడయిన పార్థులసంపద నపహరింపఁజాలఁడు. ఒకఁడు చావక, రక్తముబొట్టైనను కనులఁజూడక, యలయక కుమారుఁడు వైరులసిరి యపహరింపవలదని నీ

వేల పుత్రుని చిన్నఁబుచ్చి యప్రతిష్టపాలు గావలయునో యోచింపుము.

**దుర్యో**—తండ్రీ! యింకొకమాట. పాండవు లల్పులు. వారల సిరి మనల నేమిసేయునని తలంపకుఁడు.

ఆ. అల్పుఁ డయ్యు మనుజుఁ । డతిపరాక్రమమున
పేర్మి తరతరంబు । పెరుగుచున్న
వాఁడు మ్రానుమొదలి। వల్మీక మామాఁని
జెరుచునట్లు గడగి । చెరుచుఁ బరుల.

**అహితుల** నుపేక్షించిన స్వల్పంబుగా జనించినవ్యాధి ప్రబలంబై మనుజుని నశింపఁజేసినట్లు తుద కసాధ్యులై ద్విషన్మండలంబులు యుపేక్షితుని నిర్మూలంబు సేయుఁ గావునఁ బరిపంథు లల్పులని యుపేక్షింపరాదుగదా. కావున వాని రణవ్యాపారంబున జయించుటకన్న మనమామ యనుగ్రహంబున,

క. పరమసుఖోపాయంబునఁ
బరసంపద చేకొనంగఁ । బడునేని నరే
శ్వర యంతకంటె మిక్కిలి
పురుషార్థం బెట్టి దొండు । భూనాథులకున్.

**కావున** నీసభలోపలఁ బాండవులతో సుహృద్ద్యూతంబున కొడంబడితివేని, నాచేత వేయి యజ్ఞములు చేయించినట్లు, కనకాభిషేక మొనరించినట్లు. ఇట్టిసభలు పదికోట్లు కట్టించి నాకు నిప్పించిన నావంతసంతసంబు నాహృదయంబునఁ బుట్టదు. నీ వందున కీకొన్న నాకు జలవన్మరణంబును నీకు పుత్రశోకంబును తప్పదు.

**ధృత**—నాయనా! నేను విదురుని శాసనంబున నడుచువాఁడను. అతఁ డర్థానర్థవిదుండు. జూదంబున విగ్రహం బగునని యుఁ

బలవంతులతోడి విరోధము క్షేమంబు కాదనియు, కావున దానిఁ బరిహరించుట లగ్గగుననియు పలుమారు వచియించె. ధర్మోపేతంబయిన నావచనంబున ద్యూతదుర్వ్యవసాయము మాని పాండవులతో వైరంబు వీడి యనుతాపంబు నొందక సుఖంబందుము. అధర్మంబున శత్రువులం జయించుట యన్యాయంబు.

దుర్యో—తండ్రీ! యీవిషయము నీతో పలుమారు వచియించుట పరిహాసాస్పదము. పుత్రప్రేమ సహజముగా కలుగవలయును. కాని బలవంతముగాఁ బట్టి నెట్టిన కలుగునా? పుత్రుఁడు దాయలకన్న మిన్నఁగ నుండుట చూచుటకు ప్రాప్తియుండ వలదా? కన్నతండ్రి కట్టిప్రేమ నాయం దకారణముగాఁ గలుగకుండుటయు నా యపూర్వాదృష్టమే. అధర్మమంటివి గావున నిపుడే యొకమాట చెప్పి, ప్రాణము విడిచెద.

క. నముచియను దనుజుఁ డుగ్రత
పము సేయుచునున్నవాని । బలమథనుఁ డధ
ర్మమున వధియించె రిపుప
క్షము నెమ్మొయినైనఁ జెరుపఁ। గావలయు నిలన్

వైరుల రూపుమాపుట పౌరుషముగాని, ధర్మాధర్మవిచారణ యావశ్యకము కాదు. రాముఁ డానాఁడు వాలి నెంతన్యాయముగాఁ గొట్టినది వాల్మీకి వివరింప లేదా? తాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళు లనునట్లు కొడుకు చచ్చినను సరే యని దృఢచిత్తుఁడవైన నీకు విదురునియోజగాని, లోకములో నెవ్వరయిన—

క. తనకార్య మొరుమతంబున
నొనరింపఁగ నేరసగున । యొరునిమతంబు

ద్దనమతము నొకడుగా నో
పునె చెచ్చెర నిశ్చయింపఁ । బోలునె చెపుమా.

గీ. విదురుమతము పాండ । వేయ హితార్థంబు?
వానిబుద్ధి నెగడ । వలవదయ్య
పక్షపాతబుద్ధిఁ । బరగుచుండెడివాని
నాప్తుఁ డనఁగఁ దగునె । యవనినాథ!

నాయనా ! నా గృహాచారము నీ కాబుద్ధి పుట్టనీయదు గాని, గృహచ్ఛిద్రము లొరులకుఁ దెలియనీయఁ దగదని నీకుఁ దెలియదా ? ఎన్ను నడిగి గంతగట్టినట్లు నీకుమారుని యభివృద్ధికై, శత్రుపక్షమువారి యిష్టానుసారముగ నన్ను నడువవలసినదని నాకు బోధించి పితృవాక్య నిరాకరణ దోషము నాయం దారోపించుటకంటె, బలవంతులును, న్యాయశీలులును నగు పాండవేయుల కీమైశ్వర్యము సమర్పించి, వారల కూడిగ మొనరించుచు, నీచసేవకునిగా నుండ నియమించిన న్యాయముగా నుండును గదా. విదురుఁడు సంతసించును. నీ కనులు చల్లఁగా నుండును. ఆహా విధివిధానము !

గీ. దైవమున కేను పగవాఁడ । తండ్రి నిన్ను
దూరు టెంతయు దోసంబు । తొల్లి నేను
జేసికొనినట్టి కర్మమే । చేసె నిన్ను
దాయగాఁ గను నావాశ । తప్పి చనునె ?

నిక్కముగా జూదంబున కొడంబడెదనా లేదా ? చదువు సంధ్యలు లేనట్టి పరమశుంఠకు బోధించినట్లు నా కుపదేశించుచుంటివి గాని, సుహృద్ద్యూతంబున దేవన మాజ్యంబు వదయుదు రని రణరంగంబున క్షత్రియుఁడు వైరుల నోడించుటయు,

ద్యూతంబున నోడిచికొనుటయు సమానమనియు, ద్యూతంబున కాహూతుం డయిన భూనేత పరాఙ్ముఖుఁడైన పరాజితుఁ డట్టులనియు, నీతిశాస్త్రరహస్యజ్ఞులు నుడువుచున్నారు. కావున దీనిం బ్రవర్తింపఁజేయ శకునికి నుత్తరం బొసంగుము. కాదనకుము.

ప్రాతి—రాజచంద్రమా! పాండవసహితుం డయి విదురుండు భవద్దర్శనము కాంక్షించుచున్నాఁడు.

ధృత—అట్లయిన నిరాటంకముగా సభారంగము ప్రవేశింపఁజేయుము.

దుర్యో—(మాట్లాడకుండ, తండ్రిపాదములు పట్టుకొని నిమ్మళముగా జూద మాడించవలయు నని బ్రతిమాలవలయు.)

(అందఱు నిష్క్రమింతురు.)





# ద్రౌపదీవస్త్రాపహరణము.



## షష్ఠాంకము.

### ద్యూతసభ.

[ధృతరాష్ట్రుఁడు, గాంధారి, భీష్ముఁడు, ద్రోణుఁడు, కర్ణుఁడు, వికర్ణుఁడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని యుండవలయు. విదురుఁడు, ప్రాతిగామి, పాండవులు ముందుగా, వెనుకనుంచి ద్రౌపది గాంధారివైపుగాఁ బ్రవేశింపవలయు.]

విదు—రాజసార్వభౌమా! ధర్మజుండు సానుజుండై తండ్రిగారికి నమస్కరించుచున్నాఁడు. నీయాదరంబున కెంతో సంతసించుచు, నీపదసందర్శనమున కెదురు చూచుచున్నాఁడు.

ధృత—ఏడీ, మాపెద్దబ్బి? వచ్చినాఁడా? (అని చెయ్యి చాచి కౌఁగిలించుకొనవలయు.)

ధర్మ—తండ్రీ! భవత్ప్రియపుత్రుండు పాండవాగ్రజుండు ససోదరుండయి నమస్కరించుచున్నాఁడు. (అని ధృతరాష్ట్రునకు గాంధారికి నమస్కరించవలయును. తమ్ములు కూడ నమస్కరించవలయును.)

ధృత—చిరంజీవివై రాజశ్రేష్ఠుండ వగుము.

గాంధా—సుఖముగా వర్ధిల్లుము. నాయనా! కోడలు ద్రుపదాత్మజ యెక్కడ?

ద్రౌప—ఇదుగో పాదాభివందన మాచరింపుచున్నది.

గాంధా—అమ్మాయి! వచ్చినావు. నీయమ్మకడుపు చల్లగా. రా, భానుమతి నీరాకకై వేచియున్నది. అమ్మాయి! అత్రికా! కృష్ణను భానుమతీమందిరము చేర్చుము.

పాండవులు—(భీష్మునకు నమస్కరించవలయును.)

భీష్మ—ధర్మాభివృద్ధి యగుఁగాత. ధర్మనందనా! పండితులన పరేంగితాభిప్రాయము కలవారు. పరేంగితజ్ఞానము లేనివారు పామరు లనంబడుదురు. మఱియు నాయతులు గోరువారు. దాయల చిత్తవృత్తులు చారనేత్రంబునను, జ్ఞానలోచనంబునను చక్కఁగాఁ బరికించి మెలకువతో మెలఁగవలయు. మాయావిదులగువారును, పరమలుబ్ధులును, పరశ్రేయాసహనులగు దురాత్ముల దురాలోచనాజాలంబులఁ జిక్కక మేధావిప్రజ్ఞావిశేషంబున సంచరించవలయును.

ధర్మ—(ద్రోణునకు నమస్కరించవలయును.)

ద్రోణు—చిరకాలంబు వర్ధిల్లుము. విజయంబు గాంచుము.

ధర్మ—(దుర్యోధనుని కౌఁగిలించుకొని) సోదరా! శత్రుభయంబు లేకుండ రాజ్యం బనామయంబు గదా?

దుర్యో—ఆభయంబులే మమ్ముల బాధించుచున్నవి. సవిస్తరముగా వచియించెద. నాపీఠ మలంకరింపుడు.

ధర్మ—(కూర్చుండవలయును.) అంగరాజా! క్షేమమా?

కర్ణుఁడు—నామిత్రుని క్షేమమే నాక్షేమము. శత్రువులు పూర్తిగ నశించుదనుక క్షేమ మెక్కడిది?

శకుని—పాండునందనా! అపూర్వసభాప్రవేశసమయంబున, సభావైభవ సందర్శనార్థమై తండ్రిచే రావింపఁబడితివి. నిండుపేరోలగంబున నీసోదరపంచకమును జూచు వైభవము మాకు సంప్రాప్త మయినది.

ధృత—పాండవాగ్రజా! దుర్యోధనునిం గలిసి పరిషత్పరీక్షణ మాచరించి మయసభకును దీనికిని గల తారతమ్యము నీసోదరులతోఁ గలిసి నాకు వివరింపుము.

దుర్యో—సోదరా! తండ్రిగారు వేవురు శిల్పాచార్యుల రావించి, వారిచే నపూర్వమణిసభాభవనంబు నిర్మింపఁజేసిరి. అందలి శిల్పంబులు పరిశీలింపఁదగు.

భీము—ఇది మార్జాగిలంబుల విహారశాలవలెఁ గనుపట్టుచున్నది.

దుర్యో—(గుఱ్ఱురిమి చూచుచు) మఱియు నీ నూతనసభారంగంబున నీతోడ సుహృద్ద్యూతం బాడవలయు నని చిరకాలమునుండి నాకుఁ గోరిక కలదు. ఇప్పుడు సంభ్రమంబునఁ జేయఁదగిన పను లెవ్వియు లేకున్కిఁ బ్రొద్దు పోవకయున్నది. ద్యూతకళయం దీ వసమానుండ వని పలువురు పెక్కుమారు లనేక సభాస్థలంబులయందుఁ గొనియాడుచుండ వినియుంటిఁ గాని, తగినయదను దొరకకపోవుటచేత నామనోరథము నెఱవేఱక పోయినది. దైవయోగంబునఁ జేసి వృద్ధానుమతంబున సభావలోకనార్థ మరుదెంచితివి. ఇంచుకసేపు పాచికలు చేతఁ బట్టుము. ఒకటిరెండాట లాడి చాలింతము. కాదనక నాకోరిక నెఱవేర్పుము.

ధర్మ—సోదరా! దుర్యోధనా! నీకోరిక యొకటియు నాకోరిక యొకటియునా? కాని యీ వ్యవసాయ మేమియు బాగుగా నున్నదికాదు. నీతిబాహ్యము లగుకార్యంబు లుత్తమక్షత్రియు లాచరింపఁగూడదు. దానం దప్పక ముప్పుగప్పును. నిత్యధర్ములగు రాజులు, ద్యూతంబును నిశ్కృతియుపూర్తిగావిడునఁ దగినవి. మఱియు నీ రెంటియందును బాపావహమయినది ద్యూతఁబు. కుటిలమార్గప్రవర్తకులును, కుచ్ఛితులును, పర

ద్రోహమోసహానులును నగు కితవులతో నాడఁగూడదు. మోహంబుచే నట్టి కార్యంబునం బ్రవేశించినవార లఖిలధర్మవివర్జితులై దుష్టకార్యప్రవర్తకు లగుదురు. దానిచేఁ బ్రజలకును జేంష్ఠకును బరస్పరము స్పర్థ లేర్పడి వైషమ్యంబు ప్రబలి తుదకు దేశమున కరాచకస్థితి ప్రాప్తించును. మాయాద్యూతంబునఁ బరిపంథుల జయించుట మహాపాతకమనియు, ధర్మయుద్ధంబునను ధర్మద్యూతమునను వైరులసిరుల నొడిచికొనుట పుణ్యాంబనియుఁ దొల్లి యసితుండైన దేవలుండు వాక్రుచ్చె. ఇంతియెగాక పరులక్షేమంబు చూచి యోర్వలేక తాను సుఖంపను శక్తిలేక యొరుల-మోసగించి వారిసిరు లపహరింప నెంచువాఁడు తుద కనర్థంబుల పాలగును. అట్టివాఁ డెన్నఁడు విఖ్యాతి గాంచఁడు. వారితోడి పొత్తు యుత్తమక్షత్రియులకర్హంబు గాదు. అట్టియుద్యమంబు మానుట యుక్తము. దుర్వ్యవసాయంబులు హృదయంబున నిల్వఁగూడదు. భీష్మాదులధర్మోపన్యాసముననో కుమారుల శస్త్రాస్త్రప్రయోగవైచిత్ర్యములనో కాలయాపన మొనరింతము.

శకుని—సుయోధనుఁడు రాజనీతిశాస్త్రంబులు మూలమట్టముగాఁ జదివినవాఁడె. ఈయుపన్యాసమునందలితాత్పర్య మిా దుర్యోధనుఁకు గ్రహించనేరఁడని నీవనుకొనకుము. అట్లు తలఁచుట వెఱ్ఱితనము. నీతిజ్ఞుఁడును, లోకవృత్తము బాగుగా నెఱిఁగినవాఁడును, బుద్ధిమంతుఁడును, విద్యావిదుండును జూదము నిందించునా? బలహీనులయినవారు బలవంతుల జయించ వలసిన ననేకమాయోపాయములు పన్నుదురు. అది కాదనుటకు రా జన్నఁడా? అది మర్త్యులకు జయము కాదందురా? ధర్మనందనా! జూదమాడుటకు నీహృదయము జంకుచున్న

చో నోడితిననును. మానివేయుము. అంతకంటె నుత్తమము చేతకాదనుట. అంతియెకాని యధర్మమని, పాపమని, యనర్థంబని యసందర్భము లేల పలుకవలయు?

ధర్మ—ఓయి సౌబలేయ! బంధుధర్మం బవలంబించి యింతదనుక నుడివితిని. కాని కేవల శాస్త్రము ననుసరించికాదు. ఇంతమాత్రమునకే చేతగాదనవలయునా? జయాపజయంబులు దైవాధీనంబులు. దైవమా ధర్మాధీనంబు. మనుజుం డెప్పుడు సుఖమునే చెందుననిగాని సదా దుఃఖాభిభూతుం డగుననికాని యెవరు వచింపఁగలరు? దైవోపహతులగువారు పరులు చెప్పినను ప్రత్యక్షముగా ననుభవించుచున్నను తమపట్టును విడువరు. ద్వేషలతాలవాలమగు ద్యూతము కుటుంబ కలహాంకూరమై, భరతవంశమర్యాదలకు హానికరమగుననియు, వాదభేదములకిరవగుననియు పరిత్యజించుట ధర్మమంటిని గాని బలవంతముగాఁ బిలువంబడి మఱలుటలు ఆయోధనంబునఁ బరాజితుండ్లు దూరగుండగునని తెలియనివిషయముకాదు. పెద్దలచేఁ బరివేష్టింపఁబడిన పరిషన్మధ్యంబున సుహృద్ద్యూతంబని పిలువంబడుచు మాయోపాయంబున శత్రుల జయించుట యన్యాయం బనుచు నుపన్యాసంబు గావించుట నామనంబునకు వ్యత్యస్తంబుగాఁ గనుపట్టుచున్నది. కాఁబట్టి బంధుధర్మము పరిత్యజించి కేవల శాస్త్ర మనుసరించెదమన్న ఫలాఫలంబులు దైవాధీనంబులుగాఁ దలంచి మీకోర్కెఁ దీర్చెద. సౌబలియు, వివింశతి, వికర్ణుఁడు, చిత్రసేనాదు లందఱు పాచికలలంకరించుకొని యున్నారలు. వీరిలో నాడఁ బన్నిదముచరిచి జూదమాడు బలశాలి యెవండు?

దుర్యో—ధర్మనందనా! నీవు నిశ్చయముగ న్యాయవాదివి. బంధు

మనోరథపరిపూర్ణకుతూహల మానసుండవు. కస్తూరాగరు
చర్చితంబులయి యర్చితంబులగు పాచికలు చేతఁ బట్టుటకై
చిరకాలమునుండి నామనంబునఁ బెనంగు యాశాలత లాశా
సముదాయంబుల వ్యాపింపఁ గొనసాగింపఁజేయుటయే. అక్ష
కళాభిజ్ఞుండవగు నీతో సమానముగాఁ బాచి గాడ మా మా
మయగు శకుని సమర్థుండు. అతం డొడ్డిన యొడ్డిపణంబయి
నను నే నంగీకరించెద. నా మారుగ నీతో నాడంగల జెట్టి
యీతఁడే కాని వేఱొండ్లు లేరు. కాల మతిక్రమింపకుండ
నాట ప్రారంభించుము.

ధర్మ—అది యు కూడనిదియ. ఒకనికై యొకఁడు పాచిక లాడుట
ధర్మవిరుద్ధము కాదా? ఆటయందు ప్రవేశించినవాని మనంబు
చంద్రోదయంబున సముద్రమువలె నుప్పొంగి మిన్ను ముట్టు
చుండును. మఱియు గెల్చుటయందుఁ గల్గినసంతసోత్సాహము
లకంటె నోటున హృదయంబునం గలుగు చలంబు మిక్కుట
ము. అట్టిసమయంబున శరీరంబయినఁ బణం బిడవలసివచ్చు
ను. ఆతఁడి నొకనియాట క్రింద నొకఁడు పణం బిడుట, కస్వ
తంత్రము, యశాస్త్రీయము, యసంబద్ధము. విత్తస్వామి
యాడవలయును. స్వసాహసము ననుసరించి పణంబిడఁగవలయు.

గీ. తాను సాహసమూని యుద్ధంబు సలుప
పరులసాహాయ్యమును బూనవలయుఁ గాని
తాను రణమును దిగనాడి తనకుగాను
పరులప్రాణంబు దీయుట భావ్య మయ్యె?

రణంబునను పరులశస్త్రాస్త్రంబుల ధరించి యొరులరథం బధిష్ఠించి
గైకొన్న జయంబు సందిగ్ధం బగుడు. స్వయముగాఁ బాచికల
జేతఁ బట్టుము.

శకుని—ధర్మజా! నీ విట్లు పలుకుటం జూడ నెద్దియో సాకు పెట్టి యీయక్షక్రీడం జెడంగొట్టందలంచితి వని సభ్యులు గ్రహింపలేరా? అవినాభావసంబంధముగల మా యిరువురకును భేదము నీవు కల్పింపంబూనితివి. అత్యంతతాదాత్మ్యము లయిన మామనంబులు భిన్నాభిప్రాయంబుల నొందవు. శరీరములు రెండయినను మా మనంబుల నొక్కటిగాం దలంచుము. కాలయాపన మొనరించి రారాజు మనంబు విఫలమనోరథముగాం జేయకుము.

దుర్యో— గీ. అనఘ! మా మామ శకుని నాకయి కడంగి
జూదమాడెడి నీతోడి । కాదనాక
యీతం డొడ్డిన ధనరాసు । లెవ్వియైనం
దప్పకిత్తును గైకొను । ధర్మరాజ!

రాజ్యసర్వస్వ మొడ్డినను తప్పక యప్పుడే యొప్పించెదను. మీయిరువురియాటం జూడవలయుననియే నా కోరిక.

ధర్మ—అట్లయిన సాగరావర్తసంభవంబు లైన పరార్ఘ్యమణిహారంబులు పణంబుగా నిడుచున్నాండ. (అని పాచికలు వైచును.)

శకుని—గెలుపు నీయది. ఇదుగో, సువర్ణముద్రికాసంభరితభాండాగారంబులు మాపందియము.

ధర్మ—నిష్కసహస్రభరితానేకాయుతకుండమండితంబు లయిన సువర్ణభాండాగారములు, మాపణంబుగ నుంచుచున్నాము.

శకుని—(పాచికలువైచి) ధర్మరాజా! గెలుపుమాకు కలిగినది. పైపందె మెద్ది? (భీమార్జునులు విచారముతో శకునిం జూడవలయు.)

ధర్మరాజు—వజ్రవైడూర్య మరకత మౌక్తిక నీలప్రవాళాది విపుల విశుద్ధరత్న పరిపూర్ణంబులయిన రత్నభాండాగారములు, ప్రత్యేకంబ పంచద్రోణకాంచనసంచితంబు లయిన చతుశ్శత నిధులును పణంబుగా గ్రహింపవలయును.

శకుని—(పందెము వైచును.)

దుశ్శాసనుఁడు—(పందెము పరిశీలనముగాఁజూచి, సంతోషముతోఁ దల నూపవలయు.)

శకుని—గెలుపు మనకె.

ధర్మరాజు—మణికింకిణీజాలాలంకృతంబు లయిన యసంఖ్యాతజాతజాతరూప వరూధయూధంబు లయి, కనక కక్ష్యా కుథసనాథంబు లయిన మదాంధగంధసింధురసందోహంబులు సవ్యసాచికి చిత్రరథుం డొసంగిన పదునాల్గువేల గంధర్వహయంబులును పణం బిడుచుంటిని. పందెము వేయుము.

శకుని—పందెము నీవే వేయవలయు.

ధర్మ—(పందెము వైచి చూచి విచారముగా నుండవలయు.)

శకుని—దుర్యోధనసార్వభౌమా! నీదియే గెలుపు. ధర్మజా! మఱియు నేమియొడ్డెదవు? నీవు పందెము గెలుచుదనుక, మా సువర్ణభాండాగారములే పణంబులు. మేము పలుమరు వచింపనక్కఱ లేదు.

భీముఁడు—(రహస్యముగా నర్జునునితో) మాయచేయుచున్నాఁడు.

అర్జు—అన్నగారు భ్రమపడుచున్నారు. మనము మాటాడఁగూడదు.

ధర్మ—పరార్ఘ్యరత్నభూషితంబు లయిన యోషిత్సహస్రంబులును, అనుదినాతిథిభోజనపాత్రహస్తు లయిన శతసహస్రపరిచారకులును, దుగ్ధపాన శాలితండుల ఖాదనంబునం బెరుఁగుచున్న సజాత్యశ్వానేకాయుతంబులును, అజావి, గోమహిష, ఖర, రాసభ నివహంబులును, క్రమంబుగాఁ బందెంబుగాఁగొనుము.

శకుని—(పందెము వైచి) యోషిత్సహస్రంబుల నోడిచికొంటిని. ఈ పందెము నీవే వేయుము.

ధర్మ—(పందెము వైచును. విచారముగా నుండవలయును.)

శకుని—కురుకులసార్వభౌమ ! శతసహస్రపరిచారకులు నీయధీన మయిరి. పాండవాగ్రజా ! యీపందెము నేను వేయవలయు ను. (అని పందెమువైచి) కురుకులకమలినీరమణ! సజాత్యశ్వా నేకాయుతంబులును, గోమహిషఖరరాసభాదిపశుగణంబులెల్ల నీయధీనంబు లయినవి. యుధిష్ఠిరా ! యింకఁ బైపందెము స్పష్టముగాఁ జెప్పుము.

భీము—(శకునిని తీవ్రముగాఁ జూచును. అర్జునునితో "మితిమీఱి పోవుచున్నది." అనవలయును.)

ధర్మ—ఖాండవదహనవేళాసంరక్షణ సంతోషితస్వాంతమయ దత్తం బయి, సకలదిక్పాల సభాతిరస్కార యనల్ప, శిల్పి, కల్ప నాకల్పితం బయి, విరోధి భూరమణమనోనయనాగ్ని దాహ కామూల్యరత్నచిత్రభానుప్రభాసహస్రమండితం బయి, మ ర్త్యలోకనవీనాలంకార మగు మయసభాభవనంబును పణం బుగా నంగీకరించుచున్నాఁడ.

దుర్యో—మామా! యీపందెము నీవే వేయవలయు.

శకుని—రాజరాజ ! పరాక్రమార్జితశత్రువిజయాలంకార ! ధీమన్మ పుణ్యానిస్సపత్నీకృతరాజన్యచూడామణీ ! పాండవాగ్రజుండు న్యాయవాది. అన్యథా తలంపకుము. కౌంతేయాగ్రజా ! వం తు నీయది. జయాపజయంబులు దైవాధీనంబులని ప్రథమం బున నుడివినమాటలు మనంబున నిడుకొని సత్యప్రతిజ్ఞకు భంగము తెచ్చుకొనక యింతకు మున్నోడిన పందెముల జప్తినుంచుకొనక పందెము వేయుము. సభాప్రభావమున నీవే గెలిచెదవేమొ ?

ధర్మ—మామా ! మాయాపుల కుహనావాక్పుణ్యము శిథిలీ కృతసకలసన్మార్గప్రచార మని యెఱుంగుము. పరాత్మం

డగు పరమేశ్వరుండు సత్యసంవర్ధనుండు కాకమానఁడు. అన్యాయాగతద్రవ్యము సమూలనాశకం బను భయంబు పూర్తిగ విడిచినవాఁడను కాను. వ్యర్థముగా వాగాడంబరప్రదర్శన మేల ? ఇదిగో పందెము వేయుచున్నాను. (అని పందెము వేయవలయును.)

శకు—ధార్తరాష్ట్రాగ్రజా ! పందెము మనదే. మయసభాభవనము భవత్కరగతం బయినది. (కౌరవులందఱు కేకలు వేయుదురు.)

వికు—కురువంశజలధిచంద్రమా! యాంబికేయ ! నీకుమారు లన్యాయాగతధనమదంబు పెంపున మైమఱచి చేయుదుష్కార్యములు, నీమనోనేత్రంబునఁ జూడవలయు. మహాభిష, భీమసేన శంతనులనాఁటినుండియు, నెన్నఁడును పాపంబు నొరయని కౌరవవంశము నేఁడీదుర్యోధనుని కారణంబునఁ బాపభూయిష్ఠం బగుచుండ నీవు చూచి చూడనియట్లుపేక్షించుట న్యాయంబు కాదు. ఒక్కనికారణంబునఁ గులంబున కెగ్గగు నేని వానిని దూషించి కొలంబు రక్షించుకొనుట ధర్మంబని తొల్లి శుక్రుండు సెప్పె. మొన్నమొన్న యాదవవృష్ణివీరులు వంశరక్షణంబు గావించుకొనుటకు జగన్నాటకసూత్రధారియగు శ్రీనారాయణావతారం బగుకృష్ణుని నియోగించి, కులదూషకుండయిన కంసునివధించుట వినలేదా? మఱియు నసూయామయగ్రస్తుండగు సుయోధనుం డీయిలాతంబున జన్మించినతోడనే పతాకంబుల గద్దలు వ్రాలి రెట్టలువైచె; పిడుగులుపడియె; నక్కలు చెలరేగి కూయఁజొచ్చె; హోమగుండంబులు చల్లారె; సూర్యుం డకాలంబునఁ బరివేషగతుండయ్యె; ఉత్తమాశ్వంబులు కనుల నీరుగార్చె; ప్రజల మనంబులు భీతిల్లెఁ; గావున వీనిం బరిహరించుట కర్త

వ్యము. దీన నీకుఁ బాపము రాదు. శ్లో॥ త్యజేత్కు-
లార్థే। పురుష గ్రామస్యార్థే కులంత్యజేత్। గ్రామం జనపద
స్యార్థే హ్యాత్మార్థే పృథివీంత్యజేత్॥ అనఁగ నొక్కకులంబు
రక్షించుకొనుట కొక్క పురుషుని, నొక్క గ్రామమును గాపా
డుకొనుటకు నొక్కకులమును, నొక్కదేశంబు కాపాడుకొ
నుట కొక్కగ్రామంబును, తనయాత్మను సంరక్షించుటకొక్క
దేశమే కాక సమస్తైలాతలంబు విడువవచ్చునని పెద్దలు నుడు
వుచుందురు. కావున నీకురుకులాపశదుని, యీగుణహీనుని,
యీపరమలుబ్ధుని, యీనీచుని, బహిష్కృతునిఁ జేసి, ధర్మ
మార్గమునఁ గౌరవాన్వయముఁ గాపాడఁదలఁచితివేని, శౌర్య
శాలియు, మహాబలశాలియు, ధర్మమార్గనిరుండయిన పార్థున
కో భీమునకో మొదల నొసంగిన, నీశాసనంబున విచారవిదూ
రులయి సుయోధనునిం గడ తేర్పఁగలరు. దాన నోభూరమణా!
నీవును, నీప్రజయు, నీకొలంబును, నీభూమియు, నిస్త్రాసంబున
నుండఁగలరు. ప్రజ్ఞాచక్షూ !

సీ. పిల్లలఁ దెచ్చి పెంచి తగు । విద్యయు బుద్ధియుఁ జెప్పి వారుసం
ఫుల్లయశోవిశాలులయి । మోదము నొందెడునట్టివేళ నీ
కల్లరిగానిమాటలకు । గా నిటు మోసముఁ జేసి వారి సం
పల్లయ మాచరింపఁ దగు । మార్గము కీర్తియ? నీతియా గనన్.

కావునఁ ద్రిలోకవిజయజేగీయమానపరాక్రమోపేతులయి, ధర్మ
గోప్తృశరీరరక్షకులయి, అరిజనహృదయశూలాయమానగురు
జనశిక్షితాస్త్రశస్త్రధాములయి, ధర్మదేవత లనందగుపాండవుల
తో దురాచారపరాయణుండు, దుర్వ్యసనాసక్తుండు, దుర
భిమానియు, దుష్టోపాయలంపటుం డగు దుర్యోధనుని మన్ని

వృద్ధికై, విరోధంబు మాని, కౌరవాన్వయగౌరవము కాపాడఁ
దలఁచితివేని, దుర్యోధనఫేరవం బొసంగి పాండవసింహంబులఁ
జేరఁదీయుము. దుఃఖఫలభాజనం బగు దుర్యోధనబలిభుక్కు-
నొసంగి పాండవహంసంబులఁ బిలుచుకొమ్ము. దురభిమాన
కళంకంబును, పరమలుబ్ధగుణకంటకితంబు నగు సుయోధన
శర్కరిలంబు పారవైచి, సౌజన్యవిత్తంబునఁ బాండవపంచ
రత్నంబులఁ గైకొనుము. అయ్యా, అంబికేయా! కడుప్రియాం
సంబునఁ గన్నబిడ్డలకన్న మిన్నగాఁ బోషించిన వృక్షంబులు
పూచి, కాచి, ఫలించుటకు సిద్ధమైయున్నతఱి నావృక్షంబుల
బొగ్గులకై గొడ్డంటనరుకనెంచు దయాశూన్యుండగు నంగార
కారుం బోలి యోమహాప్రభూ! తండ్రిలేని నిసువుల నిట్టిడు
ములఁ బడఁజేయుట కడుంగడు శోచనీయము హానికరము
సుమా. ఓదుర్యోధనసార్వభౌమా! పరాకు మాని, నాప
లుకుల కించుక చెవియొగ్గుము. న్యాయమార్గంబు పరిత్యజించి,
సౌబలుని మాయాద్యూతకుహనోపాయంబునఁ బాపమతివై,
భరతామ్నాయలలాములగు పాండవులతో విరోధంబుఁ బెం
చుకొని వారిసిరు లొడిచికొనిన, పలువురకు నిందాస్పదుండ
వయ్యెదవుసుమా! పాండవులు ధృతిమంతులు, మతిమంతులు,
శీలవంతులు, పరాక్రమవంతులు, న్యాయవంతులు, పరాక్ర
మోపార్జితతేజోవంతులు, మహాశాంతులు. వారి నేల కోపవం
తులఁ జేసెదవు? వారల కపకృతి నొనర్చుట నీకు లగ్గుకాదు
సుమా! అన్యాయాగతద్రవ్యంబు సమూలవినాశనం బొనరించు
నని తలఁపవలయు. కావున నా నుడు వాలించి, పాండవేయుల
తోడ విగ్రహంబు దక్కుము. నీకుగల సహాయైశ్వర్యముకన్నఁ
బాండవుల సిరి యెక్కువయా? మహారాజా! చిరకాలసము

పార్జితకురుకులకీర్తిలతల కేల వినాశముఁ గల్పించెదవు ? ఈ దుర్వ్యవసాయము మాని సుఖంబుండుము.

దుర్యో—ఓయి క్షత్తా! నీవేల నిరంకుశంబుగ, నిర్భీతిగ, రాజలక్ష్యంబు వీడి ప్రసంగించెదవు. నీ కీధర్మోపన్యాసము లొసంగుమని యెవ్వ రాజ్ఞనొసంగిరి. నీ వింతప్పటినుండియు పరులగుణంబులు గోరంతలు కొండంతలుగా వర్ణించుచు వారి యవగుణంబులైన స్వర్ణాంబులుగా గణించుచు, లోకంబులకెల్ల, వారలే ధర్మవేత్తలనియుఁ, బాండవులే సుగుణవంతులనియు, కౌంతేయులే వీరులనియు, యుధిష్ఠిరాదులే న్యాయవేత్త లనియు భగవన్నామము స్మరించినటుల శేయుంబవళ్ళనుక్షణంబు వారినే తలఁచుచు, వారినే పొగడినఁ బొగడుకొమ్ము. మమ్మెల దూషించెదవు. మాశత్రువ్రల విజయంబుఁ గోరుచునున్న నిన్ను మాయింట నునిచికొనుట పాముపిల్లను యొడిలో నుంచుకొనుట కాదా ?

గీ. పిల్లఁ బెంచిన యజమాని ॥ పిండములను
గోరినట్టుల మాయింటఁ ॥ గుడిచి నీవు
శత్రువిజయంబు మాకు న॥సౌఖ్య మెపుడు
గోరుచుందువు దుర్మతీ ॥ కుటిలమతిని.

శత్రుసంపద సంప్రాప్తాయంబున నొడిచికొనుట యన్యాయమని నీతివేత్తవు గదా యేమొగము పెట్టికొని చెప్పవచ్చితివి ? మా క్షేమమును కోరక పరశ్రేయోభిలాషి వగు నిన్ను మాయింట నుంచఁదగదు. వృద్ధరాజున కూడిగంబు సల్పుచుందువను ప్రేమచేఁ జూచిచూడనియట్లుపేక్షించినకొలంది మా హితమును గోరువానివలె నటించుచు సమయము వచ్చినపుడు మాపై కొండెము లావృద్ధరాజుతో నూరిపోయుచు మమ్ము

దుంరుట న్యాయంబుకాదు. ఇంక నీవెడఁగునుడువులు కట్టి పెట్టి వృద్ధరాజు పాదము లొత్తుచు వామొత్తక యొకమూల పడియుండుము.

విదు—ఓయి దుర్యోధనా! యుక్తాయుక్తవిచారణ మూరయక నీవంటివానికి బుద్ధిచెప్పవచ్చిన నాయవివేకంబునకుఁ దగిన బుద్ధి చెప్పితివి. పైత్యరోగముగలవాని నోటికిఁ బంచదార చేదయినటుల, రోగార్తునకు భిషగ్వరుండు నుడివిన పథ్యంబు చికాకొనరించినటుల, దురోదరమధుమత్తాగ్రాని నీకు నాపలుకులసహ్యంబయి తోఁచుట యచ్చెరువు కాదు కాని, ప్రప్రథమంబున కఠినమై తోఁచినను పిదప మేలుచేయువాక్యంబులు పలుకుహితుండు దొరకుట కష్టంబుసుమా! నీ యుప్పుపులుసు దిని నీవలన జీవించు మాకు నీకు హితోపదేశంబుసేయుటకంటె నొండు పరమార్థము కలదా? ఇచ్ఛకంబునకై మెఱమెచ్చుతచ్చన లుచ్చరించు తచ్చనగాండ్రు ప్రభువుల మెచ్చువడయుటకై పిదప ననర్థదాయకములైనను యప్పటికిమాత్రము రుచించుపలుకులు పలుకువారు పెక్కు రుందురు. వినుటకుఁ గష్టంబుగనున్నను తానికడ మోమోడక హితోపదేశముసేయుట పరమధర్మము. అట్టివాక్యంబుల నాదరించనిఁతేడు కుచ్చితుం డనఁబరఁగు.

గీ. ప్రియము పలికెడువారిన ౹ పెద్దమెత్తు
రప్రియంబును పథ్యంబు ౹ నైనపలుకు
వినఁగనొల్లరు రాజులు ౹ వేడ్కదానిఁ
బలుక రెవ్వరు నుత్తమ౹ ప్రతిభులయ్యు.

కావున నేను సపుత్రకుండైన ధృతరాష్ట్రునకు హితుండనై నెగడుదుఁ గాన నిట్లు పలుకవలసె. నీవన్యథాబుద్ధివై విననొల్లక యి

ట్లుపలికితివి. నీ వెట్లన్నను పాండవులతోడి విగ్రహముమాత్ర
ము నీకు క్షేమముకాదు. దుర్మార్గుల దురాలోచనవాగురా
బద్ధుండవు గాక దూరాలోచనచే బ్రతుక నెంచుము.

శకు—ధర్మాత్మజా! సకలధనంబుల నోడితివి. పందెమునకు మొల్ల
ము సూపుము. లేనిచో నాట సాగదు. ఆట చాలించెద
వా? జితోస్మి యనుము. భూనాథుండవగు నీ వట్లనుట కంగీక
రించెదవా? దైవముమీఁద భార మిడుము. పాచికలు నీకభి
ముఖముగా నున్నవి. చూడుము. ఈపందెము నీకు గెలుపు
నిచ్చును. అనుమానించుట, మూతిముడుచుట, దిగులొందు
ట యాటకానికి లక్షణములు కావు. ధైర్యసాహసము లుండవ
లయు. ఏమనియెదవు?

ధర్మ—సౌబలేయా! వృథావాగ్వ్యయ మేల? ఈప్రోత్సాహము
లెందుకు దేవభోగ బ్రాహ్మణవృత్తులు దక్క సకలరాజ్య
సర్వస్వమును నీపణంబున నోడ్డితి. పాచికలం బట్టుము. (అని
పందెము వైచును.)

శకు—రాజా! కాను పొరపాటు. యుధిష్ఠిరా! భవదీయరాజ్యాం
గళదేవత దుర్యోధనసార్వభౌము నలంకరించినది. వైపందెము
చెప్పుము.

భీము—(శకునినిఁ గొట్టఁబోవవలయును.)

అర్జు—(భీమునిపట్టుకొని యాపవలయు.)

ధర్మ—సౌబలేయా! నీతిశాస్త్రవిశారదుండు, హయారోహణపాండి
త్యశౌండుండు, బుధజనవిధేయుండు, సమస్తజనమానసోల్లాసి,
అత్యంతమ్మనుమానసుండు, సుకుమారి, మరియు,

ఉ. కుంతికిముద్దులాఁడు నయకోవిదుఁ డార్యకథానుయాయి య
త్యంతమనోహరాంగుఁడు జయాస్పదుఁ డాహవదోహలుండు సా

మంతుఁడు జ్ఞాత పూర్వబుధమండలలక్షణలక్షితుండు ధీ
మంతుని నే పణంబిడెద మాన్యుని నాసహదేవుతమ్మునిన్.
మదాజ్ఞావర్తియగు నాకొండికసోదరుండు పణం బగుఁగాత.
శకు—(పందెము వైచును) పందెము మాది. మాదే.
భీము—(స్వగతము) దైవమా! గ్రహచారము.
ధర్మ—
ఉ. చక్కనిమేనివాఁడు గుణసంపద నిందునిఁ బోలినాఁడు పెం
పెక్కుడు ధీవిశారదుఁ డహీనమహీధరధైర్యశాలి యా
జక్కులఱేని మిత్రునకు సాటి యనందగు శౌర్యశాలి నా
మక్కువసోదరున్నకులు మాంధనాఖ్యుని పందెమొడ్డెదన్.
వైరివీరగర్వాంధకారతమోభాస్కరుండును, మాద్రేయాగ్రజుండును,
విశేషించి నాకు భక్తుండును నగు నకులుని పణంబుగా నిచ్చు
చున్నాను.
శకు—అల్లుఁడా! పాచికలను నీవే నారెంటోనుంచి త్రిప్పివేయుము.
ధర్మ—(పందెమువైచి విసుగుతోఁ బారవేయును.)
శకు—ఈపందెము కురుకులసార్వభౌమునిదే. ధర్మరాజా! వైపం
దెము చూపుము. ఆలసించిన రక్త చెడిపోవును.
ధర్మ—నీలములై, యరాళములై, మనోజ్ఞములైన ముంగురుల యొ
ప్పిదముగల్గి, ఆయతములై, సోగలై, లక్ష్మీనివాసములైన
నేత్రముల సిరులు వెదఁజిమ్మ మోమును, ఆజానులంబులైవిజ
యరేఖాంకితములై ధనుర్గుణసంఘర్షణపరిత్రుట్య మానవ్రణకి
ణాంకితములైన బాహువులు గలిగి నీలమేఘచ్ఛాయగేరు
శరీరంబుతోడ భాసిల్లుచు త్రియస్త్రింశత్కోటి దేవతాపరివృ
తుండయిన బిడౌజుని భండనంబున నిలువరించిన జయశాలిని,
సవ్యసాచిని, పాండవమధ్యముని, మఱియు,

సీ. అంగారపర్ణుతో । నాహవం బొనరించి
జయమును గైకొన్న । శౌర్యశాలి
ఖాండవం బగ్గిచేఁ । గాల్పఁజేయుచు దేవ
రాజుతోఁ పోరు ప।రాక్రముండు
రాకుమారుల నెల్ల । రణరంగమున గెల్చి
ద్రుపదిఁ గైకొన్న । ధైర్యశాలి
జొత్తరాహులతోడ । నాయోధనము సల్పి
జన్నంపు కప్పము । గొన్నవాఁడు
పరమ కోదండ పాండిత్య।పాటవుండు
ద్రోణశిష్యాగ్రియాయియై । తోఁచువాఁడు
నందనందన బావమ।ఱంది యిపుడు
పందెమూఁగాత మధ్యమ।పాండవుండు.

శకు—రాజా! పొరపాటున నంటిని. అట్లు పిలిచెడు యోగము పోయినది గదా. ధర్మాత్మజా! తొందర నొందక, ధైర్య మవలంబించి పాచికల సవరించుకొని యీపందెము నీవే వేయుము.

ధర—(పందెము వేసి పలక పార వేయును.)

భీము—(నుదిటిపై కొట్టుకొనుచున్నాఁడు.)

శకు—స్వాధీనకృత వైరిలక్ష్మీవిలాస! కురుసార్వభౌమా! మధ్యమ పాండవుం డోడుచుకొనఁబడియె. పాండవాగ్రజా! ఆట చాలించెదవా! పాపము ద్రవ్యము కోలుపోయితివి. మూఁడు రుసోదరులు మాస్వాధీన మయిరి. ఒకయుపాయము చెప్పెద. అట్లుచేసిన నీవు గెలిచెదవేమొ? పాప మీదినమున నీచేత నాటపడలేదు. నీవోడిన మూవురుసోదరులును, వాయునందనుఁ డొకయుద్ది. నీవు గెలిచిన సోదరత్రితయము బంధనిర్ము

క్తులు గాఁగలరు. ఒకటిరెండు పందెములతో నాట పూర్తి కాఁగలదు. సంకోచింపకుము.

ధర్మ—పలుమారు నీ కీశ్రమ యెందుకు ?

శకు—అల్లుఁడా! కోపపడకు. సమయమిది. సమాధానముల కేమిలే. పందెముసంగతి ముందుచెప్పుము.

భీమ ——(గదతో శకునిని నెత్తిమీఁద కొట్టఁబోవుచున్నాఁడు.)

అర్జు—(రహస్యముగా బట్టి యాపుచున్నాఁడు.)

ధర్మ—బకకిమ్మీరహిడింబనిషూదనుండును, మాగధగర్వపర్వతవజ్రాయుధుండును, శఖారీపరిమితాయసగదాదండమండిత బాహుదండుండును, మఱియు తీవ్రకోపియు,

చ. పసితనమాది మీ రెవని । బాహుబలంబున కోడి యీర్ష్యచేఁ
గసి మదిఁ బెంచి చంపుటకుఁ । గా మది యుక్తులువన్ని వ్యర్థులై
విసిగిరొ యేనిపెద్దదకు । భీతిలి వైరులు తల్లడింతు రా
యసదృశు,భీముఁ,బందెము జ।యాస్పదు మామకభక్తుని య్యెడన్.

దుశ్శా—మామా ! పందెమువంతు నీయది.

శకు—ఆడువారు దప్ప మిగులువారు మాటలాడఁగూడదు. అబ్బాయి ! యొక్క పందెము గాదు. ఇంక రెండుపందెములు నావి. నకులార్జునుల పందెములు మన పెద్దన్నయ్యగారే వేసినారు. కౌంతేయా ! నీయిష్టము సుమా! ధర్మము సెప్పుము. స్వల్పంబునకై యన్నత మాడుదువా? ఒకవేళ నిప్పటి లేమిడి పురికొల్పునేమో యని జ్ఞాపకము సేయుచున్నాఁను.

భీమ—(లేచి యేదియో చెప్పఁబోవుచున్నాఁడు.)

అర్జు—(బలవంతముగాఁ బట్టిలాగి కూర్చుండఁబెట్టుచున్నాడు)

ధర్మ—సౌబలేయా ! కాలము బండిచక్రమువలె ననుక్షణము దిరుగుచుండఁ గ్రిందు మీఁదును, మీఁదు క్రిందను గాకమానదు.

అంతమాత్రమునకై హాస్యవచనంబు లుత్తమవంశోద్భవు లుచ్చరించరు సుమా! పందెము నీవే వేయుము.

శకు—(పందెము వైచును.) జయము. జయము. దుర్యోధనసార్వభౌమునకే జయము. పాండుజ్యేష్ఠపుత్రా! యిఁక నీపందెము చెప్పుము.

ధర్మ—ధర్మమే సకలజగంబులకు మూలకారణమని తలంచుచు సత్యనిష్ఠుఁగాను రాజనీతియనియు, సర్వసంపన్మనః ప్రాణధనంబులు సకలరాజ్యంబును సోదరచతుష్టయంబును మాయామరోదరంబున నోడిన యీయుధిష్ఠిరుండే పందె మగుచున్నాఁడు.

దుర్యో—మామా! పాచికలఁ జక్కఁగాఁ దుడువుము. ఒక్కసారి కన్నుల నద్దుకొనుము. జాగరూకతతోఁ బందెము వేయుము. ధైర్యము చిక్కఁబట్టుము. ఉత్సాహవంతుఁడ వగుము. పాచికల కనువగుకాలము చూడుము.

శకు—అబ్బాయి! సందేహింపకుము. పందెము వేయుచున్నాను. (అని పందెము వైచును) గెలుపు మనదె. మనదే గెలుపు. (అని చప్పటులు గొట్టుచున్నాఁడు) యుధిష్ఠిరా! పైపందెము చెప్పుము. అంతయు సరిపోయినదా? ఇఁక నొక్క పందెము వేయుము. ఏమి యోచించెదవు? మొల్లము కానరాలేదా? పూరిపుల్ల యయిన కానరాలేదా? యోచించుకొనుము. పారఁజూడుము. తల తడివి చూచుకొనుము. బుద్ధి వంచి యాలోచించుము.

ధర్మ—సుబలనందనా! నిష్కారణముగ నొకనిమనసు నొప్పింప నీకగు లాభమేమి? క్షత్రియజాతికిఁ గల సహజగాంభీర్యము విడిచి నీచజనసామాన్యమగు వ్యర్థప్రలాపఁబులఁ బ్రయోజన

మేమి ? పితృవియోగము విధినియోగ మలంఘ్యమని యెంచి యధర్మమైన నీకితవద్యూతంబున కోడంబడి రాజ్యసర్వస్వమును, సోదరులును, స్వశరీరమును గోలుపోయిన నన్నేల వ్యర్థపరిభావవాక్యముల నొప్పించెదవు? కట్టుబట్టలతో శరీరము లొడ్డిన మాకడ వేరుధనంబుఁ గలిగిన, నీవు చెప్పుదనుక పందె ముపేక్షింతునా ? ధనవిహీనుని, యస్వాస్థ్యచిత్తుని నకారణంబుగ నిందించుట మహాపాతకమండ్రు. ప్రాణములే ధనములుగాఁ గలిగి, ద్యూతనిర్జితుఁడనైన నామానస మేల నొప్పించెదవు ?

శకు—నీకు స్వాతంత్ర్యముగల ద్రవ్యమే లేదా ? నీసత్యవ్రతమును స్వల్పమునకై వదలుకొన నెంచుచున్నావు. పాపము నీ వేమిచేయుదువు. నిన్నుఁబట్టిన దరిద్రదేవత యిట్టిబుద్ధులు పుట్టించును. అనృతంబునకు లోఁబడిన నీతలపై కెక్కనున్న సామ్రాజ్యము కలదా ? చిరకాలార్జితమగు సత్యనిష్ఠను వీడ నెంచకుము. జ్ఞాపకము చేసికొనుము.

ధర్మ—సుబలభూపాలతనూజ ! అకారణంబుగ నిష్ఠురవాక్యము లేల బల్కెదవు. ఉరిసిన పుంటిపైని నిప్పుపెట్టినట్లుల నిర్జితులమైన మమ్ముల మర్మభేదనంబులగు చతురవాక్కులచేత నేలనొప్పించెదవు ? ఈ యుధిష్ఠిరుండు ధర్మమునకై ప్రాణము తృణప్రాయముగ నెంచి విడుచును గాని అనృతంబుపలుకఁడు. బుద్ధిబలముచేత నా మనోనేత్రమునకు గోచరమగు ద్రవ్యమంతయు నొడ్డినాను. పొరపాటున విడనాడిన జ్ఞాపకము చేయరాదా ? దాని కీనిష్ఠురభాషణ మేల ?

శకు—నిజమాడిన నిష్ఠురము కాదా ? నీకు ధనము కలిగియుండియు లేదని నిన్ను నొడ్డుకొని యనృతమాడుట మంచిదియె. అనృతమునకు లోనై, తెలియనివానివలె నటించిన నీకుని

యూరక విడిచిపుచ్చువాఁడని తలంచితివా ? నిజముగా నీకు జ్ఞాపకమురాలేదా ? పాపము ! నీవు మంచివాఁడవే కాని నీకు ప్రాప్తించిన దరిద్రదశ జ్ఞాపకము రానియ్యదు. దీనుఁడవై పలుమారు మరచితివని నీవు వేఁడుటలుచూడ, నామనము కరఁగి నీరై పోవుచున్నది. జ్ఞప్తికిఁదెత్తునా ? రాజరాజగు దుర్యోధనసార్వభౌమునిఁ జూచి దాసీజనంబులతోడఁ గూడి చప్పటులుగొట్టిన రాణిగారు, మాయవేషమున రాజులనెత్తిగొట్టి తెచ్చి యయిదుగురు పంచుకొని యనుభవించుచున్న మహాయిల్లాలు, తనరాణివాసమునకై విఱ్ఱవీఁగు వీరడి, తండ్రికిఁ బరాభవమొనరించినవానిని భర్తగాఁ గైకొనిన బుద్ధిశాలి, ద్రౌపదియుండ లేదా ? ఆమె నీధనంబు గాదా ? దేవేరిగారిని బందెమొడ్డి నీవుగెలిచిన సోదరచతుష్టయసహితంబుగ బంధనిర్ముక్తుండవు కాఁగలవు.

భీము—(గుద్దులుగిరిమి శకునిం జంపఁబోవుచున్నాఁడు.)

అర్జు—(బలవంతముగా లాగి కూర్చుండఁబెట్టుచున్నాఁడు.)

ధర్మ—గాంధారీసహోదర ! యీస్వల్పవిషయమునకా యింతరాద్ధాంతము. మనుజుఁడన భ్రమప్రమాదవిప్రలిప్సాలస్యాదులతోఁ గూడియుండునుగదా ? ప్రమాదమున విడిచిన నాస్వామ్యమును జ్ఞప్తికిఁ దెచ్చుటకై యిన్ని నిష్ఠురములు కావలయునా ? ఇదో పణం బొసఁగుచున్నాను. కనియుము.

ఉ. పాండవరాజ్యలక్ష్మి మహితప్రభాసముద్భవధీరమత్తవే
దండసమానయాన పతిధర్మపరాయణ వీరపత్ని ధీ
శౌండిని, సోమిదేవి, గుణశాలిని, ధర్మవిధానబద్ధ నా
పండితురాలి ద్రౌపదిని బందెము వెట్టెద మత్సతీమణిన్.

అయోనిజయై ఆర్తత్రాణపారీణు శ్రీకృష్ణునకనుంగుచెల్లెలై మానసం రక్షణాభిమానయగు పాంచాలి ననన్యస్వామిండనై పణంబిడు చున్నాఁడ! (అని పందెము వైచును.)

శకు—(పందెముచూచి) కురుకులసార్వభౌమా! దుర్యోధనచక్రవర్తీ! పాండవపంచకపట్టమహిషి, కౌంతేయరాజ్యలక్ష్మి నీకరగతం బయినది. నాప్రతిన చెల్లించుకొంటిని. ఇంక నీయభిమతం బు నెఱవేర్చుకొనుము. శుభముహూర్తంబున మయసభాప్రవేశము సేయుము. ధర్మనందనా! జూదమునందలి వేడ్క తీరినదియా? విజయలక్ష్మి మనలనే వరించుననుగర్వము పనికిరాదు సుమా! కాని నీయట్టివానితో నాడినదే యాట. మంచియాట గాఁడవే! ఈదినమున పాచికలమహాత్మ్యమదియ. చిరకాలము నకు నావేడ్క తీరినది. అబ్బాయి! పాండవులునీకుదాసులయిరి.

దుర్యో—ఓయి పండితంమన్య! విదురా! సలక్షణంబుగ సిగపయిపువ్వు వాడకుండ, నొకనిశరీరమున కాయాసము సంభవింపకుండ పాండవరాజ్యలక్ష్మి కరగతంబయినది. ఇట్టి మావిజయంబు నీవు సహింపలేవు. మాకేమో విపత్తులు చుట్టుకొనుననియును, ద్యూతము పనికిరాదనియును నీతిశాస్త్రములు పలుమారు వర్ణించినవారికిఁ దలవంపులుగఁ బాండవులు మాకు దాసులైరి. కాఁబట్టి సేవకురాండ్రఁగలిసి సభాభవన మూడ్చుఁదగు పాండవపట్టమహిషిని, ద్రౌపదిని శీఘ్రంబుగ సభాస్థలికిఁ దోడ్కొనిరమ్ము. ఆలసింపకుము. దుఃఖమందకుము. దయ చేయుఁడు. క్రొత్తచీపురుతోఁ దమవెంట సేవకుని పంపుచు న్నాను. నూతనసమ్మార్జనీపాణిగ్రహణమహోత్సవము ద్రౌపది ప్రప్రథమమున నంతఃపురాంగనాసమక్షమునఁ దమయాజ్ఞమీఁద ననుభవించి సభాస్థలికి రాఁగలదు.

విదు—(ఇంచుక తీక్ష్ణముగా) ఓయి క్షత్రియకులకలంకా! నీవంటి యజ్ఞానులు లోకంబులఁ గలరా? మూర్ఖుండవై యుక్తాయుక్త విచారణ మారయక, పెద్దపిన్నల గుర్తెఱుంగలేక, మత్తగజంబువలె మిన్నుమన్నుఁగానక, పెద్దలుండిరను భయములేక నోటికివచ్చినట్లు పలుకుచుంటివి. అరుంతుదునకు, నృశంసునకు, మదమలినమనస్కునకు, కుచ్ఛితమార్గానువర్తికి సంపదలు కరగతంబయ్యును, తొల్లింటిసిరులతోఁగూడ నాశనం బొనరించును గాని యనుభవించుటకు రావు. అన్యాయాగతమైన పాండవలక్ష్మి నీకుఁ దక్కనదనుకొనకుము. చిలుమువలె గోండ్రించి మునుపటి నీయైశ్వర్యమునుగూడ వెడలఁగక్కించునని దలంచుము. నీకీఫలంబు దక్కుట వెదురుచెట్టునకు ఫలంబు గలిగినట్లు నీవినాశమునకు హేతువుగాఁ దలంచుము. ఓదుర్యోధనసార్వభౌమా! నీవు చెడెదవని నన్ను నీవెన్ని నిష్ఠుర వాక్యములాడినను నెత్తిని నోరువెట్టుకొని పలుమారు లీవిషయము నీతో ముచ్చటించవలసివచ్చె.

క. అవనితలసామ్రాజ్యో
త్సవమునకును యోగ్యమైన । సతి ద్రౌపది పాం
డవధర్మపత్ని నీకిం
తవమానముసేయ నేమి । యనపాశ్రయమే?

పదినిఁ బాంబిడిచిప్పుడు మనశకునిచేసిన ప్రోత్సాహము జ్ఞప్తినుంచుకొనుము. గాలంబునఁగుచ్చిన మాంసలేశంబును గాంచి తుళ్ళిపడుచు దానినిమింగుటకై పరువిడివచ్చి యాగాలంబుతోఁగూడ మాంసఖండమును మింగునపు డాచేప పడు సంతసమునకు మేరయుండునా? కాని యాగాలము దాని కంఠమునుండి పెకలించునపుడు గదా దాని తుళ్ళడంగుట?

అబ్బాయి! సుయోధన! యెఱిఁగి యెఱిఁగి కోరలనుండి కరంబు గరళంబు వెదజల్లుచున్న పాముల నుసికొల్పి నీ కంఠంబున నేలచుట్టుకొనెదవోయి! ఇది మంచిమార్గము కాదోయి తండ్రీ! గాంధారేయ! కౌరవవంశనీరసారణ్యంబు తీవ్రశరార్చుల మ్రగ్గఁజేయుటకు సహదేవానలంబు దుష్టవ్యాపారవాయువులచేఁ బ్రేరేచకు. నకులవ్యాఘ్రంబు కోరలు దీఁటుకొనుచు నోరు తెఱచుకొని కౌరవకులపాంసనచాగబృందంబుల గొంతుకలు కొఱికి పచ్చినెత్తురు పీల్చ నుంకించుచున్నదని తలంచుము. అర్జునఖగేంద్రంబు గాండీవపక్షప్రహారంబులఁ బరపుచు, తీవ్రశరనఖప్రపాతంబులఁ గౌరవకులపన్నగంబుల శిరంబులఁ జదుకఁద్రొక్కవేచియున్న దని తెలిసికొనుము. కౌరవమద మాతంగమృగేంద్రుఁ డగుభీముండు, బాహుసటల ఝాడింపుచు, శతఖారీపరిమితాయసదండవక్త్రంబున కౌరవమదాంధసింధురకుంభంబులఁ బక్కునఁ బగులఁగొరుకునని యోచించుకొనుము. యుధిష్ఠిరక్రోధార్ణవంబు భవన్మాయాద్యూతచంద్రోదయంబున నుబికి, పొంగి, పొర్లి, యతిక్రాంతవేలాతటంబయి దుష్టగుణక్రూరసత్వసంవేల్లితకౌరవద్వీపంబుల ముంచనున్నదని యూహింపుము. ఓధృతరాష్ట్ర! నీ మనోనేత్రంబున నీపుత్రుని దుండగంపుచేష్టలు గండుమీరుచున్నవని తెలిసికొనుము. ఇటువినుము.

చ. ద్రుపదతనూజ సాధ్వి యని। క్రోధపరాక్రమవిక్రమక్రమ
క్షుపితబలాఢ్యు లార్యజన। సంస్తవనీయులు పాండవేయులన్
గుపితులఁజేయ దౌష్ట్యమునఁ। గుచ్ఛితులై చరియించువారి వా
రపగతశౌర్యవంతులుగ। నాజి నొనర్చరె నీదుపుత్రులన్.

అన్యాయాగతధనమదంబు పెంపున నమాయికులును ధర్మమార్గానుయాయులు నగు పాండవుల హింసించనున్న నీపెద్దకుమారున కు బుద్ధిచెప్పుము. మాయాద్యూతంబున హరించిన పాండవలక్ష్మి నీకుమారుల నాశనమునకుగాని వృద్ధికిగాదని తలంచుము. మోసమున వంచించి ధనముగొనుటయు, నవమానపఱచుటయు, చంపుటయు, హింస యనంబడును. అట్టిహింసాపరాయణుండగు రాజు వృద్ధికిరాఁజాలఁడు. నాయనా! సుయోధనా! కుడిచి కూర్చుండి యకారణంబుగఁ బాండవులతోడి విరోధ మేలతెచ్చుకొనెదవోయి! బలవంతులతోడి విరోధము మనకు లగ్గుకాదు. నిష్కారణముగ వసంతసమయవిజృంభితమల్లికాలతలవలెఁ గుసుమితయశోభిరామం బయిన వంశవృక్షమున కేల హాలాహల్లయ మాచరించెదవు? దురూహలనుండి బుద్ధి మఱల్చుము. మీమామ యొనర్చిన మాయాద్యూత పరాభవంబు పాపావహంబుగాని పరాక్రమోత్తేజనమున నరిసముదాయంబుల జయించి కీర్తినిగడించుట కాదుసుమా! నీవు మిత్రుల నపకీర్తిపాలు కాఁగలవు. నాయనా! నీవు ద్రౌపదికి నవమానముచేయ నెంచుట, మంటలనుజూచి ఫలంబులను భ్రాంతిచే శీఘ్రంబున మిగ్రింగ జూచు శలభంబులవడువున మగ్గుటకా దలంపుము. ఇటువినుము.

చ. సతి, సుకుమారి, రాశి, గుణ। సస్యవివర్ధనదివ్యభూమి సం
స్కృతమతి, పుణ్యవర్తన । వశీకృత శౌచవిలాసవల్లి యా
తతగురుభక్తి, కృష్ణ పర। తంత్రి యమూల్యగుణాఢ్య ద్రౌపదీ
సతి కిల దాస్యమిచ్చిన నృ। శంసులవంశము నాశ మందదే.

అట్టిమాట నోట వెలువడుటకూడ మహాదోసముగ నెంచుము. ధనమే ప్రధానముగఁ గొని వంశమర్యాదలఁ బాడుసేయకుము.

సాధులమనసును చెడుకార్యముల నొప్పించినవారియిడుముల కు మితిలేదని పెద్దలు నుడువుదురు. "సాధుసజ్జనసంతాపం కిమాశ్చర్యం కులక్షయం" బను పెద్దలనుడి నీమొద నిడుకొని సుఖంబుగ బ్రతుకనెంచుము.

దుర్యో—ఓయి విదురా! నీ వేనాఁడు మావిజయంబునకు సంతసించితివని యిప్పుడు సంతసించెదవు. నీజన్మమంతయు భద్రరాజువలెఁ బాండవులఁ బొగడుచు, వారి యడుగులకు మడుగులొత్తుటకుగాఁ గడిచిపోవును. వారిమీఁదఁ బ్రేమకలిగిన మమ్ముఁ దిట్టకుము. అధికారమును మించి మాట్లాడకుము. ఒకమూల పడియుండుము. ఓయి ప్రాతిగామీ! ద్రౌపదీయాంతఃపురమున కరిగి, ధర్మరాజు తన్నోడుట యెఱింగించి, దాసీతనంబు సలుపుటకు సభాస్థలికి రమ్మని మాయాజ్ఞఁ దెలిపి తీసికొని రమ్ము. లేచిపొమ్ము

ప్రాతిగామి—చిత్తము. (అని నిష్క్రమించును.)

[ద్రౌపది మందిరమున ప్రాతిగామి ప్రవేశించి]

ప్రాతి—అమ్మా! సేవకుని జోహారు లందికొనుము. తల్లీ! ధర్మతనూజాతుఁడు సకలసంపదలను, సమస్తధరణీరాజ్యంబును, తన ముూలను, తన తమ్ములను, తన్నును, నిన్నును, శకునిమాయాద్యూతంబున ధార్తరాష్ట్రులకు నోడిపోయె. కావున నోమహారాణీ! దుర్యోధనసార్వభౌముండు మిమ్ము సభాస్థానమునకుఁ దోడ్కొనిరా నాజ్ఞ నొసంగి నన్నంపినాఁడు. రాజు ముదలచే నిటువచ్చితి. ఆలసింపక దయచేయవలయు.

ద్రౌపది—(ఆశ్చర్యముగా) ఆఁ! నిక్కమా? శశికులాలంకారుండు జూదంబున నన్నోడినాఁడా? ఏమి ప్రాతిగామీ! యథార్థంబుగా? ఏయుగంబునఁగాని, యెట్టిదుష్కృతవుండుగాని, భార్య

నోడ్డి యోడిపోయినభర్తకలండా? ధర్మదేవత యనందగు నామనోహరుండే యిట్టికార్యంబున కొడంబడెనా? సభ్యు లంగీకరించిరా? ఇదియేమి యపూర్వపణము! ఆహా! కాల మెంతటి వింతలను సృష్టిం జేయుచున్నది. మున్నెన్నండైన నిట్టిచిత్రములు కని విని యెఱుంగుదురా! అన్నా! ప్రాతి గామీ! నీ వాద్యూతరంగంబున నుంటివిగదా! పాండవాగ్ర జుండు ద్యూతమున ముందు తననోడికొని న న్నొడెనో? లేక ముందు నన్నోడి తన్నోటువడియెనో? నీవెఱింగినం జెప్పుము. అబ్బాయి! యెఱుంగవేని క్రన్నన పరిషద్రంగమునం గరిగి యాజూదరినిగాని సభ్యులనుగాని నీవడిగి తెలిసికొని నేను వచ్చుట లావశ్యకమైనచోం గ్రిమ్మర నిటురమ్ము. శుద్ధాంతని వాసినిని వెలువడి నీతో వచ్చుట లాజేనికి న్యాయమనితోంచిన రాక తప్పునా? పోయిరమ్ము. అబ్బాయి! ఇంకొకమాట. అచ్చట విదురుండుండెనా? నన్నేల సభకు రమ్మనిరో నీకుం దెలియునా?

ప్రాతి—విదురపభువయ్యగా రచటనే యుండిరి. ఈ నాయుద్యో గము వారికే మొదట నియమింపంబడినది. కాని యా విదు రయ్యగారు మోము జేవురించుకొని యేమేమో యుపన్య సించినారు. అటుపిమ్మట నీఘనకార్యమున నేను నియోగింపం బడితి. సేవకావృత్తి సందిగ్ధజీవితంబని దేవేగా రెఱుంగని దియా? అమ్మా! సేవకునకు జూదంపుటుదంతంబు తెలియదు కావున మీయానతి నెఱవేర్చి వచ్చెదను. (అని నిష్క్రమించ వలయును.)

ద్రౌపది—ఆహా! యేమి కాలవిపర్యాసము, ఈఘుట మెన్నియుప ములవడి సుడివడవలయునోగదా! కృష్ణా! కృపాకటాక్ష ప్ర

క్షీణితాఖిలసాంసారికవ్యామోహతృష్ణా! నీయనుగ్రహమేకదా సకలలోక జీవసంచలనాధారము, ద్యూతపరాజిత సంచలితమనస్కుండయిన ధర్మజుం డెట్టియుత్తరమొసంగునోకదా? కౌరవనాథుండు శుద్ధాంతనివాసినిని రచ్చ కీడ్పించునా? అట్లయిన వీరసింహులగు నాపతు లూరకుందురా? ఊరకుండక చేయునదేమి? మోసగాండగు దుర్యోధనుండు మెట్టి దురూహతోం బ్రాతిగామినిం బంపెనో? లేకయున్న విదురుం డేలరాక మానును? ఊనిపై నేలకోపించును? ఇంక నాకు శరణమేది? మంజువాణివలన దుశ్శాసనుండు శుద్ధాంతమున నన్ను మోసగించుకున్నగడ పన్నుచున్నట్లు వినియుంటిని. అందునకే భానుమతీప్రభృతు లిందుండి యిప్పు డవాంతర కార్య వ్యాజంబుల నొక్కరైన లేకుండ నన్నొంటరినిగాం జేసినారు. ఇప్పు డేమిసేయుదు? గాంధారిసమీపంబున కేగిన ముప్పు వాటిల్లదని గదా నిశ్చయించుకొంటిని! ఇప్పు డేమార్గమ్మున బంధనిర్ముక్తురాలను కానలయునో తెలియకున్నది. అనన్య శరణనగు నా కాగోపాలుండే రక్షకుండగు.

ప్రాతి—(సభలోనికివచ్చి) అయ్యా! మహాప్రభూ! ధర్మనందనా! ద్రౌపదీదేవిగారికిం గలిగిన సందేహనివారణార్థ మొక ప్రశ్న నన్నడిగె. అది నాకుం దెలియనికతంబున మరలవచ్చితి. అదేమన, తనోడి ననోడెనా? ననోడి తనోడెనా? ఈసందియము నాకుం దెలియనికతంబున సభారంగమున మిమ్మడిగి తెలిసికొని రా నాజ్ఞాపించె.

దుర్యో—ఓయి ప్రాతిగామీ! నీవామె సేవకుండవని యెంచకుము. నాయాజ్ఞ యయినదనుము. నీకుగల సందియములు సభ్యుల ముందర తన మగనినడిగి తెలిసికొనవచ్చుననుము. శీఘ్రముగా

రా మాయానతియనుము. రాశివాసపు నీటువిడచి నీవెంట
రాగా మాముదల యనుము. పొమ్ము.

ప్రాతి—(చిత్తము. అని వెడలును.)

ద్రౌప—అదిగో! ప్రాతిగామి తిరిగి వచ్చుచున్నవాఁడు. నేను రచ్చ
కీడ్వఁబడుచున్నాను. నాయంతఃపురసౌఖ్యముల కవరోధము
కలుగుచున్నది. ఇప్పు డేయుపాయముచేతఁ దప్పుకొనఁగలను.

ప్రాతి—(ప్రవేశించి) దేవీ! నీవడిగినయర్థంబు నిర్ణయించువారు సభ్య
లయియున్నారు. వారి సన్నిధానంబున నీసందియంబులు నీ
భర్తనడిగి దీర్చుకొననౌను. సత్వరంబుగఁ జనుదెమ్ము.
తేని యాజ్ఞనడిచి తీరవలయునని, దుర్యోధనసార్వభౌముండు
నుడివినాఁడు. దురోదరపరాజయసంచలితమానసుండగుట
చేఁగాఁబోలు ధర్మనందనుండు నిరుత్తరుండయ్యె. సేవకుని
వృత్తియు, జీవితము, కఠినములుగదా! తల్లీ! రాజాజ్ఞ యనుల్లం
ఘనీయము; అప్రతిహతము. అందుల సేవకులు జీవచ్ఛవం
బులు; పరతంత్రులగుటవారియాజ్ఞ నెఱవేర్చక తప్పదు.
ఏమిసెలవు?

ద్రౌప—నాగతికి నీ వేమిసేయుదువు. నన్ను నీసోదరినిగా భావించి
మఱియొకపరి సభకుఁబోయి నామాటగా నిట్లు పలుకుము.
అయ్యా! నేను రజస్వలను. అంటను చేరరాని సమయము. ఏక
వస్త్రను. అట్టి యాఁడుది సభాస్థలికి రాఁదగునా? సభ్యులంగీక
రింతురా? రారాజున కిదిసమ్మతియా? ఇట్టి సమయమున నాఁ
డువాండ్రను రచ్చ కీడ్పింతురా? కావున సభకు రాఁజాల నని
సభలోఁ జెప్పుము. అనంతర మావిధిచెయ్యు వెట్టిపో యట్టు
లుజరుగును. శుద్ధాంతాంగనలు పుష్పవతులు వెలుపలికి రాఁ

గూడదు. ఇది శూరుల కవమాన మనిగూడ వచింపుము.
పోయిరమ్ము.

ప్రాతి—చిత్తము. (అని నిష్క్రమించును.)

దుర్యో—ప్రాతిగామి యొంటరిగనె వచ్చుచున్నాఁడు. ఆమె యేదో
సాకు పెట్టియుండవచ్చును.

ప్రాతి—(ప్రవేశించి) అయ్యా! కౌరవనాథా! మీయాజ్ఞ విన్నవిం
చితి. ఆమె రజస్వలయఁట. ఏకవస్త్రయఁట. అంటను చేరను
వీలుకానిసమయమున సభాస్థలమునకు రాచదేవేరి రాఁదగ
దఁట. సభ్యు లంగీకరింతురా యని యడిగినది.

దుర్యో—ఈపిరికిపంద భీమునికై జంకి రాయబారము సేయుచున్నాఁ
డు. రాచదేవేరితనము వదలి చాలకాల మైనదని చెప్పుటకు
సామర్థ్యము లేకపోయినదియా? ఓయువరాజా! దుశ్శాసనా!
యీభీరుఁడు చేతగానివాఁడు. నీవే పోయి ద్రౌపదిందోడ్కొ
నిరమ్ము.

దుశ్శా—సోదరుఁడు దేవరయాజ్ఞ శిరసావహించుచున్నాఁడు. (అని
నిష్క్రమించును.)

ద్రౌప—నాకిప్పుడు స్ఫురించుశకునములుకూడ నాకు రాఁబోవు
కష్టములనే సూచించుచున్నవి. మయసభావలోకనపరాభవ
దందహ్యమానుఁడగు దుర్యోధనుఁ డెద్దియో యవమానము
సేయ నెంచియే నన్ను ద్యూతరంగప్రవేశము చేయించు
చున్నాఁడు. దైవమా! దీనురాలి నేమిసేయ నెంచితివో గదా?

దుశ్శా—(ప్రవేశించి) ఓ ద్రౌపదీ! సౌబలుండు రారాజునకుగాను
దురోదరంబున నిన్నోడిచికొనియె. నీవు గురూత్తము నర్థము
నైతివి. నిన్నును, పుడమిని, తమ్ములను నీమొదటిమగఁడు గో
ల్పోయినాఁడు. కావున నీ విప్పుడు మాయింట దాసీతనంబు

సేయవలసినదాన వయితివి. నన్నుఁ బ్రాతిగావిగాఁ దలఁపక శీఘ్రముగా సభాస్థలంబున కరుదెమ్ము.

ద్రౌపది—నాయనా! దుశ్శాసనా! విధినియోగ మెట్లుకో యటుల జరుగఁగలదు. దూరముగ నుండుము. రజస్వలను. సమీపించకుము. ఏకవస్త్రను. గురుజనాధిష్ఠితంబైనసభ కెట్లు రానేర్తును? అబ్బాయి! యిది తగనిపని. పురుషులను పురుష లధిక్షేపించిన సమానముగా నుందును. నావంటియబలలపై మీకోపము సూచించుట తగవా? నన్ను విడిచిపెట్టుము.

దుశ్శా—ఓసి, గట్టువాయి! మనపూర్వపుసంబంధములు కలిపి, దీనపుపలుకులు పలికినంతమాత్రమున నే దయకలిగి, యీ దుశ్శాసనుఁడు నిన్ను విడుచువాఁడు కాఁడు. నీవు దాసీపనులు సేయుటకై నియమింపఁబడినావు. గౌరవముగ నీకు మర్యాద లొసఁగుటకు కాదు నేను వచ్చినది. అంటితను ముట్టితను, దగ్గఱకుము, రాను, అను రాణివాసపునీటులు దాఁటిపోయిన వనుకొనుము. ఆజ్ఞకులోఁబడి వరవుడుతనము సేయుము. నడుము యెత్తకుండ సభారంగ మూడ్చుపనికి నియమింపఁబడియు, నోటు మూనకున్నావె.

ఉ. రాణివి గావు దాసి వికఁ | రానని మూర్గినఁ దప్పిపోదు ని
ర్మాణమొనర్చె దైవమిటు | పాచిని యూర్చెడు దాసిగాగ ని
స్త్రాణవు నీకుభర్తలును | దాసులు రమ్మిఁక మాటలేల నీ
జాణతనంబు నీటు నిల | సాగదు గావునఁ గట్టిపెట్టుమా.

రాజాజ్ఞ యయినది. లెమ్ము. రమ్ము. ఆలసింపకుము.

ద్రౌపది—నాయనా! మఱందివి; నీ వేమన్న నేమి? నాబిడ్డవంటి

వాఁడవు. నీవది నెవరవడితనంబువలన గలుగుగౌరవము మా తొమ్మి మీఁది కాదా ? మీయింటఁ జొచ్చిన కోడ లేకార్య మొనర్చిన గౌరవాగౌరవములు మీవంశముననేకేగాని మీకు మాత్రముకానా ? రజోవతినైన నన్నేల నిర్బంధించెదవు. ఏ కవస్త్ర నిట్లనదగునా? కర్తవ్యాకర్తవ్యములు విచారింపుము.

దుశ్శా—ఇంతదనుక మంచివాఁడను గాన నోర్చియుంటిని. నీవెక్క డివది నెవు, నేనెక్కడిమనుజుఁడిని; దాస్యము సేయుదాని కెక్కి పేరు ని న్నట్లె పిలువవలయును. దరిద్రపుమొగములకు రాణివాసమా? యజమానికడ సేవకురా లెట్టిమర్యాదగనుం డవలయునో యట్లు నడువుము. తెలియకున్నఁ జెప్పించెద. ఇఁక గౌరవము దక్కదు. నడిచెదవా? నెట్టుకొనిపొమ్మనె దవా? దాసివి, ఏకవస్త్రవైననేమి, విగతవస్త్రవైన నేమి? నడువుము.

ద్రౌపది—అబ్బాయి! మనంబున నీవ్యగలిగిన పౌరుష్ఁబున సాధిం చవలయును గాని యంతఃపురాంగనల నమర్యాదసలుపఁ బ్రి యత్నింతురా? సభాసదనము నే నూడ్చిన నిలువగలదా? ధర్మాతిక్రమణము కాదా? మీయెట్టయెదుట నాపని సేసిన, మీకుఁ దలవంపులు కావా? కావున నీయుద్యమం బుడుగుము.

దుశ్శా—నీచదువులు మావద్ద సాగవు. జుట్టుపట్టుకొని యీడ్చు కొనిపోయెదను. చచ్చినట్లు నడువుము. మాట్లాడకుము. (అని మీఁదకుఁ బోవుచున్నాఁడు.)

ద్రౌపది—(భయముతో తప్పించుకొని గాంధారిని సమీపించు చున్నది.)

దుశ్శా—పలుమరు నీ గడుసుదనంపుచేష్ట లుడుగుమని చెప్పినకొలఁది పీధినిఁబడి పరువిడఁజొచ్చితివి. నీ కెవ్వరడ్డమువచ్చెదరో చూచె

దను. (అని జుట్టుపట్టుకొని సభలోనికీడ్చి తెచ్చుచున్నాఁడు.)

ద్రౌపది—(సభలోనికి వచ్చి దుఃఖముతో) అయ్యో! కురువృద్ధులారా! యేమి యీయన్యాయము? దైవోపహతుండయి నను ధర్మనందనుండు, ధర్మమార్గము తొలంగునా? ఇది తగదని పలుకక మీరందఱు చూచుచుండ, నవిచారపరుండయి, దుశ్శాసనుండు రాజసూయావభృథపవిత్రవారిధారలం దోగిన యీకురులు పట్టి యీడ్చుట కేమికతంబు? సర్వధర్మ విజ్ఞానులయిన భరతవీరులవంశము నేఁ డధర్మసంపదచే నింత నింద్యము కాఁదగునా? జగత్త్రయవిజయభుజవీర్యసనాథలయిన నాథులుగల నే నగతికనయి, యిట్టిపాటులు పడవలసిన దేనా? దీనికి నిష్కృతి కలదా? ఇది విధియని యూరకుండుట ధర్మమా? పురుషప్రయత్నము వలదా?

భీముఁడు—అకటకటా! యెట్టియిక్కట్టు లిట్టిపడియె. ధర్మనందనుని శాంతరసంబు, భార్యను, సోదరులను నెంతపీడించుచున్నదో విచారించుటకు మేర కలదా? క్షత్రియజాతియందే కాదు, యేనీచజాతియం దుద్భవిల్లిన మనుజుండైనఁ దనచేతఁ బట్టిన యిల్లాలిశిరోజము లోకశత్రువుచేత నంటుకొనఁబడి, యీడ్వఁబడుచుండఁ జూచి యూరకుండుహీనుం డుండునా? ఇంతకన్న మగవానికి బరాభవ ముండునా? మనుజజన్మమెత్తి జ్ఞానపౌరుషహీనుఁ డయినవాని నేమనవలయు? ధర్మశాస్త్రములన్నిటిని తలక్రిందుగాఁ జదివి తగులఁబెట్టినదంతయు భార్యను పందెముపెట్టి జూద మాడుట కేనా? పెండ్లామును పందెముపెట్టి జూదమాడుట కేనా? పెండ్లామును పందెముపెట్టి జూదమాడుమని యేధర్మశాస్త్రములయందైనఁ గలదా! పౌరుషము లేని శాంతరస మేల? తగులబెట్టుటకా? వెనుకముం దా

రయక, చలపట్టి శత్రుకృతకపటోపాయంబుల గుర్తెఱుంగక, యంతఃపురాంగనను పందెముపెట్టి రచ్చకుం దలంబెట్టి యీడ్పించినబుద్ధిశాలిని, అగ్రజుండగ్రజుండని పూజింప విధి మా నుదుట వ్రాసెను కాంబోలును. అధర్మాంకురము మొలకయెత్తినతోడనే గోటఁగిల్లక విడిచిన పెచ్చుపెరుగుచుఁ గొడ్డంటనరుకుట కభేద్యమగుచున్న ధర్మము ధర్మమని యెం తదనుక నోర్చియుందును?

సీ. బహువిధశస్త్రాస్త్ర। భరితంబులై యొప్పు
తేరుల నొడ్డిన। నూరకుంటి
కరిఘటహయచయ। ఖరరాసభాదులం
బందెమొడ్డిన జూచి। పలుకకుంటి
సర్వసర్వంసహా। సామ్రాజ్యమంతయు
నొడ్డి యోడినఁ గని। యోర్చుకొంటి
భవదాజ్ఞవర్తించు। భ్రాతృవర్గము నెల్ల
నోడిన జూదాన। నొప్పుకొంటి
శకునికైతవజాలికా స్తబ్ధమతిని
సకలసామంతరాజన్య। మకుటఘటిత
రత్ననీరాజితాంఘ్రియా। రాజవదనఁ
బందె మొడ్డిన భీముఁ డోర్వంగఁగలఁడె?

ఇది దుష్టద్యూతమని యెఱింగియు భార్యను పణంబిడి యాపె మన యెట్టయెదుట పడుపాటులు చూచుచుండిన యన్నగారి పెద్దతనంబుఁ జూచినకొలఁది యొడలు మండిపోవుచున్నది. కోపంబు మితిమీరుచున్నది. రోషంబు వారాసివలెఁ, బొంగి పొర్లుచున్నది. భక్తిరస మింకుచున్నది. ఇంక శాంతిలేదు. పుణ్యపాపములు లేవు. రౌద్రరసప్రవాహమున సుడివడిన నా

జిహ్వయ ఛేచ్ఛావ్యాహార దక్షవ్యాహారమగుచున్నది. గురుజన శిరస్కారాగత ఘోరనరకంబు లాకల్పాంత మనుభవించెదగాని కన్నులయెదుట నొక నృపకులపాంసనుండు భార్యను జూట్టుపట్టియీడ్చుటఁ జూచి భరింపఁజాలను. భరింపఁజాలను. నీతిబాహ్యకార్య మొనరించువాఁడు, అగ్రజుఁడే కాఁడు తండ్రియైననేమి? గురువైననేమి? శిక్షించుట న్యాయమే. కావున నిట్టికష్టముల కాధార మగుచు, భార్యను పందెముపెట్టితినన్నవాని జిహ్వను చీల్చివైచెద, ఆనాలుక పీకివైచెద, ఆవక్త్రంబు మూసెద, పందెమిడిన యాబాహువు దాహంబుసేసెద, ఆకరంబు నరికెద, ఆభుజంబు భంజించెద, ఆచెయ్యి వ్రయ్యలుచేసెద, ఆహస్తంబు నస్తమింపఁజేసెద, ఆశయంబు ఆశమొనరించెద, ఆనుశిబంధము ధ్వంసమొనరించెద, ఆవ్రేళ్ళ గుళ్ళగించెద, ఆరూపు మాపెద—సహదేవా! అగ్నిహోత్రము!! అగ్నిహోత్రము!!!

(ధర్మరాజుమీఁదికి దుముకఁబోవుచున్నాఁడు.)

అర్జు—(భీమునిఁ గౌఁగలించి పట్టుకొని) అన్నా! భీమన్నా! స్మృతి దప్పినదా? పిచ్చిపట్టినదా? పిశాచగ్రస్తుండవైతివా? నీభ్రాతృభక్తి యెటుగంటెనదా? నీజన్మప్రభృతి యగ్రజునిపై కినుకఁబూని యిట్టిమాట లాడియెఱుఁగుదువా? భార్యాపరాభవనిరీక్షణకోపావేశితమనస్కుండవై సివాడునుడులు గురుతెఱుఁగకకుంటివి గాని, యిట్టిమాటలు నీనోట వెలువడఁదగినవా? ధర్మనందనుండు సత్యముఁ దప్పిన లోకములు తలక్రిందులుగావా? గ్రహతారకంబులు భూమిపైఁ దొర్లకాడవా? జగంబులు భస్మములు కావా? ధర్మస్వరూపుఁడగు ధర్మజుని నిందించినవాని కెన్నఁటికైన నిష్కృతి గలదా? ధర్మతనూజుం

డకార్య మొనరించెనా? ఆగ్రహోమయుగ్రస్తుండవై, నీ వాడు మాటలకు పౌర్వాపర్యము లేక, నీరసము లేకపోవుటచే నీరసములై కన్పట్టుచున్నవి. కాని, చక్రవాళావార్యాచలా చక్రమంతయు రజోమయంబైన ఘనయగ్రజుని మనంబు చెదురునా? అధర్మమునఁ జొచ్చునా? అజాతశత్రుండని బిరుదందిన మేటిమగండు, నీ నింద్యవచనముల కర్హుండా? శాంతిని దెచ్చుకొనుము. పెద్దలను కనిపెట్టుము. నీతినిఁ బాదుకొలుపుము. దేహమును పరిశీలించుకొనుము. అన్నగారిని చూడుము. నా నుడు లాలించుము. వినయం బవధరించి యగ్రజుని పాదములపైఁ బడుము. ఇటు వినుము.

సీ. ఎవ్వాని వాకిట । నిభమదపంకంబు
రాజభూషణరజో । రాజి నడుగు
ఎవ్వనిచారిత్ర । మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు । నెఱపు గఱపు
నెవ్వనిగడగంట । నివ్వటిల్లెడుచూడ్కి
మానితసంపద । లీనుచుండు
నెవ్వనిగుణలత । నేడువారాసుల
కడపటికొండపై । కలయఁబ్రాకు
నతఁడు భూరిప్రతాప మ । హాప్రదీప
దూరవిఘటిత గర్వాంధ । కార వైరి
వీరకోటీరమణిఘృణి । వేష్టితాంఘ్రి
తలుఁడు కేవల మర్త్యుఁడే । ధర్మసుతుఁడు?

ఎంతటిబుద్ధిబలముగలవానికైనఁ గాల మవిలంఘనీయము. విధి బలవంతమయిన ముమ్మూర్తులు గర్భవాసాదిక్లేశ మనుభవించలేదా? సకలబ్రహ్మాండభాండోదరుండగు శ్రీమహావిష్ణువు బ్రాహ్మణ

వాక్యబద్ధుఁడయి కదా యనతా రాము లెత్తినది? శ్లో॥ అయమ
మృతనిధానో నాయకో ప్యోషధీనాం। శతభిషగనుయాతశ్శం
భుమూర్ధావతంసః। విరహయతినచైనంరాజయక్ష్మాశశాంకో
హతవిధిపరిపాకః కేనవాలంఘనీయః॥ అనఁగ నొకబొట్టు సోఁకి
నంతమాత్రముననే జరామరణములు లేక సదా యౌవనప్రా
యమున నుండఁజేయు నమృతమునకు నిధియై సకలామయ
నాశకంబయిన యోషధీతతికిఁ బ్రభువయి, ఒక్క వైద్యుఁడే
కాదు, యెల్లప్పుడు నూరుగురు వైద్యులతోఁ గూడి తిరుగుచు,
మృత్యుంజయుఁడయిన సదాశివుశిరంబున సర్వదా వాసము
సలుపు చంద్రునకు క్షయరోగక్లేశము తప్పినదా? కావున నె
వ్వఁడును విధిపరిపాకము దాఁటఁజాలఁడు. విధిబద్ధుఁడయినవాని
నిందించినఁ బ్రయోజనము కలదా? మనయగ్రజుండు, ధర్మబా
హ్యమయిన కార్య మొనరించినఁ దిరస్కరించుట న్యాయము.
నీవిట్లు తిరస్కరించుట పలువురకుఁ బరిహాసముకాదా?

సీ. ధర్మతనూజుండు । ధర్మువు దప్పిన
ధరణీతలం బెల్లఁ । దల్లడిల్లు
దవిలిసుహృద్ద్యూత । ధర్మయుద్ధములకుఁ
బరులచేఁ బిలువంగఁ । బడి విభుండు
కడగక విముఖుండు । గాఁ జనదని శుభ
క్షాత్రధర్మంబు లో । కంబునందు
నిలిపెఁ దా నిది పతి । నేరమియే దైవ
వైపరీత్యం బైన । వనరదగు నె
గురుల ధర్మపరుల । గోపించి ధీరు ల
తిక్రమింతురే త । దీయ్య నిత్య

ధర్మ గౌరవం బ(ధార్మికులగుచున్న
పరులచేత చెరుపఁ(బడియె నిప్పు.

కాబట్టి, దైవాగతప్రతికూలంబుల కన్నగారిని నిందించిన శత్రువుల
కెల్లిదము కామా? పలువురు తల లెత్తి చూడఁదగు నీయుద్య
మమువలనఁ గలుగు ప్రయోజన మెద్ది? శాంతించి యన్న
గారి గౌరవము కాపాడుము.

ద్రౌప — ఆహా! ఈనరపతియాస్థానంబున నొకరైన ధర్మలోప
భయంబున న్యాయంబు నుడువ నంకించకుండిరే! ధర్మపరి
పాలకుఁడు రాజు గావున నధర్మంబునఁ గల్గు పాపంబు రాజు
నాశ్రయించు. ఆ యధర్మఫలం బనుభవించువాఁడు తాని
దూరందగు. అన్యాయంబుగ నొక్కయాఁడుదాని మానభం
గముఁ జేయ గమకించుపాపుని ప్రభువు లారసి శిక్షించకుం
దురా? ధర్మం బధర్మవిద్ధంబయి సభకు వచ్చినదానిం దీర్పకు
న్న సభ్యు లధర్మాచ్ఛాదితు లగుదురు. కామక్రోధంబులు
విడిచి యధర్మధ్వంసంబు గావించనినాఁడు పాపంబున నాల్గవ
వంతు సభ్యులను, మఱియొక భాగము భూపాలుని జేరును. మిగి
లిన యర్థంబుమాత్రమే కర్తకుఁ జేరునని పెద్దలు వక్కాణిం
తురు. కావున న్యాయవేత్తలారా! నా ప్రశ్నంబున కుత్తరం
బొసంగుఁడు. నావిధి నిర్ణయించుఁడు.

మ: నను మున్నోడెనొ? తానె యోటుబడెనో (నన్నోడ కేయొడ్డెనో
తనపందెం బది దెల్ప రొక్కరయినన్ (ధర్మంబె మీకొక్కపా
ణిని హింసించుటఁజూడ మీకుఁ దగునా?( నిందా్యడ నీకిద్ది కూ
డనికార్యంబని తెల్పరైరిగ ప్రచం(డక్షోభ మే నందినన్.

కావున నోన్యాయవేత్తలారా! ఈ యర్థంబు స్వార్థపరాయణులై
పక్షపాతంబు వహింపక, యథార్థంబు వచింప యోచింపుఁడు.

శుద్ధాంతనివాసిని కీపాటు తటస్థించుట దేశాపాటమని పాటవం
బగు బుద్ధిని యోచింపుఁడు.

విక—ఆర్యులారా! మునిబృందారకులారా! విద్వాంసులారా!
న్యాయవాదులారా! పసివాఁడు పలుకు పలుకులని పెడచెవి
నిడక, యిడుములఁబడు పడతి నుడువుల కుత్తరం బిడ గమకిం
పుఁడు. ఒకని మొగమోటమునకు నోటువడి న్యాయంబును
వెడలనడువకుఁడు. అగతికయై, యస్వతంత్రయై, ధర్మబద్ధయై,
పతివ్రతయై, న్యాయంబు నారయఁగోరు సతీతిలకంబున కుత్త
రంబుగా యథార్థంబు పలుకుటకై సందియింపకుఁడు. ప్రభువు
నకుఁ గోపంబు కలుగునని జంకి, న్యాయవిరోధంబుగఁ గూలికి
విషంబు వ్రాసి, ప్రాణంబులు గోలుపోయి నరకకూపంబునం
బడకుండు. ద్రౌపది ధర్మద్యూతవిజిత యగునా? కాదా?
యామె యిప్పుడు రాణియా? దాసియా? ఆమెయంతిపురమున
నుండి దిగినదియా? సభాస్థలి కేగతి రాఁదగినదియా? ము
న్నెన్నఁడయిన నిట్టి యిక్కట్టు లంతఃపురస్త్రీలకుఁ గలిగినవని
వినియుంటిమా? సందియంబు గలిగినతఱి యొకదీన ధర్మసం
శయ మడిగినప్పుడు తెలిసిన విషయ మిట్లొకని దయకుఁ
బాతుర్లుగాఁ జూచి పక్షపాతబుద్ధి వహించి యూరకుంట
న్యాయమా? సభాస్థలికిఁ బోరాదు. పోయిన నూరకుండరా
దను లోకోక్తి వినియుండ లేదా? అనఁగ, సభాంతరాళంబున
నొకని యభిమానము గోరి న్యాయంబు నుడువకున్న దురా
త్ముల యముండు పరలోకంబున సహస్రనాగపాశంబుల బం
ధించి వేయివత్సరంబుల కొక్కొక్కటిగా విడిచెదరని ధర్మ
వేత్తలు నుడువుచుందురు. సభలో నధర్మంబు జరుగుచున్నప్పు
డు వీరుండయి న్యాయవాది వారింపవలయు, అసమర్థుఁడయిన

సటనుండి లేచిపోవలయు. ఈసభ నలంకరించినవారందఱు వీరులు, ధీరులు, న్యాయవేత్తలు గావున, నీమె ప్రశ్నంబున కుత్తరం బాసంగం బ్రార్థించుచున్నాండ. (అని కూర్చుండవలయు. తిరిగిలేచి) అహా! ధర్మదేవతా! కాలము నీకు వాకట్టుకట్టినదో? అధర్మమా! నీవు లోకమం దెదురులేక సంచరించుచుంటివా? వేనవేలు మహాజనులుండి నోరు మెదల్పలేకుంటిరే! సభ్యులందఱు ధర్మనిర్ణేతలయ్యు ప్రతికాయవలె గ్రుడ్లు వెళ్ళబెట్టుకొని, ప్రతిరాట్టములవలె చెవులు దోరగిల బెట్టుకొని, కుడిమిండిబొమ్మలవలె కూరుచుండిరి గాని,యొకరైన నిదమిత్థమని న్యాయంబు పలుకంజాలరైరి గదా! అయ్యలారా! యార్తయై విలపించుచు నొకయాఁడుదాని కుయ్యాలించి, నిష్పక్షపాతబుద్ధిచే నొకనిర్ణయానకు రాక, సదుత్తరం బీయంజాలని సభ యుండిననేమి లేకుండిననేమి? పెద్దల యెదుట చిఱుతవాఁడు ధర్మనిర్ణయముఁ జేయుట లఘుత్వమయినను అన్యాయశ్రవణవికర్ణుండయిన వికర్ణుఁడు నిర్ణయింపఁబోవు ధర్మము కామక్రోధంబులు దక్క విచారింపుఁడు. జూదమ్మును, వేటయు, పానమ్మును, బహుభక్షణాసక్తియు, నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలినపురుషునకు ధర్మముదప్పి వర్తిల్లును. అట్టివానికృత్యంబులు చేకొనందగినవి కావు. కితవాహూతుండై దుర్వ్యసనాసక్తుండగు పాండవాగ్రజుండు పాండవుల కందఱకు-సాధారణధనంబయిన పాంచాలిని బణంబు వెట్టుటకు స్వాతంత్ర్య తగలిగియుండెనా? అస్వతంత్రునిచేఁ జేయఁబడు కార్యము న్యాయస్థానమునందు నిర్వహింపఁగలదా? ద్రౌపది యధర్మవిజిత; మఱియు నేకవస్త్ర; అంతఃపురవాసిని కావున, నిట

కీవిధంబునఁ దోడ్కొనివచ్చుట న్యాయము కాదు. ఇయ్యది
సభాసదు లెఱుంగనిదియా ?

ఉ. ఎందుకు మీతపంబు జప । మెందుకు నిష్ఠలు యోగమెందుకో
ఎందుకొ ధర్మశాస్త్రము ల। దేపనిగాపఠియించుటౌ త్రిమై
గుందుచు ధర్మసంశయము । గోరినసాధ్వికి నుత్తరంబిడం
దందలలాడు పండితుల। తండము లుండిన మంద నేమియౌ.

విదపకాలముగావున, మీర లుపేక్షించియుండవచ్చును. ముఖ్యముగ
నాసేయు ధర్మనిర్ణయ మిదియ. పాండవాగ్రజుండు పాండవుల
కందఱకు సాధారణధనంబయిన పాంచాలిని పణంబుఁ జేసెఁ గా
వున, ద్రౌపది యధర్మవిజిత, యాకోమలి నేకవస్త్ర నిట దో
డ్కొనివచ్చుట యన్యాయంబు. ఇదియ నాసేయు ధర్మనిర్ణ
యంబు.

సభ్యులు—సత్యము, సత్యము, సత్యము. (చప్పటలు గొట్టవలయు.)

కర్ణ—(ఈర్ష్యతో) ఆహా! ఏమియీవిలాసము, ఏమిగోల,
ఎందుకీచప్పటలు, ఎందు కీకేకలు? తెలిసి తెలియని పసిపిల్ల
ని పలుకుల కింత సంభ్రమమేల? ఆఱుశాస్త్రములు పారజది
విన పండితులకన్న నోయవివేకీ! నీకెక్కువ తెలియునా? నిన్న
మొన్న కన్నుదెరచిన నీవు, ధర్మవేత్తలనడుమ చక్కన్నదిద్దపా
టిశక్తి నీకెక్కడనుండివచ్చినది? పెద్దలచే నిండియున్న సభలో
నీకింతగర్వము స్వతంత్రము పనికిరాదు. నాలుగునీతులు వల్లించి
నంతమాత్రముననే పేరుప్రతిష్ఠలు కలుగునా? నీవొక న్యాయ
వేత్తవగుదువా? ద్రౌపది యధర్మవిజిత యంటివి. నీకేమి తెలిసి
పలికితివి? ధర్మజుండు తన సర్వస్వమును నొడ్డి యోటుపడిననీ
మెవానికి వెలిగాదు? కావుననే ధర్మవిజిత. ఇట్లుకానినాఁడీపాం
డవులందఱు, నింతగ నేలయొడంబడుదురు? మఱియు నేకవస్త్ర

ధ్యైయున్నఁ దీసికొనివచ్చుట యధర్మంబనిగదా యంటివి. లో
కంబున నాఁడుదానికి వైవాహితుండగు భర్త యొక్కఁడుం
డును, గాని పలువురుండరు. దీనికి ననేకమంది భర్తలుండుట
చేత, బంధకి యనంబడు. ఇట్టిదాని నేకవస్త్ర యననేల, విగత
వస్త్రఁ జేసి తెచ్చినను ధర్మవిరోధంబు లేదు. ఓయి గర్వపోతా!
తనకులేని యధికారము మీఁదవేసికొనిన గాలిగానివలె
మోదువడుట తప్ప నీకుం గలుగుకీర్తి లేదు. ఇది మొదలు లేని
పోనిపెత్తనంబులు పైనవేసికొనక, యొకమూల నొదిగియుం
డుము. మఱియు నిప్పటికి మించినది లేదు. ఈభీముండు ధర్మ
రాజు తనకధికారి కాఁడు. ఈతఁడొడ్డినపందెము మే మం
గీకరింపము అనినఁ జాలును. ద్రౌపదినే కాదు, పాండవులం
దఱినిగూడ దాస్యమునుండి విముక్తులఁ జేసెదను. ఇప్పటి భీ
మార్జునుల సంవాదముచే విశదముగా దానిభర్తలే యొప్పుకొను
చుండ నీ కీవ్యర్థప్రలాపము లెందుకు? నీచేతనయిన భీమునిచే
నామాట ననిపింపుము.

భీము——ఓరి పరదత్తాన్నభోజనమదోన్మత్త ! కురుపాండవకలహాలతి
కాలవాల ! అవిదితనిజబలపరాక్రమపౌరుష ! సూతకుల
వార్ధిబడబానల ! వాయెత్తక యొకమూల పడియుండక మా
మాద్యూతసమాగతవిజయంబుగూడ విజయంబుగాఁ దలఁచి
న్యాయవాదియగు వికర్ణుని నిందించుటయెకాక, భీముఁడు ధర్మ
జాజ్ఞాబద్ధుండు కా డనవలయునా? అట్లనిపించవలయునా ?
ఈభీముఁడు ధర్మజాజ్ఞార్గళబంధీకృతపాణి కానిచో నీపాటికి
మీశిరంబులు పప్పుపప్పుగ, నలినలిగా, గుగ్గుగ్గుగ్గున పగు
లకపోయినవియా? ఈసభారంగము శ్మశానవాటిగా మారక
పోయినదియా? మీమాంసులు తలలు విరియఁబోసికొని, నీలి

చీరలు ధరించి, నదీతీరంబున కేగి మంగళసూత్రంబులు పెట
పెట, పెటపెట, త్రెంచుకొను శుభముహూర్తము సమీపిం
చకపోయినదా? ఓరి దుర్మదాంధ ! యీసోదరులు నలువురు
యుధిష్ఠిరాజ్ఞాబంధీకృతపాణులురా ! ఈధర్మదేవత మమ్ము
ద్యూతమ్మున పందెము పెట్టుటకాదు, మాశిరంబులు గోసి
యిచ్చుటకుఁగూడ సంపూర్ణాధికారిగా నొప్పుకొనియుంటి మని
తెలిసికొని, చచ్చినట్లు పడియుండుము. ఓరి దరిద్రదామోదర!
ఱేఁడులకడ తచ్చనలుచ్చరించి పెంపుడుకుక్కవలె భోజనపరి
త్యక్తాన్నకబళవిమోహితప్రాణివగు నీవుగూడ సభలో ధర్మ
సంశయవిచారణ కర్తవగుట భావికలికాలపుచిహ్నములని తలం
పవలయు. అగ్రజాజ్ఞాలానబద్ధుండు భీముని వ్యాఘ్రునిగాఁ దలంచి
కాఱు లరవక, తల వంచుకొని కూర్చుండుము.

కర్ణ—పౌరుషహీనుండు వాగ్వ్యాపారముచే శూరుఁడ నగుదునని త
లంచు నీవంటి యసమర్థులమాటలకు నుత్తరంబు లొసంగఁబూ
నుట మావంటి శూరశిఖామణులకు నిశ్చయముగాఁ దలవంపు
లే. కావున, పెండ్లామును జూదంబుపందెమున నోడిపోయిన
పౌరుషహీనుల మాప్రారబ్ధవశంబునఁ జూడవలసివచ్చినప్పు
డు మీమోములఁ జూచి యసుంబుపొందుటకన్న తలవంచు
కొని కూర్చుండుట సంతోషము.

ద్రౌప—ఏకవస్త్రను, పతివ్రతను యిట్లు నిండుసభను నిలువంబెట్టి,
నాప్రశ్నమున కొక్కరును జవాబీయకుండుట పాడియా? అవి
జితనగు నన్నిట్లుచేయుట సర్వసంపదలు నశించునని, యించు
కైనభీతివలదా? మాయాద్యూతంబున నోడుచుకొనఁబడితివ
ని, రచ్చ కీడ్పించుట సార్వభౌములకు మర్యాదా? నాయనా!
దుర్యోధనా! నేను దాస్యముచేయుట యావశ్యమని తోఁచిన

దా? లా ! నీకు గాంధారియొకటియు, నేనొకటియునా? నాకు పరాభవము తటస్థింపఁజేసిన, నీకు వధూనికను కాకపో వుదునా? ఈర్ష్యాసూయాలోభంబులు, రాజులకు క్షేమముకాదు. కావున మచ్చరగ్రస్తుండవై, మానవతీపరాభవకార్యము లొనర్ప యత్నింపకుము. ఈకార్య మపకీర్తి నీకు పొసంగించు నని తలంచుము. నన్ను విడిచిపుచ్చుము.

దుర్యో—ఓసి దాసీ ! ని న్నీధర్మోపన్యాసము లొనర్చుటకుగాఁ బిలుచుకొని రాలేదు. వాయెత్తక యూరడిగ మొనర్చుము. రాజను నిందింపకుము. ప్రభునిందకులు, రాజద్రోహ శిక్షకుఁ బాత్రు లగుదురని తెలిసికొనుము. న్యాయాన్యాయములు విచారించు తెలివి నీపాటి యెవరికి లేదని వీడిపోకుము. నీగ్రహాచారము చాలక ద్యూతమున నిన్ను పందెముపెట్టి యోడిపోవ మగలు దొరకినందులకు విచారపడుము. మఱియు నిట్టిదుస్థితి నీకెన్నఁటికిని గలుగకుండఁ జేయుమని దేవునిపైఁబడి యేడ్వుము. మమ్ములఁ దిట్టకుము. శ్లో. అసంతుష్టా ద్విజానష్టా స్సంతుష్ట ఇవపార్థివః॥ అనఁగ దొరికినంతటితో తృప్తినొంది యుండుట బ్రాహ్మణోత్తములకుఁ జెల్లునుగాని, రాజులకుమాత్రము శత్రువిజయమందు తృప్తికూడదని నీతిశాస్త్రజ్ఞులు శాసించుచున్నారు. కావున శత్రువిజయమునకై పాటుబడు మమ్ములఁ దిరస్కరించిన దండనార్హురాల వగుదువు. యోచించి మాటాడుము.

వి—పాండవోత్తములారా ! యీయాపదను తలుపక దీనస్థితి వేఁడుకొను పరిశ్రమంబున కుర్రం బోవంగక, చూచుచుండెద రేల ? నాన్యాయంబు వినుండు. శ్లో. వికోచనసుధన్వులను శాలు దిరుపదు కలదు. నా రోక్తమ్ముకసిం యుం బఠాయుం గాఢం

గోరి, తమలోఁ దాము, విద్యలయం దొకరికంటె నొకరధికుల
మని పెనఁగులాడి, యందులకుఁ దమప్రాణంబులు పందియం
బులుగాఁ గొని, యీవివాద నడపనయించుటకయి, అంగిరసపు
త్రుం డగుసుధన్వుండు, విరోచనుని తండ్రియగు ప్రహ్లాదుని
కడకుం జనిరి. అప్పుడు ప్రహ్లాదుఁడు మాధ్యస్థుఁడై, వారిరు
వురినిఁ బరీక్షించి, న్యాయమునకు భంగము కలుగకుండ, తన
కుమారునికంటె సుధన్వుండే విద్యాధికుఁడని నిష్పక్షపాతం
బుగఁ బలికె. సుధన్వుండు కుమారునియందు ప్రేమమైన
లేక, న్యాయంబుగ విమర్శించి పలికినందుకు సంతసించి విరో
చనునకు ప్రాణదాన మొసంగి చనియె. కావున మీర లోకని
దయకు భంగము కలుగునని జంకక, ద్రౌపదిప్రశ్నంబుల
కు త్తర మొసంగ యత్నింపుఁడు. శకుని చేసిన ప్రోత్సాహంబున
ద్రౌపదిని పందెము పెట్టుటకు ముందు, ధర్మజుండు పందెమొ
డ్డుకొని యోడిపోయెఁ గాన నప్పటికి దానొక్కఁ దాసుండు.
అట్టిదాసునకు పదంపడి మహారాజ్ఞి యగుద్రౌపదిని పంది
యంబు పెట్టనంతటి యధికార మెక్కడినుండి వచ్చినది. కా
వున ద్రౌపది ద్యూతవిజిత కాదు. ఆమె దాస్యంబునకుం ద
గదు. ఇది నానిర్ణయంబు. మఱియు సాధ్వీపరాభవము రాజు
లకు ముఖ్యముగాఁ గూడనిపని యని యెంచుఁడు.

దుశ్శా—ఓయవివేకీ స్వజనౌన్నత్యాసహ్యచిత్త! మూఢ! ఇప్పుడు
భీముండు పలికినపలుకులు వినుటకుఁ జెవులు లేకపోయినవా?
న్యాయమని దానిమగండే యంగీకరింప, యవనికాంతరహాస్య
చర్మపుత్రికాచందంబున నె, నెగురుకొనుచు జక్కట్లు దిక్కట
కేలవచ్చెదవు. ఇట్టిమాటలింకఁ బలికిన మాయన్న సహించి
నను నేనుమాత్ర మూరకుండఁజాలను. అధిగ్రహించి వాము

త్తకుము. నాసాహసము కనుంగొనుము. ద్రౌపదీపాతివ్రత్య మహిమ నగుపఱచెద. (అని ద్రౌపదిపైటను మెలివేసి లాగఁ బోవుచున్నాఁడు.)

ద్రౌప—ఆర్యులారా! పండితులారా! దోషజ్ఞులారా! న్యాయవేత్తలారా! ఈయాఁడుకుయ్యాలించుట యన్యాయమని తోచెనా? మీయందఱిహృదయములనుండి దయారసంబు పాఱిపోయెనా? అత్రత్యజనంబులలో నాఁడుబిడ్డలపై కడుపుతీపిగల పుణ్యాత్ముఁ డొక్కఁడైనను లేడా? దుర్మార్గుఁ డొక్కప్రాణిని నిష్కారణము హింసించుచుండ న్యాయ మిదియని చెప్పఁదగిన ధైర్యశాలురు లేకయుండిరా? భార్యయన భరింపఁదగినదని యర్థము తెలియని పరమమూర్ఖులీసభాసదులయి నేఁటికి ధర్మదేవత నాల్గుపాదములు విఱుగఁగొట్టి పడవైచిరా? వయసుచెల్లి తలయు గడ్డము నెఱసి న్యాయవేత్తలమని ధర్మశాస్త్రములు తలక్రిందుగాఁ జదివిన పండితపుంగవు లస్తమించిరా? లోకము గొడ్డుపోయినదా? ధర్మము వట్టిపోయినదా? ధైర్యసాహసములు దాచిపెట్టిరా? నీతి బీజంబులిందలి జనగర్భగోళంబులు చవిటిపర్రలై యంకురంబులు నశించినవా? ఏతంద్రులకైనను, ఏయన్నలకైనను, పుత్రికలును సోదరీరత్నములును లేరా? అంతఃపుర సంరక్షణాభిమానముగల క్షత్రియజాతి మగవారలు భరతదేశము విడనాడిపోయిరా? ఏనాఁడైన నేనీచజాతీయుం దుద్భవిల్లిన యాఁడుదానినైన నొక్క దుర్మార్గుఁడు, నరపశువు, మానభంగము సేయుచుండ నిట్లు చూచుచుండిరా? ఆఁడుదానిని పరాభవించుచుండ విలాసముగాఁ జూచుచు నాయుధధారులయి పౌరుషవంతులగు పురుషసింహులు కదలక మెదక

లక విగ్రహములవలెఁ గూరుచున్న ప్రతిమాప్రతిభాసితరాజ
రత్నములఁ గాంచ నాకడుపు మండుకొనిపోవుచున్నది. క్షత్రి
యాంగన, వరప్రసాదజనిత, జగదేకవీరుండని ఖ్యాతిఁగాంచిన
పాండుమహీపాలుని కోడలు, అరిజనకాలగడేరపవమాన
సమానపాండవపంచకపట్టమహిషి, రాజసూయాధ్వరాధ్వర్య
ఋజిన్నిర్మలీకృతవారిధారాపాతపవిత్రీకృతశిరోజ, ధైర్యవీర్య,
సాహసాలవాల, భ[illegible] సకలకార్యధురంధర ఒక్క
పౌరుషహీనునిచే, నొక్కదురాగతునిచే, నొక్కనరపశువుచే
నొక్క తృణప్రాయునిచే, స్త్రీ పురుషాదులకుఁ జెప్పుటకుఁ
జేయుటకుఁ జూచుటకు లజ్జాకరమై, మహాపాతకమై, ఘోర
నరకపాతహేతువగు కష్ట మందుచుండఁ జూచుటకీ సభ్యు
లంగీకరించుచుండిరి గదా! స్త్రీ యస్వతంత్ర మహానిర్బం
ధనిగళబంధితమై మానభంగ మందవలసినదియా? లేక
యాఁడుది స్వతంత్రించవలసినదియా? పరాభవసమయసం
జాతక్రోధజ్వాలలు, వినిర్గతంబు లగుచున్నవి. లోకంబులు
భస్మీభూతంబులగు కాలంబును, వంశంబులు నశించుకాలం
బును, క్షత్రియు లడగంటువేళయును, క్షత్రియక్షేత్రంబు
లు పాడగుకాలంబును, చిరకాలార్జితంబగు రాజవంశమర్యా
దాభూరుహంబు భగ్నంబగుయదను సమీపించుట చేతనే,
మీరందఱు సాధ్వీపరాభవావలోకనకుతూహలుల మయితి
మని మీహృదయంబుల నిక్కంబుగఁ దలంచుఁడు ఇంకమీ
కడుపునం బుట్టిన యాఁడుపిల్లలను, కిరాతులు, కొలఁదికాల
ములో మీయెదుట మానభంగము జేసి, కులభ్రష్టలను జేసి
వారల బలవంతముగ భార్యలఁ జేసికొనుచుండ, నభిమాన
రహితులయి, పరులకు లొంగి, పరాచారపరాయణులై,

పరపాలనాధోగాధంబునఁ గూలి, యధోగతి నొందుకాలము
భరతఖండవాసులకు రానున్నదని తలంచుకొనుచుండుఁడు. భా
రతీయౌన్నత్యము నేఁటితో నేలపాలయినదని మీవంశ్యులు
తప్పక యేడ్చియేడ్చి హతులగుదురని తలంచుఁడు. అయ్యలా
రా! పరాభవదందహ్యమానన్నై, పీఁడితనై, లజ్జావిరహితనై,
నిరస్తనారీసమయనై, ఆర్యులకు, శూరులకు మర్యాదభంగ
ములౌ వాక్యములు పలికియుంటినని నాపై కినుకవహించి
దేశవైభవమును, ప్రజాక్షేమంబును, నశింపఁజేయక నాపా
పము నన్నే నశింపఁజేయునని తలంచి నాప్రశ్నల కుత్తరం
బొసంగుఁడు. భార్యను పణంబుఁ బెట్టఁదగిన యధికారము
నాభర్తకుఁ గలదా? పరిపూర్ణముగా నాపై యధికారము
న్నచోఁ దాను రాజగానుండి పెట్టెనా? ద్యూతనిర్జితదా
సుఁడై నన్ను పణంబిడియెనా? నేను రాణినా? వరవుడు
కత్తెనా? (అని యొక్కఁడుకూ మూరకుండవలయును.) ఏమి
యెవ్వరు పలుకరా? కీర్తిని గడించుటలో గండరగండలై యొక
రినిమించియొకరు ముందంజవేయుధర్మవేత్తలు, ఆచారపరు
లు, ధర్మస్వరూపులు, పరాయత్తులయి స్వాతంత్ర్యత లేక పొట్ట
డు పొట్టకూటికి కెక్కడభంగముకలుగునో యని జంకి వంశ
నాశకుల యాజ్ఞాబద్ధులయి చిత్రప్రతిమలవలె నోరు మెద
ల్చ లేక సర్వప్రపంచసృష్టికిఁ గారణభూతురాండ్రగు స్త్రీ
జాతి నధోగతిపాలు సేయుచుంటిరా? ఇట్లుపేక్షించిన మీజి
హ్వాలు తృణభోజ్యపదార్థరసగ్రహణంఁ జేయఁజాలునా? మీరు
భుజించిన పదార్థంబులు జీర్ణంబులగునా? మీరక్తనాళము
లు బద్దలయి చిమ్మనగ్రోవివలె మీధైర్యసాహసౌదార్యశౌ
ర్యముల వెదజిమ్మి పంచముల పాలుగావించకుండునా? వార

లకు మీయాఁడిగఁపుకాండ్రుగారా? ఈపరాభవము నాకుమా
త్రమా? కాదు. నాకా? పురుషజాతికా? యోచించుటకు
మీహృదయములు నాశనము లయినవా? ఆహా! భరతదే
శమా! అమ్మా! భరతఖండమా! నీకడుపున నెంతనీచ
బుద్ధిగలవార లుదయించిరి.

ఉ. భారతదేశగౌరవము । పాడరఁ గాలము వచ్చె లేనిచో
సూరిజనాళి గుంపుపడి । చూచుచునుండఁగ నిట్లు దుష్టసం
చారుఁడు దుస్ససేనుఁ డొక । సాధ్వికురుల్ దొలివేసి యీడ్వఁగా
నోరు మెదల్ప జంకుచు గ। నుంగొనుచుందు రె బొమ్మలట్లుగాన్.

కౌరవవీరులారా! భరతమహాభిషక్శంతనులనాఁటినుండియుఁ బౌరుష
గౌరవంబులు గలిగి పరశురామగర్వనిర్వాపణచణుండయి
భారతకేసరియని యిప్పటిరాజచక్రంబుముందఱఁ బేరువడసి
ఫాలాక్షునైన లక్ష్యంబుఁజేయని బిరుదముగండై కురువంశా
లంకారుండగు భీష్ముండవతరించిన గొప్పవంశంబున జనించిన
మనకౌరవవీరులు తమయింటఁజొచ్చిన క్షత్రియాంగన, శు
ద్ధాంతనివాసిని పరిషన్మధ్యంబున కీడ్చి తెచ్చుటా!

ఉ. దీవుల నేడిట న్విజయ। దీక్ష జయించుటో వీరశౌర్యల
క్ష్మీవిభవంబునం ద్రిదశ। శేఖరు గెల్చుటో భూరిశక్తి వి
ద్రావితవైరులౌటో సభ । ద్రౌపది నీగతి నీడ్వనెంచు ట
య్యా విన ధార్తరాష్ట్రులమ। హాయశ మీభువి నిండియుండగన్.

ఆర్యులారా! సభలో నింతసేపు నిర్భయముగా నుపన్యసించుట స్త్రీ
లకుఁ దగదని తెలిసియు దురాగతాహతనారీసమయంబుగల
దాననగుటచే వినువారికి విసువుగనుండినఁ జెప్పనుంకించుచు
టి. పదినిముసముల కాలమిందు. విద్యాధికులయి, పరాక్రమో
న్నతులయి, ధర్మవిదగ్రగులయి, పౌరుషగ్రామణులయి, బలవ

జ్జనవిఖ్యాతులయి, ధనుర్వేదకేసరులయి, వీరవరాగ్రయాయు లయి, పరోపకారపారీణులయి, అభయదానకంకణచణత్రా ణులయి, విఖ్యాతిగాంచిన నాభర్తలు కాలవైపరీత్యముచేత నో, మత్ప్రాగ్జన్మకృతకర్మమాయాపలాసినీకిలికించితు లగుట చేతనో, శత్రునిర్మితమాయాసాగరనిర్మగ్ను లగుటనో, అపూ ర్వంబుగ భార్యను జూదంబునఁ బణంబిడి యోడినను, సాహ సంబున కాలవాలమై, బుద్ధిబలవిశేషబీజాంకూరమై, జగదు త్పత్తిస్థితిలయాదులకుఁ బంటచేనయి, పురుషయశోలతలకు మూలకందమగు భార్య స్వతంత్రించి మానము కాపాడుకొన వలసిన కాలముకావునఁ బ్రాణాధికంబగు గౌరవాభిరక్షణ్యా క్షణకాలము నన్ను విడువుఁడు. మగవాఁడే స్వతంత్రుఁడనుకొ నకుఁడు. రణప్రాంగణంబు నారీమణు లలంకరించఁగూడదని తలంచకుఁడు. మీచేతుల నుండుకత్తులే పనిచేయునని యో చింపకుఁడు. సమరంబునకు సాధ్వు లసామర్థ్య లనుకొనకుఁడు. అబలలు ప్రయోగించుబాణంబులు పురుషప్రాణములు దీ యఁజాలవని యెంచకుఁడు. సభాసదుల కధర్మకళంక మంటు కుండుఁగాతమని గోపాలునిం బ్రార్థించి,

మ. సతికిన్ మానముదూలు వేళఁ బతియాజ్ఞం గోరకే దుష్టసం
తతిమాయించుట శాసనంబగుడు గానన్ వీరపత్నీకర
స్థితఖడ్గాంచితతైక్ష్ణ్యధారగన సంసిద్ధల్ ద్వరన్ రండు రా
ట్తతిగాంతుల్ తెగఁగోతు లేనియెడలన్ దాస్యంబు నేసల్పెదన్.

క్షత్రియులకు యుద్ధజయము లోకద్వయకీర్తిదాయకము. కావున నా భర్త జూదంబున మీకోడిన రాజ్యంబును క్షాత్రంబున నేను సంపాదించుకొని గాణినయ్యెదను. చేతకానిచో దాసినై వర పుడుతనంబు సేసెద.

భీష్మ—ఎంతదుష్కాలము సంప్రాప్తమయినది.

మ. సుదతీ నీవనుమాటలన్నినుచు భీష్ముం డిప్డు ప్రాణంబులన్
వదలన్ జాలకయున్నఁ జచ్చినటులే ; భావించు దుర్యోధనుం
డుదయం బొందిననాఁడె ; కౌరవకులోన్మూలంబు గావించునం
చెద నూహించిరి పెద్ద లిప్పుడదియే యేతెంచె నీవాక్కతిన్.

తల్లీ ! యంతఃపురాంగనలు వీరశిఖామణులయెదుట గౌరవసంరక్షణార్థము రణప్రాంగణంబునకుఁ బిలుచుచుండ వినియు, చూచియు, నిర్జీవప్రతిమవలె ననదలమై, భవిష్యత్కాలిధర్మంబుల స్మరించుకొనుచు, మావిషాదంబు దిగమ్రింగుచు నుండవలసినకాలము వచ్చినది. అధర్మముఁ జూచుచు నిట్లు జీవించియుండుమని బ్రహ్మ మూఁడుపంక్తులు పెట్టి మానుదుట వ్రాసినాఁడు. స్వయదూషితులగు ప్రభువులకడ పండితుల మానసాకరమున నుత్పన్నములగు నీతిరత్నములు కూపాంతరపాతంబులగు ముత్యములచందమున నిర్ప్రకాశములయి యరణ్యవాసులకడనుండు కుంభికుంభవినిర్గతంబులగు ముక్తాఫలంబులవడువున నిరర్థంబులుగాక సార్థంబులగునా ? స్వాహంకారులగు రాజులచేఁ బరిపాలితంబులగు రాజ్యములు ప్రజలకు కారాగృహములవలె బంధహేతువులుగాని బంధనిర్ముక్తసాధనములుగావు. అట్టినిర్బంధవిముక్తి గోరిన నిప్పుడు కాదు. భవిష్యత్కాలమునందైన శాంతినివహించిన మీవంటి సాధ్వులవలననే కాని దేశంబు శుభస్థితిలోనికి రాఁజాలదు. నీ వాగ్రహించిన మేమేకాదు లోకంబులు భస్మంబులు కావా ? ఒకప్రాణి సహింపఁజాలని కష్టము లనుభవించినను పలువురు సుఖమందుట నాప్రాణికి క్షేమము గాని, ప్రారబ్ధానుగతమగు తనకష్టమునకై పరుల నిందించుట లుత్తమధర్మములు కావు. సాధ్వీ ! విధి

విధాన మప్రతిహతమని తలంచి ధర్మ మారసి వర్తింతువని యింతవట్టు పలికితివి. ధర్మస్వరూపుండగు ధర్మజునికన్న నీ కేడులోకంబుల ధర్మనిర్ణయంబుఁ జేయువారు కలరా? తల్లీ! యాతఁడే శకునికైతవంబున బానుంగువడినచిత్తంబు గలవాఁడై దురోదరగ్రస్తామయపీడితుండై యుండ నొరులు వాయెత్తఁగలరా? కురురాజసభాంతరాళంబున విదురున కొసఁగిన నివాళపక్ష్యరంబులఁ గనుంగొని నూరాడువారెవ్వరు? ప్రాక్తనకర్మఫలంబుఁ దప్పింప నేరికి వలనుపడు? మఱియుదురభిమానగ్రస్తులగువారు హితులహితవాక్యములకుఁ జెవియొగ్గుదురా? ప్రాణమునకంటె నెక్కుడగు మానసంరక్షణార్థము స్త్రీలు స్వతంత్రించుట యధర్మము కాదని నిశ్చయముగాఁ జెప్పెదను. కాని, భర్త యసామర్థ్యుఁడయిన నట్లుచేయుట యుత్తమము. నీభర్త ధర్మబద్ధుఁడయి అట్లూరకుండెను గాని యశక్తిచేఁ గాదు. భర్తసంరక్షించుచున్నధర్మమును కాపాడుటయే భార్యకు పరమధర్మము. ప్రారబ్ధములగు కర్మలు భోగనాశనములుగాని యన్యమార్గధ్వంసితములు గావు. అట్లుఁడో, యనట్లుఁడో భర్తను, జేనినిఁ దిరస్కారముగాఁ బలుకుటకన్న మానము వహించియుంట నీవంటి యిల్లాండ్రకు శ్రేయస్కరంబు సుమా! ఇది యీ భీష్ముఁ డుపదేశించుట కాదు. జ్ఞాపకము సేయుటకా దలంపుము.

ద్రౌప—(తలవంచి మొగమున కోపము అసహ్యము చూపించుచు నిలుపవలయును.)

కర్ణు—గడుసుపెండ్లా మన నిట్లుండవలయు. రచ్చ కెక్కి నిర్భయముగ వ్యవహారములు నడుపఁగల్గు పడఁతుల నంతఃపురబంధనాగారముల నిర్బంధించిన పిచ్చిమెత్తిన వానరములవలె బహి

స్సంచారపరాయణస్వాంతులయి సమయము వచ్చిన వీధిని బడ నెంతురు. సహజముగ నీవు వీరపుత్రివందమా? వైరికర కృపాణస్వాధీనీకృతశిరోజుండు దుపదుండు లోకవిదితపరా క్రమవంతుఁడు కదా? వీరపత్నివందమా? ద్యూతనిర్జిత దాసులై, దురభిమానవిఫలీకృత శౌర్యులగు పాండవపంచక పట్టమహిషివి గదా? ఓసీ! పాంచాలీ! దూరీకృతాభిమానవై, నిరంకుశసాహసప్రకటనపాండిత్య నిపుణవై, సభాస్థలంబున నాట్యంబుసల్పు నటకాంగనవలె, త్రిప్పుకొనుచు మహంకాళి వలె కేకలు వేయుచు, ఖడ్గము పట్టెద నన్నమాత్రముననే శూరాగ్రేసరులు దిగులొందెదరని యెంచితివికాఁబోలు! ఓ పంచభర్తృకీ! హృచ్ఛిద్రతాస్యమనోవ్యథచే పరిషద్రంగ మధ్యమాట మఱచి వీరవరుల సూదవిద్యావిశారదులగా నెంచి నిర్లక్ష్యముగా మాటలాడసాగితివి. లజ్జాకరము. పాపము నీవాక్యములు నీభర్తను మఱింత పౌరుషహీనునిగాఁ జేయు చున్నవి.

మ. వెరపా? లజ్జయ? మానమా? తగవ? గంభీరప్రలాపంబులా?
పరధర్మాన్వవిచారణంబ? సభలా? వాక్యార్థమా? యుద్ధమా?
తరుణీ! భారతదేశగౌరవము దగ్ధంబంద నిట్లాడెదే
కురురాజన్యునిఁ బ్రేరుతే భర్త యిఁక నీకు న్నాకు శాతోదరీ!

పాపము పిడుగువంటి దాస్యవ్యాపారము నీతలపై నిడిన భర్తలపై జూపఁదగు వ్యావహారపారుష్య మీసభాసదులపై చూపించి దుఃఖమును శమింపఁజేసికొన నెంచితివి గాఁబోలును. నీతోడ రణవ్యాపార మొనరింప దురోదరనిర్జితసాహంకారు లగు పాం డవులకన్న వినిర్గతమందాత్ము లెవ్వరు? ద్రోణశిష్యాగ్రయాయు లయిన భీమార్జునులనే రమ్మనుము. వరువడితనంబునకు

నడుము బిగించుకొని దాసినగుటచేఁ గత్తిబట్టుటకధికారము లేదు గాని, సమ్మార్జనీమూలంబు గ్రహియించి పరాగచయంబులపై పరాక్రమంబుఁ జూపింపుము. యువరాజా! వెనుకంజవేయుచున్నావేమి ?

దుశ్శా—ఓసి ! పశువా ! దాసివై యుండి రాచపోకడలు మానక తేనిపై కారులఱచుచుంటివి. నీశాపనాకారములకు జంకి, నిన్నువిడుచు పందలిం దెవ్వరును లేరు. నీవు సత్యవాదినైన నీకీ యైదుగురు మగలవాంత యేమి? నీ కీగతి యేలపట్టెను? మానహీనులయి నీమగలు ద్యూతమున నోడి నిన్ను మాస్వాధీనమొనర్చిరి. నిన్ను వివస్త్రనుఁజేసిన నష్టపడు మగవానినిఁ జూపుము. నీకు దిక్కుగలిగినఁ జెప్పుకొనుము. మయసభాభవనమున మాదుర్యోధనసార్వభౌమునిఁజూచి నవ్విన చిలుకనవ్వను సభాసదులు చూచెదరు. మఱియొకమా ఱిప్పుడు నవ్వుము. పౌరుషముగల మగవాఁడు కనులయెదుట భార్యను పరాభవించుచుండ, ధర్మము ధర్మముని యోర్చుకొను మగవాఁడుండునా ? పౌరుషహీనుల చెట్టఁబట్టిన మగువగతి యింతదిగా నెఱింగి దేవుఁడు నీమొగమున బహుభర్తృకవు గన్నని వ్రాసినాఁడు. నీకర్మ బాగుగానుండిన నొకపౌరుషవంతు నాశ్రయించుము.

భీము—(కోపముతో) ఆర్యులారా! కురువృద్ధులారా! నిరంతర సత్యనిష్ఠాగరిష్ఠుండగు యుధిష్ఠిరసోదరుం డగు భీముండు పలుకుపలుకులు సావధానులై యాలింపుడు. ఈయంధనృపాలాధిష్ఠితంబైన సభాంతరాళంబున జరుగుచున్న మహాఘోరపాతకంబుఁ జూచి మైమరచుటచే నిందిియంబు లస్వాధీనంబులయి మానసము దుఃఖాక్రాంత మగుటచేతను, పతివ్రతా

పరాభవసందర్శన కుతూహలులయిన దుర్మదాంధుల సన్ని
ధానంబున ధర్మాతిక్రమణం బొనరించినఁ బెద్దలు నన్ను
క్షమియింతురను నమ్మకమున యింతదనుక యుధిష్ఠిరాజ్ఞాపాశ
బద్ధుండనయ్యెను, జాయాపరాభవ నిరీక్షణకోపాశుశుక్షణి
విక్షేపరూక్షజ్వాలాక్షిపుఁ డగుభీముఁడు, గర్వోద్ధతుండయి
అగ్రజాజ్ఞాలానబంధంబు పెకల్చుకొని విడఁబడి సాహసంబుఁ
జూపుచున్నాఁడు.

ఉ. అన్న సహింపఁజాలను మహాగ్రహవేగము ధర్మపద్ధతుల్
మన్నయిపోవనీ మఱియు । మాడని నుడని లేకపోవనీ
కన్నులఁజూచి భార్య నొక । కష్టుఁడు బట్టలు విప్పుచుండ భీ
మన్న సహించునే రిపుని । మాడ్చుఁడె? వానిప మంటఁగల్పఁడే?

ఆహా! యేమి కాలవిపర్యాసము. ఏమహాసాధ్వి పతివ్రతాకులాలం
కారమై మధ్యమలోకజనంబులకు ప్రాతఃకాలస్మరణీయలగు
సాధ్వీలలామలలో గణియింపఁబడెనో, ఏయపాంసులాశిరో
మణి వేదమంత్రహుతహవ్యవహనోద్భవమై, యయోనిజ
యన జగంబుల ఖ్యాతిఁగాంచెనో, ఏసతీరత్నంబు పాండవపం
చకపరివేష్టితమై, అసూర్యంపశ్యమై దిగ్విజయపరాక్రమో
పార్జితభూపాల శిరోవిలసిత కిరీటకోటీరస్థగిత రత్నమరీచిభూషిత
పాదారవింద మై ప్రకాశించెనో, ఏయువతీరత్నంబు రమా
రమణ పాదారవిందాక్రాంతమనీషమై చెలంగెనో, ఆపతివ్ర
తాతిలకము, ఆవీరపత్ని, ఆవిద్వత్కాలరాత్రి, ఆవిదుషీమ
ణి, ఆర్తయై, అనాధయై, కృపణయై విలపించుచుండ,

ఉ. ఆవనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్ర వారిధా

రావళి చేసి పావనము లైన శిరోజములన్ గ్రహించి పా
పావహుఁ డీడ్చి తెచ్చెను భయంకరవృత్తిని జూచియుంటిరే!

వాతవేగావధూతం బయిన పతాకవలె దుశ్శాసనాకృష్టవేణియై.
వివర్ణయై, కోపలజ్జాపరవశయై, యగతికయైన భార్యను జూచి యూరకుండిన పురుషుండు నికృష్టుండు గావున దుశ్శాసనకంఠవిలుంఠనం బొనరించుచున్నాఁడు. (అని మొగురుచున్నాఁడు.

ధర్మ—(భీముని పట్టుకొని యాపుచున్నాఁడు.)

భీము—భవదాదృతధర్మోపదేశార్గళంబు రిపువధోద్యోగవిస్మృతమానసుండనైన నన్నరికట్టుచున్నది గావునఁ గాలనిరీక్షణ మపేక్షించి ప్రతినఁ జేసెద వినుండు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలుం దుశ్శాసనున్ లోకభీ
కరలీల న్వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర మూర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఉ. కొట్టెద ఱొమ్ము వ్రిద్దలుగ గుండెలు కండలతోడఁ బండ్లచేఁ
బట్టి పెకల్చి రక్తమును పానము సేసెద లోని ప్రేవులన్
జుట్టెదఁ గంఠమాలగ నెనుం గనువారల కద్భుతంబుగాఁ
బట్టి రణాంగణంబునను పాతకురక్తము మేనఁ బూసెదన్.

రక్షఃకులపాంసనుండగు హిరణ్యకశిపుని భీకరకరానగ్గళవినిర్గతజ్వాలాభీలుండగు నృసింహుండు నఖంబుల వక్షఃకవాటంబు వ్రిద్దలు సేసినట్లు, ద్రౌపదీకేశాంబరాకర్షణమహాపాతకిం బట్టి హృదయకవాట నిర్భేదనం బొనర్చి, రక్తమును పంచదారపానకము వలెఁ బొట్టనిండఁ బట్టించెద. అల్పజలాశయంబున, నీచులగు జెస్తలు జిల్లిచేపల దేవినట్లు దుశ్శాసనోదరంబుఁ గరద్వ

యంబునఁ గుళ్ళగించి మాంసలేశంబులం గలసిన రక్తంబు కాశ్మీరదేశాగతకుంకుమపంకిలంబగు చందనంబు వడువున నా మెయినిండఁ బట్టించెద. దుష్టదురాగత దుశ్శీలులగు కౌరవ సోదరులు రారాజు దుర్యోధనసార్వభౌముండు సూచుచుండ మహాసాధ్వీశిరోజాకర్షణావలిపుండగు యువరాజాధమున్బట్టి యీగదచే పంచాస్యంబు మదగంధసింధురకుంభంబువడు వున వీనితల పక్కన పగులఁగొట్టెద. ఇందులకుం దప్పినఁ బితృపితామహుల గతికిం దప్పినవాఁడను. గురుజనావధీరిత సంజాత పాపలోకంబుల కేగువాఁడ. మఱియు నోద్రౌపదీ! వెఱవకుము. కోపావేశంబున మఱచితి. ఇటు వినుము.

చ. ముడువకు నీదువేణి నిఁక మూర్ఖుని, । నీచుని, దుస్ససేను భీ
ముఁడు వధియించి రక్తమున । ముంచిన చేతుల నీశిరోజముల్
వడివడి జిక్కుఁదీసి ముడువంగల । భీముఁడు చూడు మాటఁ ద
ప్పడు సతి ధర్మజాజ్ఞ నిటు । వ్యర్థుఁడుగాఁ గనుపట్టు వీరుఁడై.

దుశ్శా—అశక్తదుర్జనవాక్యంబుల నలుక నహింపరాదు. నాపనిలో నేను జాగరూకుఁడ నయ్యెద. అస్వశూన్యంబులు వ్యర్థఫలం బులు గదా యున్మత్తప్రలాపంబులు? ఓసి దాసి! రా! (అనివస్త్రము నూడఁదీయ లాగుచున్నాఁడు.)

ద్రౌప—(వస్త్రమును పట్టుకొనుచు విచారముతో) ఆహా! తుదకు నాయవస్థ విషమస్థితిఁ జేరెను. సభ్యులుపేక్షించిరి. భర్తలా కాలనిర్దిష్టబలాహంకారులైరి. భీష్ముండంతటివాఁడు దుష్టరా జునకు నొక్క చెప్పఁజాలక నన్నే మందలించుటకై ప్రారంభిం చినాఁడు. ఇప్పుడు నేను పతివ్రత నగుదునా? కానా? సందే హమేల? నేనావ్రతమును పూర్తిగా నాచరించుటలేదా?

లోప మొనరించితినా? లోప మొనరించకుంటినేని, యీసతీ ధర్మమే నాకు శరణ్యము. ఇంక నాకు వేరు దిక్కేల? యుద్ధమేల? ఈసభ్యులతో ప్రసంగమేల ? ధర్మము వేదచోదితమై, వేదము సత్యమై, జగన్నాటకమాయాయవనికాంతరవర్తి యగు పరమాత్మయే శ్రీకృష్ణుండయిన, ధర్మమున నే సూర్యచంద్రాదులు తిరుగుచుండిన, బంచభూతసంచయవ్యాపారములు ధర్మముననే జరుగుచుండిన నట్టిధర్మరాశిలోనొక్కటియైన సతీవ్రత మాచరించుచున్న నన్నీమూర్ఖులు, యీకుహనాస్వరూపులు, యీదయాశూన్యులు,యీనీచు లొనరించుపరాభవమున నాప్రాణమానములకు నీపత్ప్రాతము నైపరీత్యము సంభవించిన సూర్యచంద్రాదుల గమనంబులు వ్యత్యస్తములు కావా? భూమ్యాకాశము లేకమయి నన్ను ముంచివేయవా? గిరులు సపక్షంబులై యెగిరి నాతలపైఁ బడవా? మారుతుండు స్వస్వరూపంబులు వైకొని నన్ను లోకాంతరంబు సేర్పఁడా? సప్తజిహ్వుండు తీవ్రజ్వాలలం బరపి నన్నుమాడ్పఁడా ? సకలప్రాణిహృదయాంతర్వర్తియై, సంసారసాగరతరణోపాయతరణియై, ఆర్తత్రాణ పారీణుఁడై, అనాథజనరక్షణుం డయి విశేషించి నాకు సోదరుండయిన శ్రీకృష్ణుఁ డుపేక్షించునా? కృష్ణా! భర్తృపాదసేవయే పరమైశ్వర్యంబుగాఁ దలఁచి మనోనాథుని పాదతీర్థమె గంగాతోయంబుగా నూహించి, పతిసందర్శనంబే పరబ్రహ్మదర్శనంబుగా భావించి, యాత్మనాథు సుఖదుఃఖంబులు నాసుఖదుఃఖంబులుగా నెంచి, జీవితేశునివాక్కులు వేదవాక్కులుగా స్మరించి, రేయుంబవళ్ళుతలచునప్పుడు, చెప్పునప్పుడు, చేయునపుడు పతిసేవా పరాయణురాలనయితినేని దుర్మాదాంధుల సాహసికవ్యాపారంబుల

లోకములు భస్మములు కావా ? పుణ్యలోకంబు లల్లాడవా ?
బ్రహ్మాండములు దొర్లవా ? సూర్యుండు సర్వదా యస్తమింపఁడా ? యమలోకంబు వడంకదా ? ముమ్మూర్తులు పసి
పాపలు కారా ? శత్రువులు నశించరా ? శ్రీమహావిష్ణు
వవతారంబు లెత్తఁడా? ఇట్టివిపరీతంబులు సృజించిన పతివ్రతల
పేరులు నాశనములు కావా? ఈదురాత్ముఁడు, నాకు దిక్కు
గలదేని చూచుకొమ్మనిగదా వస్త్రము లాగుచున్నాఁడు. మా
మకీనహృదయాంతర్వర్తియగు పరమాత్మ శ్రీకృష్ణుఁడు భగ
వానుఁడేదిక్కు; భక్తపరాధీనుండు దిక్కు గాఁడా ?

మ. బలవంతు ల్గుణవంతు లార్యజనసే । వాతంత్రిమర్మజ్ఞని
స్తులధీమంతులు వైరివీరకులసం । స్తోమాంతకాభు ల్పతుల్
చలమూనన్ దమభాగధేయము సభన్ । జాయాపణద్యూతసం
చలితాత్మార్థవిగర్హ్యులైరి గను కృ । ష్ణా! దీనసంరక్షణా !

మ. ఎవరిం జీరఁగనేర్తు రక్షకులు నా । కేరీ దయంబ్రోవ ది
క్కెవరీ ఘోరపరాభవార్తులకు నె । ట్లే దప్పుదున్ జాలిదా
ల్పవె కాపాడవె దుఃఖమార్పవె దయ । న్పాలింపవే దీనబాం
ధవ ! యార్తావన ! ద్వారకానిలయ ! । కృష్ణా! దీనసంరక్షణా!

మ. ఖలుఁడీవేళ సభాంతరాళమున వీ । క న్బట్టి నాకట్టుబ
ట్టల విప్పం జతనంబు సల్పు నృపసం । త న్మాన్పఁగా లేక భ
ర్తలు భీష్మాదులు చూచుచుండి రిట నా । ర్తత్రాణపారీణ చె
ల్లెలు దుఃఖాబ్ధి మునింగె, నీమదిని జా । లింగొల్పు కృష్ణా! హరీ!

శా. హాకృష్ణా! జగదేకబంధు! సదయా! । యార్తార్తినిర్వాపణా!
లోకారాధ్య! మహాప్రభూ! నతదయా । భూ! దీనమందారమా!
నీకన్నన్ గతిలేదు ద్రౌపది మహా । నీచస్థితిం జెందె వే
సాకన్ రమ్ము దయాబ్ధి! ద్వారకపురీ । సంస్థాన కృష్ణా! హరీ!

శ్లో॥ నందాదిగోపజనమందార మంతరిత కుందాదిమూల్యానికరం
మందాకినీసలిల బృందాళిరూషిత సునందామృతైకచరణం
బృందారకప్రముఖ సందారితారిఘనబృందాటవీదహనదం
వందే కృపాబ్ధి తవ పాదారవింద లసదానందపాంసుపటలం॥

ఏమి, నాకు దిక్కు గలిగినఁ జెప్పుకొనవలయునా! ఓయి! నాపాతివ్ర
త్యమే నాకు దిక్కు. అంతకన్న బలమగు దిక్కుగలదా? అది
చాలదా? చూడు. నీవు వ్యర్థఫలుండ వయ్యెదవు.

మ. హరియో శంకరుఁడో విరించియొ సుధా। హారాధినాథుండో? ని
ర్జరులో సూర్యుఁడొ చంద్రుఁడో యెవరొ వ। స్త్రం బక్షయంబంచుని
త్తఱి నామానము గావరారొకొ దురా। త్మా విప్పుదో వస్త్రముల్
వెరపా సాధ్వికి నీకు చేతనగునా। విప్పంగ నావస్త్రముల్?

మ. సతినై కృష్ణపదాబ్జభృంగమతినై। సత్యవ్రతాచారసం
గతినై భర్తృమనోనుకూలగతినై। కాపట్యరాహిత్యస
ద్వ్రతినై యుంటిననేని ద్వారకపురీ। వాసుండు శ్రీకృష్ణుఁ డీ
స్థితి నామానము గావ నక్షయముగా। చీర ల్వడిగా బంపఁడే.

శా. పాతివ్రత్యము ధర్మమై యదియు నే। పాలించుచో సత్యమై
చేతం జెప్ప మనోధవార్చనకథా। సిద్ధాంతకల్లోలినీ
యాతాయాతరహస్యవీచికల నె। య్యంబొప్ప దూఁగాడు వి
ఖ్యాతింగాంచిన నే వివస్త్రనయినం। గర్గోలుగావే భువుల్.

(అని విస్మృతిఁ జెందుచున్నది.)

దుశ్శా—(కొన్ని బట్టలు విప్పి) ఓసిదాసీ! ఇందునకా ప్రాతిగామిని
నాలుగుమారులు త్రిప్పినది. గుడ్డపై గుడ్డ కట్టుకొనుటకా?
నీమాత్రపుగారడితనము తెలియనివా రెవరు? ఘురనీతలపరి
శ్రమమాంసలభుజార్గళుం డగు దుశ్శాసనుండు వస్త్రములు
విప్పఁజాలక పోవఁడు. ఎన్నిబట్టలు కట్టితివో చూచెద.

ద్రౌప—నావస్త్రమును హరించు చుంటివా. హా! దయామయా! నామస్మరణమాత్రభస్మీకృతపాపసంచయా! అయోనిజనై, వీరపుత్రినై, వీరమాతనై, ధీరవీరపత్నినై, భవత్పాదారవిందార్పితమానసనైన నా కీకష్టకాలంబున, నీయాడుపడుచు సభాంతరాళంబున మానభంగమునొందుచుండఁ గాపాడవా? ఓ నందనందనా! మానము—ప్రాణము—పరాభవము—పరాభవము—(అని నిశ్చేష్టితురాలగుచున్నది.)

దుశ్శా—నీప్రార్థనలకు దేవుఁడు దిగివచ్చుచున్నాఁడు. (అనివిప్పుచున్నాఁడు.)

కర్ణు—ఓయదృష్టహీనురాలా! నీయిడుములు కనులారఁ జూచినకొలఁది నా మనము మిగుల ఖేదమునొందుచున్నది. గొప్పయింటిబిడ్డవు. సిరిగలదానవు. పాప మాగాండీవిచేఁ బరాభవింపఁబడిన నీతండ్రి తనమానసంరక్షణార్థ మీపాండవుల నల్లుండ్రఁ జేసికొనఁదలఁచి నిన్నిద్యూతనిర్జితదాసులగు మానహీనుల కంటఁగట్టినాఁడు గాని, నీరూపురేఖావిలాసములకు, నీధైర్యసాహసములకు, నీ నేర్పరితనమునకు నయిదుగురుభర్తలవరించుటకంటె సార్వభౌమ రాజాధిరాజ బిరుదాంకుఁడై, శూరవీరమిత్రమండలుండై, సకలసంపదలచేత భూలోకదేవేంద్రుఁడై, ద్యూతమున నిన్నుఁ బందెము వెట్టక తా నోడక శత్రువైభవముల నోడిచి కొనిన రాజచూడామణి నొక్కరిని భర్తగా వరించుట పట్టపుదేవిగానుండుట నీకు క్షేమము సుమా. సభాంతరాళమున క్షత్రియాంగన స్వతంత్రించి వివాహమాడుటకు ధర్మశాస్త్రము లనుజ్ఞ నొసంగినవికదా.

దుర్యో—(ద్రౌపదికిఁ దనతొడపైఁ గూర్చుండమని సంజ్ఞఁ జేయుచున్నాఁడు.)

భీము—(కన్నులెఱ్ఱనువడఁ జూచి) ఓరి మాయాద్యూతసమాగతద్రవిణమదాంధ ! కౌరవాధమా ! అగ్రజాజ్ఞాబద్ధు లయిన భీమాదుల నశక్తులుగా నెంచి నీ వొనరించుచున్న నిష్ఠురంపుచేష్టలనిష్టంబు నీ కొనంగునని స్పష్టముగా నమ్ముము. సభాసదులారా ! అధర్మావలోకనకుతూహలస్వాంతుండగు గ్రుడ్డిరాజు కడ నిర్భయుంబుగ దుష్టవ్యాపారపరాయణుఁడగు సుయోధనాధముం గూర్చి వీరసింహుండగు భీముండు వలుకు ప్రతిజ్ఞ నాలింపుఁడు. ఇట్టిప్రతిన మీ రెన్నఁడు వినియుండరు. ఇఁక ముందు వినఁబోరు. మఱియు, నీప్రతిన భూతకాలవీరులకు సహపాఠియై, అధునాతనవీరకేసరిశిరఃకిరీటాలంకారమై, భవిష్యద్భారతవీరుల కాచార్యరూపంబై, అత్రత్యశూరులకు భయంకరంబై, శత్రుప్రతాపాగ్నిప్రజ్వలనంబై, పౌరుషోత్సాహకరంబై యొప్పుచుండుఁ గావున, దత్తావధానులు గండు. వినుండు: న్యాయపథానువర్తినియై నందనందనపాదార్పితహృదయాబ్జాతయై ధర్మవిశేషపుంజీకృతనవీనాకృతియై సభాంతరాళప్రకటీకృతసాధ్వీధర్మవిభవాభిరామయై చెన్నారు పాంచాలిని, అయోనిజను, అసూర్యంపశ్యను, న్యాయసభనిర్భయంబుగ భర్తృసన్నిధానంబున అధమకులసంజాతప్రబోధంబున రాజశబ్దమాత్రాంధీభూతచిత్తుండయిపాండవపట్టమహిషిని తనతొడపైఁ గూర్చుండుమని కనుగీటుచు సంకాస్ఫాలన మొనర్చు దుర్యోధను నాయోధనంబున నెల్లరు చూచుచుండ,

మ. కపటద్యూతసమాగతద్రవిణదుష్కాదంబరీపానమ
త్తపరాధీనత ద్రౌపదిన్ గురువుపై దార్పంగ యత్నించు నా

* కుపితోత్సంగ మరాతికంఠవిదళత్కోష్ణస్రవద్రక్తస
ల్లపితోగ్రాగ్రగదాభిఘాతములఁ జీల్చక సేతు నే నాజిలోన్

చ. ధనబలరాజ్యసంపద మదప్రథితప్రభవస్మయుండు దు
ర్జనసహవాసనాశితపరాక్రమజిహ్మమనస్కు రాజప
త్నిని దనయంకభాగమున నిల్వుమటంచును చూపు దు
ష్టుని రణమందురం గుఱువు చూర్ణముఁ జేసి వధింతు మద్గదన్.

మఱియు వైరిగళబడిగాయమానమదీయబాహుదండపరివర్తితగదా
దండాభిఘాతంబున ఆయంకంబు పోంకంబు వాపెద, ఆతొ
డ పొడిసేసెద, ఆకురువు నురుముఁజేసెద. ఆయుత్సంగంబు
విచ్ఛేద మొనరించెద. ఆయూరువు కోరివేసెద. ప్రాణంబు
తోనున్న నీదురభిమానితొడలు విరిగి కొట్టుకొనుచుండ రణ
రంగంబున,

చ. తొడలువిఱంగి రక్తమున దొర్లెడు దుష్టునిఁ గారవేసు భీ
ముఁడు కడకాల వేగ శిర మూఁజెకఁదన్నుచు ఛీ దురాత్మ దు
ష్టుఁడ మును కృష్ణకున్ దొడచుజూపిన దానిఫలంబుఁ బూర్తిగా
గుడువుమురా యనంగ నిదుగో సభలో శపథంబు సల్పెదన్.

ఇందులకుం దప్పితినేని మాతృస్త్రీపమాగమదోషం బనుభవించు
వాఁడ. (అని యన్నగారి ముఖము చూడవలయు.)

కర్ణు—అవును. పాపము శక్తి లేదు. భార్యాపరాభవముఁ జూచి
సహించలేడు. మాటలచే రోషమును వెల్లడించుకొనక
తప్పదు.

దుశ్శా—ఓసి గారడికత్తియ! ఎన్నిగుడ్డలు చుట్టినావె. దిసిమొల
తో నిలునఁబెట్టెదనులే; కులుకకు.

---

* (కపటోత్సంగపరాతికంఠదళనోత్కంఠతోష్ణ)

సభ్యు—ధిక్. ధిక్. పాపము- ద్రోహము- వినాశము- వినాశము.

ధృత—ఏమి యీకలకలము!

గాంధా—నీపెద్దకొడుకు దుందుడుకుతనము. విదురుని పిలిచి విచారింపుము. నాహృదయము చేయిపెట్టి కలఁచినట్లున్నది. వంశమునకు చేటు మూడునట్లున్నది.

ద్రోణు—నాయనా! వృకోదరా! పతివ్రతాపరాభవాగ్ని చెలరేఁగినది. కౌరవవంశవినాశపిశునంబు లంకురించుచున్నవి. దుష్టపథానుయాయులగు ధార్తరాష్ట్రుల శయ్యాగృహంబులఁ గాకఘూకఘూత్కారంబులు సెలరేఁగుచున్నవి. కౌరవస్త్రీహృదయాంతరాళంబుల వ్రేలు మంగళసూత్రంబులు మనోగతదుఃఖాతిరేకంబులఁ దస్తంబు లగుచున్నవి. ధృతరాష్ట్రాగ్నిహోత్రాయతనంబున వరళులు ప్రవేశించి గగ్గోలు పరుచుచున్నవి. గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు ప్రశాంతము లయినవి. సాధ్వీకులాలంకారయగు గాంధారిముఖంబున దీనరసప్రాదుర్భావ మగుచున్నది. దుర్మార్గులకతంబున వంశోపప్లవంబు సమీపించుచున్నది. మీమీప్రతాపంబులు నిమిత్తమాత్రంబులు గావున నీప్రతిజ్ఞ నెఱవేఱును. ఇది కాలముకాదు; కోపంబుఁ జూపింప నిది యదనుకాదు. గురుభక్తికలవాఁడవు. కావున నీ కుపదేశింప నామన ముత్సహింపుచున్నది. అగ్రజాజ్ఞ నాదరింపుము.

భీము—(అసహ్యముతోఁ దలవంచుకొని చతికిలబడుచున్నాఁడు.)

గాంధా—నాయనా! విదురా! నీప్రభువునకు సవిస్తరముగ నీవిషయముఁ దెలియఁజేయుము.

విదు—(ధృతరాష్ట్రుని సమీపించి) మహాప్రభూ! పాండవరాజసూయవైభవసందర్శనసంజనితామయాక్రాంతుఁడగు దుర్యోధనుం

డు మాయాద్యూతనెపంబున ద్రౌపది నీడిచికొని సభాంత
రాళమున వివస్త్రం జేయ దుశ్శాసనుండు నడుముకట్టికొని
సుయోధన రాధేయానుమతంబున వలువ లొలుచుచుండు
కతంబున భవదగ్నిహోత్రశాలలు నక్కలకు నివాసంబయ్యె.
అగ్నులు చల్లారినవి. ఉత్పాతంబు లుద్భవిల్లినవి. ఇంక వంశ
క్షేమము పుత్రుని ప్రాణరక్షణయు సేయుభారము దేవర
యధీనమయియున్నది.

ధృత—నాయుపేక్షయే యింత తెచ్చినది. నాయనా! సుయోధనా!

చ. పరమపతివ్రతన్ సభఁ దపస్విని పాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిగాఁ దలంచి దె
బ్బరములువల్కఁగాఁ దగునె బాల్యమునాదిగ దుష్టభావనం
బెఱిఁగితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్.

నాయనా! పలుమారు విదురనీతి యాధారముగ నడువుమను నా
నుడువులఁ జెడచెవి నిడి కులమున కుపద్రవంబు తెచ్చిపెట్టు
కొంటివి. ఇంకనైన ధర్మాత్ము లగుపాండవులపై దురాగ్రహం
బు మానుము. సకలబాంధవహితంబుగ నేఁ జేయఁదలంచిన
దాని కంగీకరించుము. నిత్యము ప్రాతఃకాలంబున వంద్యురా
లగు నీవధూటికకు నమస్కరించి పాపములం బాపికొనుము.
విదురా! అమ్మాయిని పాంచాలిని నిటు బిలువుము.

దుర్యో—(అసహ్యముతోఁ దొలఁగిపోవును.)

గాం—ఏది కోడలు?

విదు—(ద్రౌపదిని సమీపించి) సాధ్వీ!

ద్రౌప—(గాంధారిని సమీపింపవలయు.)

గాం—అమ్మా! పాంచాలి!

విదు—అదుగో! పాదాభివందన మొనర్పఁ బూనుచున్నది.

గాం—(లేచి ద్రౌపదిని కౌఁగిలించుకొని) అమ్మా! సతీమణీ! నా వంటి పెద్దదానిచెంత నాకడుపు చెడఁబుట్టిన కుమారులకతంబున నీకుఁ గలిగిన పరాభవము సహించుము. లోకంబునగల స్త్రీజనంబులకెల్లఁ దలకట్టగు పాతివ్రత్యమహిమావిభవంబుఁ బ్రకటించిన నీపవిత్రశరీరమునుఁ గౌఁగిలించుకొననిమ్ము. మా వంశమును దరింపఁజేయుటకు నవతరించిన శ్రీమహాలక్ష్మివి. నీపాదోదకము సకలసీమంతినీసీమంతధారణాయోగ్యంబు. నిద ర్శనంబు సమస్తపాపక్షయంబు. నీనుడి బ్రహ్మస్వరూపంబు. నిన్ను స్పృశించినఁ బాపాత్ముల పాపంబులు నాశంబులగును. నీ కపకార మొనరించిన దురాత్ముల పాపంబులు, నీకరుణాకటాక్షవీక్షణపరిసారము లేనిది యెన్నటికిని నశింపనేరవు. ఇటు రమ్ము. (అని ధృతరాష్ట్రుని సమీపమునకు దీసికొని పోవలయును.)

ద్రౌప—పాండవపట్టమహిషి, కురుకుమారపరాభవీభూత, ద్రౌపది నమస్కరించుచున్నది. (అని నమస్కరించవలయు.)

ధృత—అమ్మాయి! నీవు నాకోడండ్రయందుఁ బూజనీయురాలవు. నాకోడం డ్రనేల? స్త్రీసముదాయములకెల్ల వందనీయవు. తల్లీ! స్త్రీల కననేల? పుణ్యులగు పురుషావళికెల్ల స్మరణీయసుగుణగణ్యవు. కావున నుపేక్షాదోషమున నేఁ జేసిన నానేరము సైచి "పితృసమోజ్యేష్ఠః" యను న్యాయంబున జ్యేష్ఠుని యిల్లాలవు గావున,నీమఱందులగు సుయోధనాదుల కుమారులుగా భావించి వారలపైఁ గోపంబు నాకుగా సైచుము. సాధ్వీ! నీకుఁ బ్రియంబు సేసెద. నీయిష్ట మెద్దియో వేడుము.

ద్రౌప—మహాప్రభూ ! యీసేవకురాలు తమ కాశీర్వచనపాత్రు రాలు గాని స్తుత్యర్హురాలు కాదు. ధర్మమే జయమని నమ్మిన దానను. దయచే నాకు వరము ప్రసాదింపఁ దలంచితిరేని, దయామయుండవు గావున మనునిభుండవై, ధర్మస్వరూపుండయిన ధర్మనందనునిదాస్యంబుఁ బాపవలయు. ప్రభువు లొల్లఁ గటా క్షించిన నహంకారాభిమానులగు కురుకుమారులు కురువృద్ధ జనలాలితుండై పెరిగిన ప్రతివింధ్యుని దాసపుత్రుం డనకుం దురు. ఇదియ నాయభీష్టంబు.

ధృత—అమ్మాయి ! అట్లొసంగితి; రెండవవరము వేఁడుము.

ద్రౌప—భూపాలతిలకా ! దయాస్వరూప ! నాయభీప్సితంబు నెఱ వేర్పఁదలంచితిరేని, యుధిష్ఠిరు నలువురుసోదరులును తమ యాయుధములతోడను, వర్మవరూధినులతోడను, దాస్యనిర్ము క్తులు కావలయును.

ధృత—సాధ్వీ ! నీకోరినవరంబు లొసగితి నింక మూఁడవవరంబు వేఁడుము.

ద్రౌప—దయాస్వరూపులగు తా మెన్నియైన వరంబు లొసంగ సమర్థులు. కాని కోరుటకు నా కధికారము లేదు. కోమటి జాతియం దుద్భవించిన సాధ్వికి నొక్కవరమును, క్షత్రియాం గనకు రెండువరములును, శూద్రజాతిసతికి మూఁడువరంబు లును, బ్రాహ్మణసతికి నూఱువరంబులును వేఁడ నధికారము కలదు. కావున నెక్కువ కోరఁజాలను.

ధృత—మహాధర్మస్వరూపురాల వగు నీకుం దెలియని ధర్మరహస్యం బులు కలవా ? నీసుగుణములకు మెచ్చితిని. నీవు కోరకయే వరంబు లిచ్చెద. నాయనా ! యుధిష్ఠిర ! సోదరసహితుండవై యొకపరి యిటు రమ్ము.

పాండ—(పాండవులువచ్చి ధృతరాష్ట్రునకు నమస్కరించవలయు.)

ధృత—అబ్బాయి ! ధర్మనందనా ! నీవు సదావృద్ధోపసేవివి. ఎల్లధర్మములు నీవె యెఱుంగుదువు. తెలియక నీకెగ్గుచేసిన నాకుమారుని నేరము సైచుము. ఉత్తమపురుషుండు పరులనేరములఁ దలంపకుంటయు, ఓర్పు కలిగియుంటయు, గుణంబులఁగ్రహించి దోసంబుల విడుచుటయు సహజముగాఁ గలిగియుండు. ఉత్తమగుణావలంబనుండవగు నీవు క్రోధము మనంబునఁ జేరనీయవు. కావున ననుజసహితుండవై స్వరాజ్యంబుగొని సకలసంపదలతోఁ దులఁదూగుచు నెప్పటియట్లు నింద్రప్రస్థపురంబున కరిగి సుఖంబుండుము. ఏను వెనుకముందు యోచింపక జూదంబుపేక్షించితి. అల్పబుద్ధిసత్త్వుండనయి వృద్ధుండనయిన నన్నును మీతల్లియయిన గాంధారిని దలంచి, దుర్యోధనాదులు సేసిన దుర్ణయంబులఁ దలఁపకుండునది. సర్వశాస్త్రవిదుండయిన విదురుఁడు మంత్రిగా సర్వధర్మవిదుండవయిన నీవును రక్షకులయిన, కురుకులంబు క్షేమంబుగా నుండును. వంశమును కాపాడుభారము నీయది. నీకొండుకోరిక కల్గినఁ గోరుము.

ధర్మ—తండ్రిగారికోరిక దీర్చుటయె నాయభీష్టంబు. రాజులు దాయాదద్వేషముమాని యన్యోన్యప్రియులై సతులు సాధ్వులై వంశములకును దేశములకును శుభములు సమకూర్చి పతివ్రతామహిమాభిరామలయి యుండునట్లాశీర్వచింపుడు. లోకజాలంబు శుభంబుగా నుండుటయె నాయభీష్టము. పాపము శాంతించుఁగాక ! శుభములు వర్ధిల్లుఁగాత !!

సంపూర్ణము.

# వృద్ధవివాహము

గ్రంథకర్త: గోమఠం వెంకటరంగాచార్యులుగారు.

యథార్థముగాజరిగిన యితివృత్త మాధారముగాగొని నూతనముగా రచింపఁబడిన నైదంకముల నాటకరాజము. జారత్వమువలన కలుగుపషము, వేశ్యాపిశాచపీడితవిధానము—దుష్టస్నేహఫలము—వృద్ధవివాహములవలన కలుగునష్టములు, కనులకద్దము గట్టినట్లు గాన్పించు నాటకరాజము. పెండ్లికొడుకగు దోసకాదిదుర్గుణములు తెలివితక్కువ వర్ణనాతీతము. సత్యవతి ముసలిభర్తనురోసి యిచ్చవచ్చినట్లు వ్యభిచరించి కడకు బిచ్చమెత్తుకొనశక్తిలేక ఏడ్చుచుండగా విని తీరవలసినది. న్యాగ్సుకలవు. వెల రు 0-12-0

# రాధాకృష్ణలీల

గ్రంథకర్త:-కంచెర్ల వేంకటహనుమయ్యగారు.

చంద్రిముఖి గర్వము, మానినిహితోపదేశము, నారమునికలహప్రియత్వము, కృష్ణభగవానునియోరిమి, రాధభక్తి, వేదవునివెఱ్ఱి పంచాంగపుబ్రాహ్మణుని హాస్యము, రాధ చెలికత్తెయొక్క సర్సాలాపములు........అతిమనోహరములు. చంద్రిముఖిగర్వభంగవిధానము, మాయావేదవ్రులచిత్రినటన, కృష్ణుఁడే వేదవులరూపమున నరుదెంచి తన గర్వపరిహారమొనర్చెనని తెలిసికొని యాతనిసుతియించుట. చక్కనిసాంగుసుకలవు. వెల రు 0-12-0

## రసపుత్రవిజయము.

గ్రంథకర్త:-ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు.

దేశభక్తిపరిపూరితమయి, ఆంధ్రదేశరంగస్థలములం దంతటను వీరతాండనము సల్పిన వీరరసప్రధానమగు నాటకరాజము.

ఏరసపుత్రవీరజ్యోతి హైందవ సామ్రాజ్యలక్ష్మీధురంధరుండగు నాలంఘీరుబాదుషా నుమూర్తిలూగించెనో, ఏప్రచండవీరావతారము రాజకీయరంగమున శాత్రవగజములకు సింహస్వప్నమై యలరారుచుండునో యట్టి మేవాడుమార్యక్షుమగు రాజసింహుని దివ్యచరిత్ర. ఠాకూర్ దుర్గాదాసు సన్యాసివేషమున స్వాతంత్ర్య సంపాదనముచేసిన దీనాటకరాజముననే. వీరమాత మహావీరమాతయై విలసిల్లి నది. విమలమానసయగు విమల విమలమనస్కయెనది. ఇప్పటిట్టినాటకరాజము తెల్గున రచియింపఁబడుటలేదు. వెల రు 1-0-0

## రోషనార

## అను

## జహ్వారిబాయి.

గ్రంథకర్త:-బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారు.

మహారాష్ట్రరాజ్యసంస్థాపకుఁడగు శ్రీశివాజీమహారాజు దర్బారు—రోషనార శృంగారసంభాషణాదికములు—శివాజియొక్క పరాంగనాపరాఙ్ముఖత--రామసింహుని దేశభక్తి—రామోజీయొక్క ద్రోహత్వము—మోఅజీముయొక్క వేశ్యాలోలత-రజాక్ దావూదు లహాస్యప్రసంగములు—జహ్వారియొక్క నిష్కళంక ప్రేమ-భగ్నమనోరథమైనప్పు డెడతెగక పారురక్తప్రవాహము మున్నగువిశేషాంశములతో వ్రాయఁబడి యనేకస్థలముల ప్రదర్శింపఁబడిన కథయిదియే. చక్కని సొంగ్సుకలవు. వెల రు 0—12—0

# రాణాప్రతాపసింగ్

గ్రంథకర్త:—ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు.

అద్వితీయరాజనీతికోవిదుండగు అక్బరుపాదుషాయంతవాని సాధింపనెంచి యిరువది సంవత్సరములకు పైగా నాటవికులమధ్య దా రాపుత్రులతో బడరానియిక్కట్లకుఁ బాల్పడి తుట్టతుదకు మ్లేచ్ఛ సార్వభౌముని మహాసైన్యమును తదరిక్షకులగు హిందూమహమ్మ దీయదండనాయకులను స్వకీయ మహాబలప్రసారంబున దూదిబుంగ లవలె పారదోలి శత్రువర్గమునకు లోబడినదుర్గములతోబాటు రాజ ధానియగు నుదయపురమునుగూడ స్వాధీనముచేసికొని మేవాడు రాజ్యలక్ష్మికి మ్లేచ్ఛసంపర్కకళంకమును లేకుండచేసి రసపుత్రప్రతి ష్ఠ పునరుద్ధారణచేసిన రాణాప్రతాపసింహునిచారిత్ర మత్యద్భుత ముగా వర్ణింపఁబడినది.

వెల రు 1-0-0

# వేడుకపెండ్లిపాటలు

గ్రంథకర్త: తెన్నేటి తిరుమలరావుగారు.

ఇందు వివాహసమయములందు వేడుకసమయములందు పాడు కొనుటకు చక్కని వరుసలతో ముద్దులుమూటగట్టు పాట లనేకము లు గలవు. ఇతరసమయములందు పాడుకొనుటకు వేళాకోళముపా టలు బూజముబంతిపాటలు—తలుపుదగ్గరపాటలు పిలుపుపాటలు అలకపాటలు మేలుకొలుపులు మంగళహారతులు మొదలగుపాటలు స్వరపరచి జంత్రగాత్రముల నుపయోగించుకొనులాగున రచియింపఁ బడినది.

వెల 0—8—0

# ప్రతాపరుద్రీయము

గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు.

ఇందు చెకుముకిశాస్త్రి చాతుర్యము, జనార్దనమంత్రి యుక్తి ప్రయుక్తులు, తురకల [illegible], యుగంధరుని కార్యనిర్వాహకత్వము, చాకలిపేరిగాని నవ్వుపుట్టించు హాస్యము, పిచ్చివాని యయుక్తములగు చేష్టలు, చెకుముకిశాస్త్రి జ్యోతిషము చదివిన కొలది యు చవులూరఁ జేయుచుండును. ఢిల్లీలో పిచ్చివాని "ఢిల్లీసుల్తాన్ పట్టుకుపోతాన్" అను కేకలు, చేష్టలు, అల్లరులు తమాషాలు చూచిన నాశ్చర్యము. యుగంధరుఁ డనేక మాయోపాయములు పన్ని రత్నసరకుతో తనకోటయందున్న వీరిసెట్టి ముస్లిగువానిని ఢిల్లీసుల్తాను దర్శనమునకు వెళ్ళునట్లు జేసి విశ్వప్రయత్నమున ప్రతాపరుద్రుని బందెనుండి విడుదలచేసి సుల్తానును కూడ బంధించి తీసికొనిపోవుట మొదలగు నంశములతో మనోహరములగు పాటలతో విరాజిల్లుచున్నది.

వెల రు 1—0—0

# పాదుకాపట్టాభిషేకము

(గ్రంథకర్త:—కొడాలి సత్యనారాయణరావుగారు.)

ఇందలికథ యెఱుంగనివా రాంధ్రులలో నుండరు. శ్రీరామచంద్రుని పితృభక్తి, దశరథుని ధర్మనిష్ఠ, మంథర కుటిలాలోచనములు, కైక దుండగములు—సీతా మహాదేవి పతిభక్తి, లక్ష్మణుని సహోదరవాత్సల్యము—గుహుని పవిత్రభక్తి, భరతుని నిష్కామత్వము—భ్రాతృప్రేమ, కైక పశ్చాత్తాపము—మంథర పరాభవము మొదలగునంశములు హృదయరంజకముగా విపులముగా వర్ణింపఁబడి మరల మరల చదువుమని ప్రేరేపింపఁజేయు నాటకమిదియే. రు. 1.

# మహానంద.

గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు.

ఇదియొక యత్యద్భుతమగు కథాంశము. కేవల పరమేశ్వరుం డగు శంకరుండే కథానాయకుండు. మానవకాంతయే కథానాయిక. ఇందు శివభక్తి పరాయణురాలగు మహానంద భక్తి వర్ణనాతీతము. విటుల ప్రోద్బలము, వేశ్యమాత కుటిలాలోచనము, దానికిం దగిన ప్రతిఫలములు, శంకరుని మాయానటనము, శంకరుం డొసంగిన లింగము పావనపట్టము భస్మమగుట, మహానంద విచారించి మరణించుట శ్రీయకక్కసెల్లెండ్రతో గంగాపార్వతులుగా మాటుటమొదలగు సంశములతో, క్రొన్ననఘ సీసములతో, నేర్చుకొనుట కనువగు విశేషనీతులతో, జారులు తమ జారత్వమునకు దిలోదకము లొసంగ జేయునట్టి సుగుణములతో నలరారుచున్న నాటకము. రు 1—0—0

# కనకతార.

గ్రంథకర్త: - విద్వాన్ ములుగు చంద్రమౌళిశాస్త్రిగారు.

ఇందు నంతఃపుర పరిచారికయగు రదనిక ద్రవ్యార్జనకై దుర్మార్గమునకు గడంగుట—రదనికను లోఁబరచుకొని దుష్టబుద్ధి తనసోదరుండైన వీరసేనుని బాధించి వదినగారగు చారుమతిని బలిమిని బట్టముకింపగా నామహాసాధ్వి మానభంగమున కోడి సముద్రమున బడుట—తారా కనకసేనుల జంప దుష్టబుద్ధి నియోగించుట, వారల విచారము—తారాకనకసేను లరణ్యంబుల పెక్కులగు నిడుముల నొందుట, పల్లెవాండ్ర హాస్యకరములగు సంభాషణము, కనకసేనుని దర్బారు—కనకసేనుఁడు దుష్టబుద్ధిని నిర్జించుట మున్నగు విషయము లన్నియు చక్కఁగా వర్ణింపఁబడినవి. చక్కని సాంగ్సుకలవు.

వెల రు 0—12—0

---

వలయువారు సరస్వతీబుక్ డిపో, బెజవాడ, అని వ్రాయవలెను.